శ్రీ

# సారంగధర చరిత్రము.



చేమకూర - వేంకటపతి

ప్రణీతము.

వేదము - వేంకటరాయశాస్త్రిచే

స్వరచిత వాఖ్యతో

చెన్నపురిలో

స్వకీయ

జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.



1910

దీనివెల రు. 1-4]  [Price Rs. 1-4.

# వి ష య సూ చి క.

## ప్ర థ మా శ్వా స ము.



## ద్వి తీ యా శ్వా స ము.

# తృతీయాశ్వాసము.

# విజ్ఞప్తి.

---

'మాత్రా స్వస్రా దుహిత్రా వా నో వివిక్తాసనో భవేత్,
బలవా నిన్ద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి.'

అను గీతోక్తమయిన లోకపరిపాటికి కడుదవ్వువాఁడై,

'ఘృతకుమ్భసమా నారీ తప్తాఙ్గారసమః పుమాన్.'

అని నీతికోవిదవాక్యమునకు ఉదాహరణభూతయై మదనుని యుండగముచేత వావిసెడినదై తన్నుం బయికొన్న నవమోహనాంగికి బుద్ధిసెప్పి,

'అనార్యతా నిష్ఠురతా క్రూరతా నిష్క్రియాత్మతా
పురుషం వ్యఞ్జయన్తీహ లోకే కలుషయోనిజమ్.'

అను మనూక్తికి వ్యాఖ్యానముగా,

'తమ తల్లి పురంధ్రీ జా
తమతల్లి గదా తదీయ తనయుఁడఁ, దన కో
రమణీ, యేతటి నైనను
రమణీయేతరగుణంబు దా నేర్చునొకో ?'

అని తన తల్లి సాధ్వీమతల్లి యగుటంబట్టి తనప్రకృతికి శీలభంగగుణము విరుద్ధ మని వక్కాణించి, శీలముకై కాలుసేతులు దండ మర్పించిన మహాపురుషునికి సారంగధరునికి సాటి యెందుఁ డేఁ గలఁడు! ఊర్వశివలపును వీటిఁబుచ్చిన యర్జునుఁడును వరూథినిం ద్రోచిచనిన ప్రవరుండును అట్టి యాదిట్టతనంబునకై యిట్టి చెట్టం బొరయ రైరి గదా.

అట్లడంకువతో దండనం బరిగ్రహించిన యా మనోనిగ్రహమునకు ఫలముగా మత్స్యేంద్రనాథునికరుణం గాలుసేతుల కాక మహాయోగసామ్రాజ్యంబును బొంది, తండ్రిపారఁబాటు నెన్నక తలిదండ్రులం బోయి దర్శించి, వారివెతం దీర్చి, వారికి వంశకర సుతోత్పత్తి గలుగు నని తెలిపి నిజగురు సాన్నిధ్యముం జేరిన యీ మహాసత్త్వుని భవ్యచరిత్రముం గొనియాడ వలయు రసనలు ఆశేషాహికిం దక్కఁ . శేషులకుం గలుగునే !

అట్టి యీపుణ్యచరిత్రంబును పుణ్యవిశేషలబ్ధ తదనుగుణ మృదు మధుర సరస వాగ్వైభవంబున, అమృతపుఁగూర వేంకటపతి యనం దగిన, చేమకూర వేంకటపతి యను

కవివరుండు తెనుంగునం బద్యకావ్యముగా రచించి, దేశభాషలం దెల్ల ఈ భాషను లెస్స చేసిన మేటులలో గణనీయుఁ డాయెను. ఎల్లవారును బఠించి కథానాయకునిసుశీలమును మెచ్చి తామును సుశీలురై పుణ్యరాశిని సముపార్జింప సాధనం బయిన యీ దివ్యప్రబంధము సాహసికముద్రణములపాలై కవితీవియపూదండ చెత్తతొట్టిం బడినదో యను కరణిం బురణించుచుండం గని, చింతించి, పాటుపడి బాగుపఱిచి ఈ ముద్రణమును సుఖతర బోధార్థము సటీకముగా నెలకొల్పినాఁడను.

ఈ చేమకూర చక్కెర మడిలో అమృతము పాతించి పెంచినదిగాని మట్టిలో నీరు పాతించి పెంచినది గాదు. ఇందు పూమొగ్గలు వోలె తామే విడుశ్లేషలును, ద్రాక్షా పాకంబున నోరూర రసమొల్కు రచనలును, సదాచారాభిమానముం బురికొల్పు ధర్మ్యనిబంధననైపుణియు, విసిగింపని వర్ణనలును, బరువులు నెరువులుం గాని కబ్బంపుఁ దొడవులును, ఈ ప్రబంధమును భారతీభాండాగారమందు కడు నుచ్చస్థానమందు నెలకొల్పుచున్నవి.

ఈ పావనచరిత్రముయొక్క కథాపురుషులు రాజమహేంద్రవరము నేలిన రాజరాజనరేంద్రుండును తత్పుత్రుఁడు సారంగధరుఁడు నని యాంధ్ర దేశమున వాడుక కలదు. కాని ఈ గ్రంథమునందు ఈ రాజరాజనరేంద్రుఁడు మాళవరాజుగా చెప్పఁబడియున్నాఁడు.

మఱి యీకథకు మూలమనం దగినట్టిది చౌరంగి యను మహాపురుషునికథ నాథ చరిత్రములం దిట్లున్నది:—

రుద్రపురమున భులేశ్వరుఁ డనురాజు ఏలుచుండెను. అతనికి చంద్రావతి యని పట్టపుదేవియు, చంద్రావతీనగరీపతి యగు సుభద్రుని కూఁతురు స్వయంవరలబ్ధ శోభావతి యని మఱియొకదేవియు నుండిరి. శోభావతి సవతిని చంద్రావతిని వెలార్చుటకై ఆమెపై అంకులు మోపి రాజును నమ్మించెను. అంతట రాజు ఆమెను అరణ్యములో తల నఱుకు మని మంత్రి కప్పగించెను. మంత్రి యాసాధ్విని గర్భిణిని సంహరింప నొల్లక యడవిలో నొక శివాలయముకడ వదలిపోయి రాజుతో సంహరించినట్లే చెప్పెను. అచ్చటికి శివసేవార్థము వచ్చిన యొక్కగంధర్వకన్య చంద్రావతిం గాంచి కనికరించి యామెకు మత్స్యేంద్రవ్రతము నుపదేశించెను. అనంతరము చంద్రావతి శుచిశ్రవసుఁ డను మునీంద్రుని యాశ్రమమునకుం జని యట మునిపత్నులప్రాపున నుండి కుమారుం గనియెను. వానికి మునులు చంద్రశేఖరుఁ డని నామ మిడి యథాకాలమున సకలసంస్కారములను తామే కావించిరి. తల్లి వానికి మత్స్యేంద్రోపాస్తి నుపదేశించెను.

ఇట్లుండ రుద్రపురములో భులేశ్వరుఁడు జన్నంబుఁ గావించెను. అందులకు శుచిశ్రవుఁడు శిష్యసమేతముగా నరిగెను. యజ్ఞభూమికడ మునిశిష్యులు బంతి యాడు

చుండ శోభావతి వారిలో చంద్రశేఖరుఁ గాంచి మోహించి వానిబంతిని తనచేటిచేత తెప్పించికొనియెను. బంతి యడుగఁ బోయిన చంద్రశేఖరునికిని శోభావతికిని - పావురము నడుగంబోయిన సారంగధరునికిని చిత్రాంగికిని - జరిగిన వృత్తమే జరిగినది. దురాచారము నకు లోఁబడని యా మహానుభావునికి చంద్రశేఖరునికి భులేశ్వరుఁడు శోభావతీ ప్రేరణం బున కాలుసేతులు (సప్తశృంగమను కొండకడ) తలారులచేత తఱిగించెను. ఆ నొప్పిలో చంద్రశేఖరుఁడు మత్స్యేంద్రనాథ స్మరణ గావించుచుండెను. అంతట చంద్రశేఖరునికి శివపుత్త్రుఁడు మత్స్యేంద్రనాథుడు ప్రత్యక్షమాయెను. వెంటనే వానికి కాలుసేతులు వచ్చినవి. దేవతలు వానికి చౌరంగి యని పేరిడిరి. మత్స్యేంద్రనాథుఁడు వానిం దోడ్కొని పోయి తల్లి కొసంగెను.

ఇంతలో రాజు తథ్య మెఱుకవడి శోకించుచుండ మత్స్యేంద్రనాథుఁడు ఆతనికి ప్రాయశ్చిత్తముగా శివాలయము నిర్మింపు మని యానతిచ్చెను. రాజు అట్లే గావించెను. భులేశ్వర మనుపేరి యాశివాలయము బదరికాశ్రమమున భక్తుల పాపములను హరించుచు విరాజిల్లుచున్నది.

[మత్స్యేంద్ర నాథునికుమారుఁడు మీననాథుఁడు. ఏతద్గ్రంథ ప్రాచీనముద్రణ ములలో సారంగధరు ననుగ్రహించిన మహాయోగిని పలుమాఱు పేర్కొనుటలో మత్స్య శబ్దము కొన్నిమాఱులు మీనశబ్దము కొన్నిమాఱులును గలవు. అయినను యతియందు మత్స్యశబ్దమే యుండుటంబట్టియు చౌరంగిని రక్షించినవాఁడు మత్స్యేంద్రుండ యగు టంబట్టియు ఆనామము అన్నియెడలను మత్స్యేంద్రనాథుఁడుగానే యుండనోపు నని హెచ్చరిక.]

ఈ వేంకటకవి శూద్రుఁ డనియు తంజావూరి రఘునాథనృపుని సభలో క్రి. శ. 1630 - సంవత్సరముల యప్పుడు విలసిల్లుచుండె ననియు చరిత్రశోధనలవలన నెఱుక పడుచున్నది.

వేదము - వేంకటరాయశాస్త్రి.

శ్రీ.

# సారంగధరచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

క. శ్రీధుర్య, శౌర్యధైర్య
క్ష్మాధరమూర్ధన్య, యాదిగర్భేశ్వర, వి
ద్యాధిక, వితరణదీక్షా
రాధాసుత, యచ్యుతేంద్రరఘునాథనృపా. ౧.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన సారంగధరచరి
త్రం బను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన.— ౨.

—* రాజనిర్దేశము. *—

క. రాజనరేంద్రుఁడు రిపుఫణి
రాజనరేంద్రుఁడు కళా పరాక్రమరేఖా
రాజితభోగ పరాజిత
రాజ న రేంద్రుఁడు సుధాకరకులుం డలరున్. ౩.

టీక.—రిపు...ద్రుఁడు—రిపు = శత్రువులనెడి - ఫణిరాజ = సర్పశ్రేష్ఠములకు - నరేంద్రుఁడు=విషవైద్యుఁడును, కళా...ద్రుఁడు—కళా = కాంతిచేతను - పరాక్రమరేఖా = శౌర్యలక్షణములచేతను - రాజిత = ప్రకాశించునట్టి - భోగ = సుఖముచేతను- పరాజిత = ఓడింపఁబడిన - రాజ = చంద్రుఁడును - నర = అర్జునుఁడును - ఇంద్రుఁడు = దేవేంద్రుఁడును కలవాఁడును, సుధాకర కులుండు = చంద్ర వంశమువాఁడును, (అగు), రాజనరేంద్రుండు = రాజనరేంద్రుఁ డను పేరుఁగలరాజు, అలరున్ = ఒప్పుచుండెను.

సీ. తనయభ్యుదయము నిత్యము గోరి నిజసుహృ
ద్ద్విజబంధువ్రాతంబు వేడ్క నుండఁ,

బగ లెందుఁ బొడ గానఁబడ కుండ నడఁచినాఁ
డమృతమే యారూప మయ్యె ననఁగఁ,
దనపాదములకును దమతలలకు లంకె
పా టని దుర్గాధిపతులు వల్కఁ,
జల్లఁదనము గల్గుసన్మార్గవర్తి మేల్ !
మాయన్న యని ప్రజల్ గాంచి మ్రొక్కఁ,
గీ. జారచోరాదులకు భీతి సంఘటిల్ల,
సహితచక్రము లల్లల నాడుచుండ,
నేలె నారాజు కువలయ మింపు దనర,
నాడి తప్పక భరతమర్యాద వెలయ. ౮.

టీక.— ఈపద్యములో రాజనరేంద్రునియందు చంద్రత్వారోపముచేత అర్థద్వయము కలదు. తన, అభ్యుదయము = అధికశ్రేయస్సును, నిత్యము కోరి, నిజ...తంబు— నిజ = స్వకీయులైన - సుహృత్ = స్నేహితులయొక్కయు - ద్విజ = బ్రాహ్మణులయొక్కయు - బుధ = పెద్దలయొక్కయు - వ్రాతంబు = సమూహము, వేడ్కన్ ఉండన్ = సంతోషించుచు నుండఁగా (అని రాజరాజనరేంద్రపర మైనయర్థము); తన, అభ్యుదయము = అధికవృద్ధిని, నిత్యము కోరి, నిజ సుహృత్ = తన సఖులైన - ద్విజ= (చకోర) పక్షులయొక్కయు - బుధదేవతలయొక్కయు - (వ్రాతంబు వేడ్క నుండన్) (అని చంద్రపర మైనయర్థము); పగలు= ద్వేషములు, ఎందున్ పొడ గానఁబడ కుండన్, అడఁచినాఁడు = నశింపఁజేసినాఁడు, అమృతమే, ఆరూపము = ఆరాజుసౌందర్యము, అయ్యెన్ అనఁగన్ (అనిరాజరాజనరేంద్రపరము); పగలు = అహస్సునందు, ఎందున్ పొడ గానఁబడకుండన్, నడచినాఁడు=సంచరించినాఁడు, అమృతమే ఆరూపము అయ్యె ననఁగన్ (అమృతస్వరూపుఁ డనుట, అనిచంద్రపరము); తత్పాదములకున్=ఆరాజుచరణములకును, తమతలలకును, లంకెపాటు అని = మిక్కిలికలయిక యని, దుర్గా(గ్గ+అ)ధిపతులు = దుర్గముల దొరలు, పల్కన్ (అని రాజనరేంద్రపరము); తత్ = ఆచంద్రుని యొక్క - పాదములకున్ = నాలవభాగములకును (చంద్రఖండముల కని భావము), తమ తలలకున్=తమశిఖలకు, లంకెపా టని, దుర్గా (గ్గా+అ) ధిపతులు=రుద్రమూర్తులు, పల్కన్ (అని చంద్రపరము); చల్లఁదనము=శాంతత, గల్గు, సన్మార్గవర్తి=మంచిత్రోవను చరించువాఁడు(న్యాయమార్గస్థుఁ డనుట), మేల్ =శహబాసు, మా యన్న= మా తండ్రి, అని ప్రజలు కాంచి మ్రొక్కన్ (అని రాజనరేంద్రపరము); చల్లఁదనము గల్గు, సత్ =

నక్షత్రములయొక్క - మార్గ = త్రోవయందు - వర్తి = సంచరించువాఁడు (ఆకాశము నందు సంచరించువాఁ డనుట), మేల్, మా యన్న = లక్ష్మికి అన్న, అని ప్రజలు కాంచి మ్రొక్కఁగ (అనిచంద్రపరము); జార...టిల్లఁగ — జారచోరాదులను రాజు దండించె ననియు - వెన్నెలలో వారు సంచరింప వెఱతు రనియు భావములు; అహితచక్రములు— అహిత = శత్రువులయొక్క - చక్రములు= రాజ్యములు, అల్లలఁగ ఆడుచుండఁగ = అల్లాడుచుండఁగా (అని రాజనరేంద్రపరము); అహిత=శత్రువు లైన - చక్రములు = చక్రవాకములు, అల్లలనాడుచుండఁగ (అనిచంద్రపరము); ఆడి తప్పక = పలికి బొంకక (నాట్యములో తప్పు చేయక అనియు), భరత మర్యాద = (చక్రవర్తియైన) భరతుని స్థితి, వెలయఁగ=ప్రకాశింపఁగా (భరతచక్రవర్తివలె ననుట—నాట్యాచార్యుఁ డయిన భరతమునివలె ననియు) (రాజచంద్రులకు సమార్థము), కువలయము = భూమండలమును (అని రాజపరము), కువలయము=కలువను (అని చంద్రపరము) ; ఆరాజు=ఆరాజరాజనరేంద్రుఁడు-ఆచంద్రుఁడు (చంద్రునివంటివాఁడయిన రాజరాజనరేంద్రుఁ డని భావము), ఏలెఁగ.

గీ. మహిని రాజనరేంద్రుఁడు మాళవపతి
రాజరాజనరేంద్రుండు రాజరాజు
ననఁగఁ జే రెన్నికకు నెక్కి యతిశయిల్లు
నింద్రవిభవుండు రాజమహేంద్రవిభుఁడు. ౫.

టీక.—మాళవపతి = మాళవదేశపురాజు. రాజ మహేంద్ర విభుఁడు = రాజశ్రేష్ఠుఁడైన రాజు.

—* రా జ భా ర్య లు. *—

క. కల రాయిలరాయునికిం
గులసతి రత్నాంగి, భోగకుటిలశిరోజా
తిలకము చిత్రాంగియు, నన
నెలజవ్వను లిరువు రంబుజేందునిభాస్యల్. ౬.

టీక.—ఆ యిల రాయనికిఁగ=ఆ భూ పతికి (రాజరాజనరేంద్రునికి). కులసతి= స్వజాతిది యై పతివ్రత యైనభార్య. భోగ కుటిలశిరోజా తిలకము=భోగ స్త్రీలలో శ్రేష్ఠురాలు. ఎలజవ్వనులు= లేఁతయౌవనము కలవారు. అంబు...స్యల్ —అంబుజ=కమలము తోను - ఇందు = చంద్రునితోను - నిభ = సమానమైన - ఆస్యల్ = ముఖములుగల స్త్రీలు. రత్నాంగి అంబుజనిభాస్య యనియు, చిత్రాంగి ఇందునిభాస్య యనియు, క్రమప్రాప్తము; దానిచే అంబుజేందులకుం బోలె వారికిని పరస్పరవైరము సూచితము.

—* రాజమంత్రులు. *—

క. ఆతనికిఁ శక్తిత్రయ
రీతిం గడుఁ బెంపు గాంచిరి నయార్ణవుఁడుఁ,
నీతిజ్ఞుఁడు, మతిమంతుఁడు,
ధీతిలకంబు లరయఁ సుధీతిలకంబుల్. ౭.

టీక.— శక్తిత్రయరీతిఁ = ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులయొక్క మూఁటివలెనే. నయార్ణవుఁడుఁ (=న్యాయసముద్రుఁడును). నీతిజ్ఞుఁడు (=న్యాయమును తెలిసినవాఁడు). మతిమంతుఁడు (=బుద్ధిమంతుఁడు). ధీ తిలకంబులు = బుద్ధికి అలంకారములయినవారు. సు ధీ తిలకంబుల్ = మంచి బుద్ధి గలవారిలో శ్రేష్ఠులు.

—* సంతానచింత. *—

గీ. ఈక్రమంబున రాజనరేంద్రవిభుఁడు
నీతిరహితంబు గాకుండ నీతిరహిత
మానటుల భూమి రామరాజ్యముగ నేలు
చుండి రత్నాంగిఁ గనుఁగొని యొక్కనాఁడు. ౮.

టీక.—నీతి రహితంబు=ధర్మ హీనంబు. ఈతి రహితము = ఈతిబాధలు లేనిది. (అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, మిడుతలు, చిలుకలు, మిక్కిలి చేరువనుండురాజులు - ఈయాఱును ఈతిబాధ లనంబడును.)

సీ. సంతానరహితసంసారంబు నాయక
రత్నంబు లేనిహారంబు గాదె?
పుత్రపౌత్రాదూర మానమితసామ్రాజ్యంబు
ధాత్రిఁ జంద్రుఁడు లేనిరాత్రి గాదె?
యాత్మజవ్యతిరిక్త మగువర్తనముఁ జూడ
నారి లేనిశరాసనంబు గాదె?
సుకుమారశూన్య మానకళంకజీవనం
బలముకాళము లేనికొలను గాదె?

గీ. నందనవిహీన మైనసేనావితాన
మరయ శిఖరంబు లేనిగోపురము గాదె ?
నేత్రపర్వంబు గావించుపుత్త్రుఁ డింక
మనసు నెన్నఁడు గల్గునో వనజగంధి ? ౯.

టీక.— ధాత్రిన్ = భూమియందు. సంతా...ంబు— సంతాన = కొమారుని చేతను - రహిత = శూన్యమైన (అనఁగా కొడుకు లేని) - సంసారంబు = కాఁపురము. నాయక రత్నంబు = ప్రధాన మణి. పుమపత్య = కొమారునివలన - దూరము (అనఁగా కుమారుఁడు లేనిది). ఆత్మజ = కొమారునిచేత - వ్యతిరిక్తము = హీనమైనట్టిది (అనఁగా కుమారుఁడు లేనిది). నారి=అల్లెత్రాడు. శరాసనంబు = విల్లు. అల = ఆ. మరాళము= హంస. కొలను = సరస్సు. నందన=కొమారునిచేతను. సేనా=చతురంగబలముయొక్క - వితానము = సమూహము. పర్వంబు = పండువను.

మ. జిలుగుంబల్కులు విన్నఁ, జిన్నిగొనబుంజెయ్వు ల్గనుంగొన్న, నౌ
దల మూర్కొన్నను, ముద్దుగొన్నఁ, దనువుం దార్కొన్న, నూహింపఁగాఁ
బలుకన్ రానిసుఖంబుఁ జెందు; నటుగాఁ బంచేంద్రియోత్సాహ మై
తలిదండ్రు ల్విలసిల్లఁగాఁ దనయుఁ డేతన్మాత్రుఁడే యెన్నఁగన్! ౧౦.

టీక.—గొనబు = మనోజ్ఞమైన. చెయ్వులు = కార్యములను. ఔదలన్ = శిరస్సును. మూర్కొన్నన్ = ఆఘ్రాణించినప్పుడును. తార్కొన్నన్= ఆలింగనముచేసికొన్నప్పుడును. పంచే...హమై—పంచేంద్రియ = త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణము లనెడి యైదింద్రియములకును - ఉత్సాహమై = సంతోషమై. తనయుఁడు = కుమారుఁడు. ఏతన్మాత్రుఁడే = సామాన్యుఁడా (మిక్కిలి యధికుఁ డనుట).

ఉ. చక్కిలిగింత వెట్టినను సారెఁ గికాకిక నవ్వుచున్ బయిం
బక్కఁ బడంగఁ జక్కనికుమారుని మక్కువ మీఱ నేడ్పు రాఁ
జెక్కిలి గీఁటి యెత్తి యెదఁ జేర్చి ముచ్చట దీఱునట్లుగా
నక్కట ముద్దు లాడ వలదా? వలదా యిటువంటిభాగ్యమున్? ౧౧.

టీక.— సారెన్=మాటికి. చక్కిలిగింత = చక్కిలిగిలి. కికాకికన్ = పకపక. మక్కువ మీఱన్ = ప్రేమతో. చెక్కిలి=దవుడను. గీఁటి = మీటి. ఎత్తి = మీఁది కెత్తుకొని. ఎదన్ = ఱొమ్మున. అక్కట = అయ్యో. వలదా = అక్కఱలేదా. భాగ్యమున్ = సుకృతముకూడ.

క. ఈశ్వరకృప గద యీసక
లైశ్వర్యము లెల్లఁ బ్రాప్త మగుటకుఁ; గాశీ
విశ్వపతి మనకు నిపు డొక
శాశ్వతయశుఁ డైనసుతుఁ బ్రసాదింపఁడొకో? ౧౨.

టీక.—కాశీ విశ్వపతి = కాశియందలి విశ్వేశ్వరుఁడు. శాశ్వత యశుఁడు = స్థిర కీర్తి గలవాఁడు.

గీ. తాఁ గుమారునిఁ గని ప్రమోదంబు గాంచు
నట్టిసర్వజ్ఞుఁ డఖిలభక్తాళిఁ బ్రోచు
శంకరుఁడు మహాదేవుఁ; డాస్వామి నమ్మి
నార మఁట, మనకోర్కి యీడేఱు టరుదె? ౧౩.

టీక.—తాన్ = ఆసాంబమూర్తి. కుమారునిన్=కుమారస్వామియైన పుత్త్రుని. ప్రమోదంబు = అధికసంతోషమును. సర్వజ్ఞుఁడు = సకలము నెఱింగినవాఁడు. శంకరుఁడు = సుఖ కరుఁడు. భక్త = భక్తులయొక్క - ఆళిన్ = సమూహమును. ప్రోచున్ = రక్షించును. ఆస్వామిన్ = ఆదేవుని (సాంబమూర్తిని.)

గీ. ఇపుడు శైవవ్రతంబు లే మేమి గలవు
సలుపఁ దగు వాని; నటు లైన సఫల మగును.
భక్తజనులకు ముంగొంగుఁబసిఁడి గాఁడె,
చూడు మెలనాగ, యల చంద్రజూటుఁ డరయ. ౧౪.

టీక.—ఏ మేమి = ఏ దేది. సలుపఁ దగున్=చేయ నొప్పును. ఎలనాగ=ఓ, చెలువా (రత్నాంగీ). చంద్ర జూటుఁడు=జడముడియందు చంద్రుఁడుగలవాఁడు(శివుఁడు). ముంగొంగుఁ బసిఁడి గాఁడె= ముందటికొంగు (లో ముడిచియున్న) బంగారము సుమా.

క. నెలపూదాలుపు మనపూ
జలు మెచ్చునె యని మదిన్ విచారింపకు, చీ
కిలిమాకిలిగా నల్లిన
చెలఁది తెర లూఁచి సంతసించుట లేదే. ౧౫.

టీక.—నెల...పు—నెల = చంద్రుఁడనెడు - పూ = పుష్పమును - తాలుపు = ధరించుశివుఁడు. చీకిలి మాకిలి గాన్ = కొక్కిరి బిక్కిరిగా. చెలఁది తెరలు = సాలె

పురుగుయొక్క బూఁజుతెరలను. (పూర్వమందు శ్రీకాళహస్తిలో సాలెపురుగు అల్లిన బూఁజులను జూచి శివుఁడు సంతోషించిన కథ నిట ననుసంధింపవలయును.)

క. ఇటఁ బూజింతము నేర్చిన
యటుల గిరీశు నొకయాకు సలమునఁ, గొండం
తటిదేవరకును గొండం
తటిపత్తిరి వెట్టువారు ధరణిం గలరే? ౧౬.

టీక.—గిరీశునిన్ = శివుని.

—* సంతానముకై శివోపాసన. *—

గీ. అని ప్రియోక్తుల శివుఁ గొనియాడి యపుడు,
సకలజనములు శివపూజ సలుపకున్న
నాజ్ఞ యని చాటఁ బనిచి, శివాలయములు
ధరణిఁ గట్టించె నూరూరఁ దప్పకుండ. ౧౭.

టీక.—ఆజ్ఞ = దండనము.

క. రాజశిఖామణిపూజలు
రాజశిఖామణి యొనర్చె రమ్యదళాళిన్
రాజీవకుముదచంపక
రాజీవకుళాదికుసుమరాసుల వేడ్కన్. ౧౮.

టీక.— రాజ శిఖా మణి పూజలు = చంద్రుఁడు చూడా రత్నముగాఁ గల వాఁడైన శివునియొక్క అర్చనలను, రాజశిఖామణి=రాజశ్రేష్ఠుఁడు, వేడ్కన్ = తమకముతో, రమ్యదళాళిన్— రమ్య = మనోజ్ఞమైన - దళ = పత్త్రిముల - ఆళిన్ = సమూహముతోను, రాజీ...రాసులన్— రాజీవ = తామరలయొక్కయు - కుముద = కలువలయొక్కయు - చంపక = సంపెఁగలయొక్కయు - రాజీ= సమూహముతోను, వకుళ = పొగడ - ఆది = మొదలుగాఁగలిగినట్టి - కుసుమ = పుష్పములయొక్క - రాసులన్ = సమూహములతోను, ఒనర్చెన్ = చేసెను.

క. వివిధఘనదానములు భూ
ధవమణి పరిశుద్ధుఁడై ముదంబున నొసఁగెన్

శివభక్తులు పెద్దలు నగు
నవనీసురవర్యులకు శివార్పణ మనుచున్. ౧౯.

టీక.—భూధవ మణి = రాజ శ్రేష్ఠుఁడు. అవనీ సుర కోటులకున్ = భూ దేవ (బ్రాహ్మణ) సమూహములకు. ముదంబునన్ = సంతోషముతో. ఒసఁగెన్ = ఇచ్చెను.

గీ. అంతఁ గాశీవిభునిపూజ కరుగుదెంచి
పత్నియును దాను నత్యంతభక్తితోడ
స్నాన మొనరించి నయనహస్తములు మోడ్చి
దేవ పురహర శ్రీమహాదేవ యనుచు. ౨౦.

టీక.—పత్నియున్ = భార్యయును (రత్నాంగియును). నయన హస్తములు= కన్నులును చేతులును. మోడ్చి = ముకుళింపఁజేసి. పుర హర = త్రిపుర సంహారకుఁడా.

సీ. స్నానం బొనర్చె మందాకినీధరునకు,
వస్త్రం బొసఁగెఁ గృత్తివాసునకును,
రత్నాసనము వెట్టె రజతాద్రినిలయున,
కలఁదె గంధము భసితాంగునకును,
నవరించెఁ బుష్పంబు చంద్రశేఖరునకు,
నిచ్చె ధూపం బనలేక్షణునకు,
నునిచె దీపము పరజ్యోతిస్స్వరూపున,
కమృతాన్న మిడియె విషాశనునకు,
గీ. దండ మర్పించె నలజగద్వందితునకు,
నమిత ధారాళ నారాళ హర్షబాష్ప
నిబిడపులకాంకురాంకితనేత్రగాత్రుఁ
డగుచు రాజనరేంద్రధరాధివిభుఁడు. ౨౧.

టీక. అమి...ఁడు—అమిత = విస్తారమైన - ధారాళ = తెంపులేక రాలుచున్న - నారాళ = అకుటిలములైన - హర్ష బాష్ప = ఆనందాశ్రువులచేతను - నిబిడ = దట్టమైన - పులకా (క+అ)ంకుర= గగుర్పాటుపు మొలకలచేత - అంకిత= గుఱుతుగలవైన- నేత్ర గాత్రుఁడు = కన్నులును శరీరమును గలవాఁడు. నరా (ర+అ) ధివిభుఁడు = రాజు.

మందాకినీ ధరునకుఁ=స్వర్గంగా ధరునకు. కృ...కుఁ—కృత్తి = చర్మము - వాసునకుఁ = వస్త్రంబుగాఁ గలవానికి. రజతాద్రినిలయునకుఁ—రజత = వెండి - అద్రి = కొండ - నిలయునకుఁ = ఇల్లుగాఁ గలవానికి. రత్నా(త్న+ఆ)సనము = రతనాల పీఠమును. భసితా(త+అ)ంగునకుఁ = భస్మము దేహమునఁ గలవానికి. అలఁదెఁ = పూసెను. అనలే(ల=ఈ)క్షణునకుఁ=అగ్ని నేత్రునకు. పర జ్యోతిః స్వరూపునకుఁ= అన్నిటికన్న నధిక మయిన జ్యోతిస్సే స్వరూపముగాఁ గలవానికి. విషా(ష+అ) శనునకుఁ = విష భక్షకునకు. జగద్వందితునకుఁ—జగత్ = లోకములచే-వందితునకుఁ= నమస్కరింపఁబడినవానికి.

సీ. మంత్రాభిషేక మేమర్యాదఁ జేసెనో
తల కెక్కినవిషంబు దొలఁగ లేదు,
గారుడమణిహార మేరీతి నిడియెనో
మెడఁ జుట్టుకొన్నపా మెడల లేదు,
నుదుట గందం బెట్లు నూల్కొన దిద్దెనో
నెఱయ మూసినకన్ను దెఱవ లేదు,
ధూపవిశేష మేరూపునఁ గూర్చెనో
వెంటాడుభూతముల్ విడువ లేదు,
గీ. దెలియ నమృతకరుం డనఁ దేజరిల్లు,
నోషధీశుకులంబున నుద్భవిల్లి
యెన్నికకు నెక్కు-రాజమహేంద్రవిభుఁడు,
పంచశరవైరిపూజ గావించునపుడు. ౨౨.

టీక.—మంత్రించిననీళ్లు మీఁదఁ జల్లిన విషము దిగుటయు, గరుడమణికి పాములు వెఱచి తొలఁగుటయు, కంటి ఱెప్పమీఁద బొట్టు దిద్దిన కన్ను దెఱచుటయు, ధూపవిశేషములకు పిశాచములు వదలి పోవుటయు, లోకములో ప్రసిద్ధములు. రాజరాజనరేంద్రుఁడు చేసిన శివపూజలయందు ఆప్రకారము జరుగలే దని యాశ్చర్యము.

అభిషేకము = స్నానము. విషంబు = కాలకూటము (జల మనియర్థాంతరము - గంగాజల మనిభావము). గారుడ మణి హారము = గరుడ పచ్చల-పేరు. నూల్కొనఁ= సూటిగా. మూసినకన్ను=అనల నేత్రము (అది ప్రళయకాలమందుతప్ప మఱియెప్పుడును శివుఁడు తెఱవఁడు). అమృతకరుండు=అమృతము కిరణములయందుఁగలవాఁడు(అమృతము

చేతియందుఁ గలవాఁ డని యర్థాంతరము). ఓషధీశు కులంబునన్ = చంద్ర వంశమందు. పంచ శర వైరి=అయిదు బాణములవాని (మన్మథునియొక్క) శత్రు వైనశివునియొక్క.

ఉ. చేరి నృపాలుఁ డర్పణము సేసినచక్కెర లుప్పతిల్లుపం
డేరము లారగించుచు నుతింపఁ దొడంగె మహేశుఁ డింపునన్,
సారెకుఁ గుత్తుకన్ విషము నాలుక బెల్లము వెట్టి యూఁటుటల్
మేర ల టయ్యె సామి కని మేలము లాడుచు గౌరి నవ్వఁగన్. ౬౩.

టీక.—సారెకున్ = మాటికి, కుత్తుకన్ = అంగిటను, విషమున్, నాలుకన్= నాలుకయందు, బెల్లమున్, ఉంచుకొని, ఆడుటల్ = పలుకుటలు (నటించుటలు అని యర్థాంతరము), సామికిన్=శివునికి, మేరలు అటు అయ్యెన్ = ఒప్పిన వయ్యెను, అని, మేలములు ఆడుచున్ = హాస్యములు పల్కుచు, గౌరి = పార్వతి, నవ్వఁగన్, నృపాలుఁడు = రాజు, చేరి = సమీపించి, అర్పణము చేసిన = నివేదనము చేసినట్టి - చక్కెరలు, ఉప్పతిల్లు = ఉట్టిపడుచున్న - పండేరములు = పణ్యారములను, మహేశుఁడు= శివుఁడు, ఇంపునన్ ఆరగించుచున్, నుతింపన్ తొడంగెన్ = పొగడ నారంభించెను.

గీ. ఇట్టు లత్యంతభక్తిమై నెపుడు నంగ
రంగవైభవముల సమగ్రంబు లైన
యారగింపుల సంతుష్టి నలవరించి
శివుఁ ద్రికాలంబులందుఁ బూజించుచుండె. ౬౪.

టీక.—అంగరంగవైభవములన్——అంగ=దేహముయొక్కయు - రంగ = ప్రదేశముయొక్కయు - వైభవములన్ = మహాభోగములచేత. అలవరించి = పొందించి

క. నందనసంతానము మది
యందుం గోరుచు భజింప నాశ్రితపటలీ
నందనసంతానం బగు
నిందుకళాధరుఁడు పార్వతీశ్వరుఁ డంతన్. ౬౫.

టీక.—నందన సంతానము=కుమారుల పరంపరను. ఆశ్రి...౦బు—ఆశ్రిత=భక్తుల యొక్క - పటలీ = సమూహమునకు - నందన=నందనవనమందున్నట్టి - సంతానంబు= కల్పవృక్షము. ఇందు = చంద్ర.

సీ. వరదానసంపద వామోత్తమాంగముల్
శైలజాగంగల సాక్షి దెలుపఁ,

గోపప్రసాదైకగుణరూఢిఁ జూపులు
చందమామల్లుని సాక్షి దెలుప,
ఖలశిక్ష సాధురక్షణమునఁ గటియుఁ గేల్
శార్దూలమృగముల సాక్షి దెలుప,
ననుపమాజ్ఞాసిద్ధిఁ బునుకకంకాళంబు
సరసీరుహాక్షుల సాక్షి దెలుప,
గీ. బంధురాష్టవిభూతులు పరిఢవిల్లఁ,
దనదు రాజశిఖామణిత్వంబు వెలయఁ,
బ్రమదమున మందహాసాననములతోడ,
వచ్చి ధరణీతలేంద్రుని స్వప్నమునను. ౨౬.

టీక.—వర = శ్రేష్ఠమైనట్టి - దాన=త్యాగముయొక్క - సంపదన్ = ఐశ్వర్యమునుగూర్చి, వామ ఉత్తమ అంగముల్ =ఎడమభాగమును శిరస్సును, శైలజాగంగలన్, పార్వతిని గంగను, సాక్షి=దృష్టాంతముగా, తెలుపన్ = తెలియజేయఁగా; కోప=నిగ్రహమందును - ప్రసాద = అనుగ్రహమందును - ఏక = ముఖ్యమైన - గుణరూఢిన్ = స్వభావనిశ్చయమునుగూర్చి, చూపులు = దృష్టులు, చందమామల్లునిన్ = మన్మథుని, ...ఖల శిక్షన్=దుష్ట సంహారమునుగూర్చి, సాధు రక్షణమునన్ = శిష్టపరిపాలనమునుగూర్చి, కటియున్ = మొలయును, కేల్ = హస్తమును, శార్దూల మృగములన్ = వ్యాఘ్రమును హరిణమును (శివునికి మొలను పులితోలును చేత లేడియుం గలవు),... అనుపమ = సమానములేనట్టి - ఆజ్ఞాసిద్ధిన్ = దండనశక్తినిఁగూర్చి, పునుక కంకాళముల్ = కపాలమును పాత్రము, సరసీరుహాసనున్ = బ్రహ్మను,...బంధుర = తఱచైనట్టి - అష్టవిభూతులు = అణిమాద్యష్టైశ్వర్యములు, పరిఢవిల్లన్ = ప్రకాశింపఁగా, తనదు = తనసంబంధమైన - రాజశిఖామణిత్వంబు = శశిశేఖరభావము, వెలయన్ = ప్రకాశింపఁగా, మందహాస = చిఱునవ్వుగలిగిన - ఆననములతోడన్ = ఈశానాది ముఖములతో, ధరణీతలేంద్రుని = భూలోక దేవేంద్రునియొక్క (అనఁగా - రాజరాజ నరేంద్రునియొక్క.)...

గీ. ధారుణీనాథ విను మేను దావకీన
సదమలాత్యంతభక్తికి సంతసిలితి;
నీవు చేసినపూజ వర్ణింపఁ దరమె?

యిదిగో నిప్పుడె ఫలించు నీయీప్సితంబు. ౨౭.

టీక.—తావకీన=నీసంబంధమైన. సత్ అమల=మంచి నిర్మలమైన. ఈప్సితంబు=కోరిక.

క. రత్నాంగి కుదయు మహా నెక
రత్నమువంటితనయుండు రమణీయకళా
నూత్నహరిణాంకుఁ డాసుత
రత్నము నిడు నాదుపేరు రాజనరేంద్రా. ౨౮.

టీక.—రమ...కుఁడు – రమణీయ = మనోజ్ఞమైన – కళా = కాంతిచేతను – నూత్న = క్రొత్తయైన – హరిణాంకుఁడు = చంద్రుఁడు. ఆసుతరత్నముఁ = ఆపుత్త్రిశ్రేష్ఠునికి.

క. అని యేఁగె. నంతలో ది
గ్గన మేల్కని విభుఁడు 'హా! మహాదేవ!' యటం
చును మేను గగుర్పొడవఁగ
ననుమోదాశ్చర్యమగ్నుఁ డయ్యె న టంతన్. ౨౯.

టీక.—అను...గ్నుఁడు—అనుమోద = సంతోషమందును – ఆశ్చర్య = అద్భుతమందును – మగ్నుఁడు = మునిఁగినవాఁడు.

ఉ. బల్లునఁ దెల్లవాఱిన నృపాలుఁడు మంత్రులఁ బిల్వఁ బంచి, యు
త్ఫుల్లముఖారవిందుఁ డయి, తొట్టినవేడుకచే మనంబు రం
జిల్లఁగ, రేయి గన్నకలఁ జెప్పె న దెంతయు నానుపూర్విగా,
సల్లలితాంతరంగు లయి సామి హసా దని వార లూఁకొనన్. ౩౦.

టీక.— సల్లలితా(త+అ)ంతరంగులు = సంతుష్టహృదయము గలవారు. హసాదు=మహాప్రసాదము. ఊఁకొనన్ = ఊఁకొట్టఁగాను. ఉత్ఫు...డు— ఉత్ఫుల్ల = వికసించినట్టి – ముఖా(ఖ + అ)రవిందుఁడు = కమలమువంటి ముఖముకలవాఁడు. తొట్టిన = పొందినట్టి. రేయి = రాత్రి. ఆనుపూర్విగాన్ = అనుక్రమముగా.

ఉ. చెప్పిన సంతసిల్లి, నృపశేఖర, రత్నమువంటినందనుం
డొప్పులకుప్ప గల్గుఁ, దన దున్నతిఁ బే రిడు మంచు వేడ్కతో
నప్పరమేశ్వరుండె యిటు లానతి యిచ్చిన నెంతభాగ్య! మ
ప్పప్ప! భవత్ప్రభావవిభవాఢ్యత యే మని సన్నుతింపఁగన్! ౩౧.

టీక.—తనది=తనసంబంధమైనట్టి. పేరు = నామమును. ఉన్నతిన్=గొప్పగా. ఇడుము = ఉంపుము. ఆనతి యిచ్చినన్ = ఆజ్ఞాపింపఁగా. అప్పప్ప = ఆశ్చర్యవాచకము. భవ...ఢ్యతన్—భవత్ = నీయొక్క - ప్రభావ=ప్రభావముతోను- విభవ= ఐశ్వర్యముతోను - ఆఢ్యత = సంపన్నుఁడవై యుండుట.

క. అనుచుఁ జెలరేఁగి మంత్రులు
గొనియాడుచు నుండి. రంతఁ గొన్నిదినంబుల్
జనఁ, గనకాచలకార్ముక
వినుతైకకృపాకటాక్షవీక్షణమహిమన్. 3౨.

టీక.—చనన్ = జరుగఁగా. కన...హిమన్—కనకాచల = మేరువు - కార్ముక = ధనుస్సుగాఁగలవాఁడైన పరమేశ్వరునియొక్క - వినుత = స్తుతింపఁబడిన - ఏక= ముఖ్యమైన - కృపా = అనుగ్రహముతో కూడుకొన్నట్టి - కటాక్షవీక్షణ = కడకంటి చూపుయొక్క - మహిమన్ = ప్రభావముచేత.

క. నెల మసలెన్ రత్నాంగికి,
బలిసెం జిట్టుములు నరుచి బడలిక లూర్పుల్,
తెలు పెక్కెఁ దళుకుఁజెక్కులు,
నలఁతికవును గొప్ప యయ్యె, నా రేర్పడియెన్. 33.

టీక.—చిట్టుములు = వేవిళ్లసంబంధమైనయోకిలింతలు. అరుచి=నోటికి ఏదియు చవిగాకపోవుట. అలఁతి = సూక్ష్మమైన - కవును = నడుము. ఆరు = నూఁగారు.

శా.'లేవే, భోజన మేటి కొల్ల? విటు లేలే? మేన బల్సొమ్ము లీ
వేవిం బూనవు? వెల్లఁబాఱె మొగ. మేమీ రాజుతో నల్గినా
వో వామాక్షిరో?' యంచు నర్మరసగర్భోక్తు ల్చెలు ల్పల్కఁగా,
వేవిళ్లం బొరలెన్ లతాంగి పతికిన్ వేడ్క ల్గొనల్సాగఁగన్. 3౪.

టీక.— ఓవామాక్షీ = ఓసుందరనేత్రా. మేనన్ = శరీరమందు. ఈవు = నీవు. ఏవిన్ = ఏవియును. పూనవు = ధరింపవు.నర్మ రస గ (ర్భ+ఉ) క్తుల్ = పరిహాస రసముతోఁ గూడుకొన్న మాటలను (అర్థాంతరమును బోధించు వాక్యములను.) లతా(తా+అ)ంగి = తీఁగెవంటిశరీరముగలరత్నాంగి.

శా.మించెం బోరచికోరికల్, గడు విజృంభించెం దనుగ్లాని, గా
న్పించె న్మేచకకాంతి చూచుకములన్, జెక్కుల్ తగన్ దెల్పు దె

ట్టెంచెన్, గోర్కులు సందడించె, నడ చండించెన్, మృదామోదమున్
గాంచెన్ వాతెఱ, యోసరించెఁ ద్రివళుల్ నానాఁటికిన్ బోటికిన్.

టీక.—పోరచి = సూడిదలమీఁది. తను గ్లాని = దేహమున బడలిక. మేచక కాంతి = నల్లని చాయ. చూచుకములన్ = చనుమొనలయందు. చండించెన్ = మంద మాయెను. మృత్ ఆమోదమున్ = మట్టి వాసనను. వాతెఱ = అధరోష్ఠము. ఓస రించెన్ = తొలఁగెను. బోటికిన్ = స్త్రీకి (రత్నాంగి కనుట).

—* సా రం గ ధ ర జ న న ము. *—

వ. ఇవ్విధంబున నిర్భరగర్భభారనితాంతతాంత యగునక్కాంతకుఁ బుంస వనాది సమస్తశుభకృత్యంబులు నిర్వర్తించినయనంతరంబ నవమా సంబులు గడచన నొక్కపుణ్యలగ్నంబునం గుమారుండు జన్మించిన.

టీక.—నిర్భర = భరింపరాని - గర్భ భార = గర్భముయొక్క బరువుచేత - ని తాంత = మిక్కిలి - తాంత = వాడినది. పుం...బులు—పుంసవన= (మగశిశువు జనించు టకై చేయఁబడునట్టి) పుంసవనాఖ్యకర్మ - ఆది = మొదలుగాఁగల - సమస్త = సకల మైన - శుభకృత్యంబులు =శుభకర్మములను. నిర్వర్తించిన యనంతరంబ = నెఱవేర్చిన పిమ్మటనే. కడచనన్ = జరుగఁగా. లగ్నంబునన్ = ముహూర్తమందు.

క. దిక్కులు మెఱసెన్, నెఱసెన్
జొక్కులు రంజిల్ల గాడ్పు, జొబ్బిల్ల సుధా
భుక్కులమంజులసుమన
స్స్రిక్కులవానలు గురిసె మొరసెఁ దూర్యంబుల్. ౩౭.

టీక.—చొక్కులు రంజిల్లన్ = శ్రమలు నివారణ మగునట్టుగా. గాడ్పు = మలయమారుతము. నెఱసెన్ = వీచెను. జొబ్బిల్లన్ = నిండారునట్టుగా. సుధా... స్రక్కుల.— సుధా భుక్ =అమృత భోజనులయొక్క (దేవతలయొక్క) - కుల = సమూ హములయొక్క - మంజుల=మనోజ్ఞములైన - సుమనః స్రక్కుల=పూల దండలయొక్క. తూర్యంబుల్ = మంగళవాద్యములు. మొరసెన్ = ధ్వనించెను.

చ. బిసబిస వాలుకీలుజడ పిక్కలు ద్రొక్కుచు వెన్ నటింపఁగా
మిసిమిసిసాళిగుబ్బచనుమిట్టలు పయ్యెద నుబ్బ నెత్తఁగా
నసురుసురై యలంతినడు మల్లల నాడఁగ ముందుముందుగా
నొసపరిబాగులాఁడి య్యొపు డొక్కతె వచ్చి నృపాలుతోఁడుతన్. ౩౮.

టీక.— బిసబిసన్ = బిసబిస అనుధ్వనితో. వాలు = ఒప్పుచున్న. కీలుజడ = అల్లిక వేసిన జడ. వెన్ = వెన్నున. మిసి...మిట్టలు— మిసిమి = కాంతిగల - పిసాళి = మనోజ్ఞమైన - గుబ్బ చను మిట్టలు = గుబ్బలవంటి చను గొండలు. పయ్యెదన్ = పైటచెఱఁగును. అలంతి = సూక్ష్మమైన. అల్లలన్ ఆడఁగన్ = జవ్వాడఁగా. ఒసపరి బాగులాఁడి = శృంగారవతి యైన స్త్రీ.

క. 'మగవానిఁ గనిరి శంబరు
పగవానిం బోనివానిఁ బట్టపుదేవుల్
జగతీనాయక.' నావుడు
మొగ మొకయిం తయి బుజాలు మూఁ డయి వేడ్కన్. ౩౯.

టీక.— జగతీనాయక = ఓరాజా. పట్టపుదేవుల్ = పట్టపుదేవిగారు. శంబరు పగవానిన్ = మన్మథుని. పోనివానిన్ = పోలినవానిని. నావుడున్ = అని చెప్పఁగా.

క. ఆమేలు వార్తఁ దెచ్చిన
భామకు బడిబడిని వెంటఁ బడువారలకున్
భూమిపతి భూసురార్థి
స్తోమములకు లెక్క లేనిసొమ్ము లొసంగెన్. ౪౦.

టీక.— బడిబడిన్ = క్రమక్రమముగానే. భూ...లకున్— భూసుర = బ్రాహ్మణులయిన - అర్థి = యాచకులయొక్క - స్తోమములకున్ = సమూహములకును.

క. జననాథచంద్రుఁ డివ్విధ
మున బహువిధదానములనుఁ బుత్త్రోత్సవ మిం
పొనరంగఁ జేసి సూతక
దినములు వెడలించె ముదము దీజరిలంగన్. ౪౧.

టీక.— బహువిధదానములు— గోదానము, భూదానము, హిరణ్యదానము, కన్యాదానము మొదలగునవి. సూతక దినములు = పురుటి దినములు.

ఉ. పొంగుచు బంధుమిత్త్రబుధపుంగవమంత్రిజనంబుఁ జూచి 'తె
ల్పెం గలలోన వచ్చి మునుపే తనపే రిదు మంచు వేడ్కతో
నంగజవైరి. యాయనదయం గద గల్గె.' నటంచుఁ బల్కి సా
రంగధరాహ్వయం బిడియె రాజనరేంద్రుఁ డనుంగుఁజూలికిన్. ౪౨.

టీక.—బుధ పుంగవ = శ్రేష్ఠులైన పెద్దలను. అంగజవైరి—అంగజ=మదనునికి-వైరి=శత్రువైన శివుఁడు. అనుంగుఁ జూలికిన్=ప్రియుఁడైన కుమారునికి. సారంగధరా (ర+ఆ) హ్వాయంబు = సారంగధరుఁ డను పేరు. ఇడియెన్ = పెట్టెను.

వ. ఇట్లు కృతనామకరణుం డై రాజసూనుం డనుదినప్రవర్ధమానుం డగుచున్నంత. ౪౩.

టీక.—సూనుండు = కుమారుఁడు. కృ...డు—కృత = చేయఁబడిన - నామకరణుండు = పేరుపెట్టుటగలవాఁడు, అనుదిన ప్రవర్ధమానుండు=దినములక్రమమున వృద్ధిఁ బొందుచున్న వాఁడు.

ఉ. పాలెడలోనఁ జోసి చనుఁబాలు నెయిం గిలకొట్టి కాళ్లపై
బాలకు నుంచి వ్రేల్ సెలవిపై నెడ గా నిడి యుగ్గు వెట్టి యా
కే లటు బొజ్జపై నిమిరి కెంజిగిచేతుల నెత్తి గట్టురా
చూలియనుంగుసామికిని జోతలు జోత లటంచుఁ బల్కుచున్. ౪౪.

టీక.— గిలకొట్టి = కలిపి. వ్రేల్ = వ్రేలు. సెలవి = పెదవిమూల. నిమిరి = తడవి. కెంజిగి = ఎఱ్ఱకాంతికలిగినట్టి. గట్టు రా చూలి యనుంగు సామికిన్ = కొండల రాయని (హిమవంతుని) కూఁతుయొక్క (పార్వతియొక్క) ప్రియ భర్తకు (శివునికి). జోతలు = నమస్కారములు.

క. కన్నుంగవఁ గాటుక యిడి
చన్నిచ్చుచు నేడు పుడిపి చక్కనిముద్దుం
జిన్నికుమారుని మారుని
పెన్నుద్దిని బత్తి నెత్తి పెంచిరి దాదుల్. ౪౫.

టీక.—మారుని పెన్నుద్దిన్= మన్మథునికి సమానమైనవానిని. బత్తిన్=భక్తితో.

గీ. లాలి గట్టిరి గంధోపలాలితాఖి
లాలిసుమసాంద్రచంద్రోపలాలిసౌధ
లాలితస్థలి హరునియిల్లాలిఁ బాడి
మేలిజవరాలిగములు రాచూలి కపుడు. ౪౬.

టీక.—మేలి జవరాలి గములు=చక్కని యౌవన స్త్రీసమూహములు. రాచూలికిన్=రాజపుత్త్రునికి. గంధో...స్థలిన్—గంధ=వాసనచేతను - ఉపలాలిత=శోభితమైనట్టి - అఖిల = సమస్తమైన - అళి=తుమ్మెదలతోఁగూడుకొన్న - సుమ= పుష్పముల

చేత - సాంద్ర=దట్టమైన - చంద్రో(ద్ర+ఉ)పల=చంద్రకాంత మణులయొక్క - ఆళీ= సమూహముతోఁగూడుకొన్న - సౌధ= మేడయందు - లాలిత=మనోజ్ఞమైన - స్థలిన్= ప్రదేశమందు. లాలిన్ = ఉయ్యాలను.

ఉ. పూ నెఱి మేని రాకొమరుఁ బొత్తులలోపల నుంచి 'గట్టువి
ల్కానివరప్రసాదమునఁ గల్గినచక్కనియన్న, నిద్ర పో
మ్మా ననుఁ గన్నతండ్రి.' యని మక్కువఁ జొక్కఁగ జోల వాడి రిం
పూనినజాళువాపసిఁడియుయ్యెల నయ్యెలనాగ లూఁచుచున్. ౪౭.

టీక.—అయ్యెలనాగలు = ఆస్త్రీలు. పూ నెఱి మేని రాకొమరున్ = పుష్పమువలె మృదువైన శరీరముగల రాచకొమారుని. పొత్తులలోపలన్ = (పొత్తులు అనఁగా బిడ్డలు ఇరుపార్శ్వములఁ బొర్ల కుండ నిడివిగా చుట్టి పఱుచు వస్త్రములు) వానిలోను. గట్టు విల్కాని = మేరు ధన్వి యైనశివునియొక్క. ఇంపు=అందమును. ఊనిన= పొందినట్టి. జాళువా పసిఁడి = మేలిమి బంగారపు.

క. జోల ల్వాడిరి యమృతపు
జాలుం జోకొట్టఁ జాలుసరసపుఁజూపుల్
డోలాయమానముగ ను
య్యాలో జంపాలో యనుచు నాలోలాక్షుల్. ౪౮.

టీక.—లోలాక్షుల్ — లోల=చంచలములయిన - అక్షుల్ = కన్నులుగలవారయిన స్త్రీలు. అమృతపు జాలున్ = అమృతముయొక్క ప్రవాహమును. జోకొట్టన్ = ఓదార్చుటకు. చాలు = తగినట్టి. డోలాయమానము కాన్ = ముందువెనుకలకు చలించుచుండఁగా.

సీ. కను ఱెప్ప వేయక కనుఁగొంచుఁ దనలోన
 నుంగుంగ యని సారె నుగ్గడింప,
నెలనవ్వు పాలబుగ్గలపై దువాళింప
 నత్తత్త యని డొంగి యాడుచుండ,
విద్దెము సేయుచు వింత లే కెవ్వరు
 చప్పటు ల్చఱచిన సరగ నరుగ,
జిలిబిలిముద్దుమాటలతోడ దాదిప్రే
 లంది మెల్ల నె తప్పటడుగు లిడఁగఁ,

గీ. కనుమొఱంగి చెలుల్ మఱుంగున నడంగి
తొంగి చూచి దూబూచి యన్నం గికాకి
కన్నగఁ, గుమారుఁ గౌఁగిట గారవించి
యలరుచురు వేడ్కఁ దలిదండ్రు లనుదినంబు. ౭౯.

టీక..—సారెకు = మాటిమాటికి. ఉగ్గడింపఁగ = మాటలాడనారంభింపఁగాను. ఎలనవ్వు = చిఱునవ్వు. పాలబుగ్గలపైకి = పాలవంటిచెక్కిళ్లమీఁద. దువాళింపఁగ = వ్యాపింపఁగా. వ్రేలు అంది = వ్రేలిని పట్టుకొని. చెలుల్ = స్త్రీలు. కనుమొఱంగి = కనఁబడక డాఁగి.

చ. కరముల్ సాఁచి తమిన్ 'ద, యింద,'యని రాగం బొప్పఁగాఁ జీరఁ దా
మరమోమందలి రావిరేక తులకింపన్ జేరి, బింబాధరం
బరు దారన్ రసవంత మై మెఱయఁగా నంకంబుపై నిల్చి, బా
పురె! సారంగధరుండు ముద్దు గురియుం బో తండ్రి యుప్పొంగఁగన్.

టీక.—తమిన్ = మోహముచేత. కరముల్ = చేతులు. ద = దా = రా. జీరన్ = పిలువఁగా. తామర మోమందలి = తామరపువ్వువంటి ముఖమునందున్న. రావిరేక = చిన్నవాండ్రకు నొసటఁ గట్టు భూషణవిశేషము. తులకింపన్ = చలింపఁగా. బింబాధరంబు— బింబ = దొండపండువంటి - అధరంబు = పెదవి. అరుదు ఆరన్ = వింత అగునట్లుగా. అంకంబుపైన్ = ఒడిలోన. బాపురె = శహబాసు.

గీ. ఇనకరస్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్ని సారంగధరుఁడు భాసిల్లుకరణి
నినకరస్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్ని సారంగధరుఁడు భాసిల్లె నంత. ౮౧.

టీక.—ఇన...బునన్—ఇన = సూర్యుని - కర=కిరణములయొక్క - స్పర్శనంబునన్ = తాఁకుటచేత, ఇంపున్ కాంచి=ప్రీతిని బొంది, చిన్ని సారంగధరుఁడు=బాలచంద్రుఁడు, భాసిల్లు కరణిన్=వెంపొందు నటువలెనే, ఇన=రాజనరేంద్రునియొక్క - కర స్పర్శనంబునన్ = హస్త స్పర్శచేత...

—* సారంగధరుని విద్యాభ్యాసాదికము. *—

గీ. ఇట్లు తల్లిదండ్రు లెంతయు గారాన
నేటఁ బెంచువానిఁ బూటఁ బెంచి

సరవి వరవిభూతిఁ జౌలోపనయనాది

సత్క్రియాచయంబు సలిపి రంత. ౫౨.

టీక.—సరవిన్ = వరుసగా. చౌలో...ంబు—చౌల = చూడాకర్మ - ఉపనయన = వడుగు - ఆది = మొదలైన - సత్క్రియా = సత్కర్మలయొక్క - చయంబు= సమూహమును.

వ. ఇట్లు యౌవన ప్రాదుర్భావం బై తేజరిల్లి శాస్త్రంబులు క్రోడీకరించి, పురాణంబులు హృద్గతంబులు గావించి, నీతులు విస్తరంబుగాఁ దెలిసి, గజహయరథారోహణంబు లభ్యసించి, బహువిధాయుధసాధనల నాఱితేఱి, సకలవిద్యాపారీణుం డయ్యె నప్పుడు. ౫౩.

టీక.—యౌవన ప్రాదుర్భావంబునన్ =వయస్సు పుట్టుటచేతను. తేజరిల్లి= ప్రకాశించి. క్రోడీకరించి = సంగ్రహించి. హృద్గతంబులు = మనోరూఢములు. కావించి= చేసి. గజహయా(య+ఆ)రోహణంబులు అభ్యసించి = ఏనుఁగులను గుఱ్ఱములను ఎక్కుటలను నేర్చుకొని. ఆఱి తేఱి = సమర్థుఁడై. సకల విద్యా పారీణుండు = సర్వ శాస్త్రములను సంపూర్ణముగా తెలిసినవాఁడు.

క. సారంగధరుఁడు మించెన్

ధీరత బహువేదశాస్త్ర దీక్షాగురు నై

సారెకు నవక్రవిక్రమ

భూరి కళావిభవసారపుంగవు లెంచన్. ౫౪.

టీక.—అవ...గవులు—అవక్ర=వంకరగానట్టి - విక్రమ = పరాక్రమముగల- భూరి కళా విభవసార పుంగవులు = సకల విద్యా సంపత్సార శ్రేష్ఠులు, ఎన్నన్ = నుతింపఁగా, సారెకున్ = పలుమాఱు, ధీరతన్ = ధైర్యముచేత, బహు...వై— బహు = అనేకములైన - వేద = వేదములయొక్కయు - శాస్త్ర = వ్యాకరణాది శాస్త్రములయొక్కయు - దీక్షా = నియతులయందు - గురువై = అధికుఁడై, సారంగధరుఁడు మించెన్.

సీ. శ్రుతిమార్గముల నంటి శోభిల్లెఁ దెలివిమై

నాతనిచూడ్కి యే మనఁగ వచ్చు,

సాధుకుంజరపంక్తిసంగతి విలసిల్లు

నాతనినడక యే మనఁగ వచ్చు,

దాక్షాయణీనాథుఁ దగిలి లోఁగొనఁ జాలు
నాతని తేజ మే మనఁగ వచ్చు,
నించువిల్కాని జయించు నాతనినిర్మ
లాకారమహిమ యే మనఁగ వచ్చు,

గీ. వసుధఁ బుట్టెడు పెరిఁగెడువారిలోనఁ
గని విని యెఱుంగ మంతటిఘనుని నౌర!
యీతఁడు జోడును సరి సాటి యెందు లే ద
తం డమర్త్యుండు గాక మర్త్యుండె తలఁప! ౫౫.

టీక.—శ్రుతి మార్గములన్=కర్ణ రంధ్రములను(వేద మార్గములను). తెలివిమైన్=ధావళ్యముతో (జ్ఞానముతో). చూడ్కి = చూపు (ఆలోచన). దాక్షాయణీనాథున్=చంద్రుని (శివుని). తగిలి = తాఁకి. లోఁగొనన్ = తక్కువ చేయుటకు. తేజము = కాంతి (పరాక్రమము). సాధు కుంజర పంక్తి = శ్రేష్ఠమైన గజ సమూహముయొక్క (శ్రేష్ఠులైన పెద్దల సమూహముయొక్క). సంగతిన్=సాంగత్యముచేతను. నడక = గమనము (చర్య). ఇంచువిల్కానిన్ = మన్మథుని (ఒప్పునట్టి ధనుర్ధరుని). నిర్మలా (ల+ఆ) కారమహిమ= నిర్దోషమయిన రూప మాహాత్మ్యము (నిర్దోషమయిన శరీర ప్రభావము). అమర్త్యుండు = దేవుఁడు. మర్త్యుండె = మనుష్యుఁడా.

క. మూడెత్తు మాట యెవ్వరి
నాడడు, సత్యంబు వీడ నాడఁడు, ఖలులం
గూడఁడు, పరకాములులం
జూడఁడు, సారంగధరుఁడు సుతమాత్రుండే. ౫౬.

టీక.—మాడెత్తుమాట = అధికమైనమాటను. ఖలులన్ = దుష్టులను. పరకామినులన్ = ఇతరులస్త్రీలను. సుతమాత్రుండే = సామాన్యమైనపుత్త్రుఁడా.

క. ఔరా! యని జను లెన్నఁగఁ
గూరిమితోఁ దండ్రిమాట గురువాక్యముగా,
గోరంతయు జవదాఁటక,
యీ రాజకుమారచంద్రుఁ డలరఁగ నంతన్. ౫౭.

టీక.—కూరిమితోన్=అనురక్తితో.

మ. వనజాతాహితవంశవారినిధిభాస్వత్కౌస్తుభం బైనరా
జనరేంద్రుండు నవీనయౌవనవిలాసశ్రీజగన్మోహనాం
గుని సారంగధరుఁ విశేషగుణయుక్తుఁ యౌవరాజ్యాభిషి
క్తునిఁ గావించి నిజాన్వయంబునకు వకోకాప్తవంశంబునఁ. ౫౮.

టీక.—వనజా...బు—వనజాతఅహిత వంశ=కమల వైరి(యైనచంద్రుని)యొక్క—వంశమను - వారినిధి = సముద్రమందు - భాస్వత్=ప్రకాశించుచున్న - కౌస్తుభంబు= కౌస్తుభ మనుపేరు గలరత్నము. నవీన...గునిఁ—నవీన=నూతనమైన - యౌవనవిలాసశ్రీ = వయోవివిభ్రమసంపదచేతను - జగత్ మోహనఅంగునిఁ = లోకమును మోహింపఁజేయు శరీరముకలిగినవానిని. నిజా...ము—నిజ=తన దైన - అన్వయంబు= వంశమునకు - సమము=సమానము. కోకాప్త.— కోక = చక్రవాకములయొక్క - ఆప్త = ప్రియునియొక్క (అనఁగా సూర్యునియొక్క). రాఁగలపద్యము నన్వయము.

క. పేరుగలఘూర్జరాధిపు
గారాబుఁగొమార్తెఁ బెండ్లి గావించెఁ దగఁ
సారంగధరునకుఁ మన
సారంగను మంజువాణి యను నలివేణిఁ. ౫౯.

టీక.—అలివేణిఁ = తుమ్మెదలవంటి జడగలదానిని.

క. తారావళి యఁట నఖము, లు
రోరుహములు రెండు మంజరులె యఁట, నేత్రా
కారంబులు ధవళము లఁట ;
యారమణిఁ మంజువాణి యనఁ జెల్లదొకో ? ౬౦.

టీక.—నఖములు = గోళ్లు, తారాఆవళి యఁట=నక్షత్ర పంక్తియఁట, ఉరోరుహములు = కుచములు, రెండు మంజరులె అఁట = రెండు పూఁగుత్తులే యఁట, నే...బులు— నేత్ర = కన్నులయొక్క - ఆకారంబులు = స్వరూపంబులు, ధవళము లఁట=తెల్లని వఁట; ఆరమణిని=ఆసారంగధరునిభార్యను, మంజువాణి యనఁ జెల్లదొకో= మంజువాణి యని చెప్పఁ దగదా.— తారావళి, మంజరి, ధవళము, అను నవి కావ్యరచనా విశేషములు. అవి గలకావ్యమును మనోజ్ఞమైన వాక్కు గల దని చెప్పఁదగు నని చమత్కారము.

గీ. సకలవైభవములతోఁ బాసంగ నిటులు

రాజరాజవిభుండు గారాబుఁగొడుకుఁ
బరిణయ మొనర్చి యానందభరితుఁ డగుచు
నుండెఁ గొన్నిదినము లంత నొక్కనాఁడు. ౬౧.

టీక.—పరిణయము = వివాహము. ఒనర్చి = చేసి. ఆనంద భరితుఁడు = సంతోషముతో నిండినవాఁడు. విజృంభించి = సామర్థ్యమును ప్రకాశింపఁ జేసి.

—* రాజును వేఁటకాండ్రు దర్శించుట. *—

సీ. నిలుచుండి చంకఁ జేతులు వెట్టుక కిరీట
ములు గలరాజులు కొలువు సేయ,
వేఁటాఱు తునియలు వేయు మే లైనవ
జీర్లు వచ్చి సలాము చేసి నిలువ,
శరణాగతారాతిధరణీరమణు లయ్యె
జియ్యాలు వెట్టుచు సేవ సలుప,
సాటికిఁ బోటికి సరససంగీతసా
హిత్యాదివిద్యలు నృత్య మాడ,
గీ. మనవిసనవుల కేతెంచి మన్నెవారు
వేళ యెప్పు డౌనొకో యని వేఁడుచుండ,
నమ్మహీపాలుఁ డపుడు సింహాసనస్థుఁ
డగుచు నొడ్డోలగం బున్న యవసరమున. ౬౨.

టీక.— వేటాఱు తునియలు వేయు = వ్రేటునకు ఆఱేసి తునుకలు అగునట్లుగా (రౌతు జీను గుఱ్ఱము ఒక్కవ్రేటున రెంషేసి తుండెము లగునట్లుగా అని భావము). వజీర్లు = సేనానాయకులు. అరాతి ధరణీరమణులు = శత్రు రాజులు. అయ్యె జియ్యాలు వెట్టుచున్ — అయ్యా జియ్యా అని మొఱ యిడుచు. సాటికిన్ = సామ్యమునకును. పోటికిన్ = స్పర్థచేతను. మన్నెవారు = జమీన్‌దార్లు. మనవిసనవులకున్ = విన్నపములకును, పరిచయమునకును. ఏతెంచి = వచ్చి. ఒడ్డోలగంబు ఉన్న అవసరమునన్ = గొప్పకొలువు తీరి యున్న సమయమందు.

మ. పులితోలాక్సేల నంట దోపినపిడెంబు ల్వాలిపూఁదావళం
బులు బల్సింగపుఁజుంచుదండకడియంబుల్ చెంపలన్ జెక్కుపీఁ

కలు కెంజేగుఱుబొట్లు జుంజుఱుసిగల్ గౌరంపుమైపూఁతలున్
బలుదూపు ల్వెడవిండ్లును న్జెలు వొనర్పన్ వచ్చి కే ల్మోడ్చుచున్.

టీక.—కాసెలన్=దట్టీలయందు. పిడెంబుల్=చిన్న బాణములు. నూలి పూఁ దా వళంబులు= నూలు బంతుల హారములు. చుంచు=జూలు. చెక్కు పీఁకలు=చెరివిన నెమలి యీఁకలును; కెంపు=ఎఱ్ఱని. జుంజుఱు=విరియఁబోసికొన్న. గౌరంపు మై పూఁతలున్= దేహమందు తెల్లని పూఁతలును. బలు తూపుల్=గొప్ప బాణములును. వెడ = గొప్ప.

క. జల్లులు పునుఁగుజవాదుల
పిల్లులు కుందేటిలేటిపిల్లలు మొదలౌ
నెల్లసువస్తువులను శో
భిల్లం గానుక లొసంగి భిల్లజనంబుల్. ౬౪.

టీక.—భిల్లజనంబుల్ = చెంచువాండ్రు; జల్లులు = సవరములు.

శా. సామీ, వింజపుఁగొండకాఱడవిపజ్జన్ గూడెముల్ గట్టి మీ
సేమంబే సత మిచ్చఁ గోరి బలుబైసిన్ బాగ్గెమున్ గల్గి యా
బూమిన్ వేఁటలఁ దోఁటలం దిరిగి మీపున్నెన మా కచ్చికం
బేమిన్ లేక సుఖాన నుండుదుము నీవే దిక్కుగా నెమ్మదిన్. ౬౫.

టీక.— సామీ=రాజా. వింజపుఁగొండ—వింధ్యపర్వతముయొక్క - కాఱడవి పజ్జన్= నల్లనైనవనముసమీపమందు. గూడెముల్ = పల్లెలను. సేమంబే = క్షేమమే. సతము = సదా. ఇచ్చన్= మదిలో. బలు బైసిన్ బాగ్గెమున్ = మిక్కిలి పరాక్రమ మును సంపత్తును. తోఁటలన్, వనములందు. పున్నెన = పుణ్యముచేత.

ఉ. అయ్య, పరాకు మాని తెలియన్ విను, లచ్చనదేవుఁడున్ సిరా
మయ్యయు సీతమ్మకొఱకై తొలుతన్ గనుపట్టుముచ్చుబల్
దయ్యపుమూఁకఁ జెండినపొలానకు మొన్నను వేఁటలాడుకోఁ
జయ్యనఁ బోయి యాయడవిచాయలఁ గంటిమి వాల్మికంబులన్. ౬౬.

టీక.— పరాకు = విస్మృతి. కనుపట్టు = అగపడినట్టి. ముచ్చుబల్ దయ్యపు మూఁకన్ = మాయావులైన రాక్షసుల సమూహమును. చెండిన=సంహరించినట్టి. చయ్యనన్ = శీఘ్రముగా. వాల్మికంబులన్ = గొప్పమృగములను.

క. అందల మందల లే కిపు
డందలమంద లయి యున్న వయ్య మెకంబుల్

చెందామర కొలనివలెఁ
దెందేపల వేమి సెప్ప దేవ్రఁ దెలుంగుల్. ౬౭.

టీక.—అందల మందల=మితి మేర. అందుఁ = ఆవింజపుఁగొండయడవియందు. అల మందలు=అలలయొక్క సమూహములు. చెం దామర కొలనివలెఁ=ఎఱ్ఱని దామరల చెఱువువలెనే. మెకంబుల్ = మృగములు. తెందేపలు = మిక్కుటములు.

సీ. క్రోల్పులు ల్మంపిల్లి గోటగోటమని రొప్పి
    బలుసింగముల నైనఁ బట్టఁ జూచుఁ,
గండక్రొవ్వునఁ గన్ను గానక పందులు
    బిరుదేనుఁగుల నైన నొరయఁ జూచుఁ,
గాఱుపుల్ దిని యాము కవిసి మఱబోతులు
    కారుపోతుల నైనఁ గదమఁ జూచుఁ,
బోతరించిసివంగు లీతలాతల నేచి
    గబ్బియెల్గుల నైన గిబ్బఁజూచు,
గీ. సామి, వానిచలంబు మచ్చరము బలిమి
యెక్క డేవంక నే మని యెంచ వచ్చు,
నొకటి నొక్కటి సడ్డసేయక మెలంగు,
నాపొలంబునఁ దరతరంబై మెకములు. ౬౮.

టీక.—క్రోల్ పులుల్ = పెద్దపులులు, మంపిల్లి = నిద్రమబ్బుగొని, గోటగోటమని= గోటగోటయనుధ్వనితో. బిరుదేనుఁగులఁ = మదపుటేనుఁగులను. ఒరయఁ = కలహించుటకు. కాఱు పుల్ =దట్టమైనపచ్చికను. ఆము కవిసి = మదించి. మఱబోతులు= మృగవిశేషములు. కారుపోతులఁ = మదించిన దున్నలను. గదమఁ = చంపుటకు. గబ్బియెలుఁగులఁ = మదించినభల్లూకములను. గిబ్బఁ = చంపుటకు. సడ్డసేయక = లక్ష్యపెట్టక. తరతరంబై = పరంపరగా.

గీ. జింకదాఁటులు మంచి తేజీలపిల్ల
లనఁగఁ దగి, యుప్పరము దాఁటునప్డు డడ్డ
మైనఁ బడ దాఁటు నెలలేడి నైన, దాఁటుఁ
జిఱుతపులి నైన, నే మని చెప్ప వచ్చు! ౬౯

టీక.—జింకదాఁటులు = లేళ్లమందలు. తేజీల = మేలుగుఱ్ఱములయొక్క. ఉప్పరమున = ఆకాశమున. నెల = చంద్రునిలోని.

గీ. ఏనుఁగుమదంబువఱద గాఱెనుపపాలు
పందినేవెల్లువలు చిక్కఁబాఱుచెమ్మ
దఱుఁగ దలమండువేసవిఁ; దఱుమఁ గలుగఁ
జాల్; మెకా లందు దొప్పున జాఱి పడును. ౨౦.

టీక.—ఏనుఁగు మదంపు వఱద=ఏనుఁగులయొక్క మదజల ప్రవాహమును, కాఱెనుపపాలు=అడవియెనుములయొక్క పాలును, పంది నే వెల్లువలు=వరాహపు నేతి ప్రవాహములును, చిక్కఁ బాఱు చెమ్మ = చిక్కఁ బడినట్టి తడి, తఱుఁగదు = తగ్గదు.... వేసవిన్ = వేసవికాలమందు, తఱుమఁ గలుగఁ జాల్ = తఱుముటకు యత్నించిన చాలును, మెకాలు = మృగములు, అందున్ = ఆచెమ్మలో.

ఉ. ఉల్లములోన నే మనుచు నుందున్రు? యే నొకదబ్బు దబ్బెదన్,
బల్లిదపున్వరాహములు భద్రగజంబులమీఁద నాదుకోఁ
బెల్లుగ నెక్క వానికొనపెంద్రుక యొక్కటి రెమ్మి దీసినన్
జిల్లున వెళ్లుఁ బో చమురు చిమ్మనగ్రోవిని జిమ్ముకై వడిన్. ౨౧.

టీక.—ఉల్లములోనన్ = మనస్సులో. దబ్బు దబ్బెదన్ = మాట చెప్పెదను. బల్లిదపున్ వరాహములు = బలిష్ఠములయిన పందులు. భద్రగజంబులమీఁదన్ = భద్రమను శ్రేష్ఠజాతియేనుఁగులపైని. ఆదుకోన్ = ఆనుకొనుటకు. వాని = ఆ వరాహముల యొక్క. రెమ్మి = ఒడిసి.

సీ. తాము శక్తిహాయంబులై మంద మని సుమీ
మొగులు చొచ్చినయట్టు లెగురుచుండు,
దిక్కాలములు మోచి రెక్కొంద మని సుమీ
యలదరు ల్తాము గోరాడుచుండుఁ,
బాతాళ మటు సొచ్చి బ్రహ్మకుద మని సుమీ
తాము వేమఱు భూమిఁ ద్రవ్వుచుండు,
మింటఁ జందురుఁ జేరి మే లౌద మని సుమీ
తాము నుప్పరమును దాఁటుచుండు,

గీ. హరులు గరులు గిరులు హరిణంబు లనయంబు
  తోలుతఁ బెద్ద లెఱుఁగు నొళవు వెలిఁగి.
  యటులు పోవనిత్తు మఁటవయ్య, తముఁ జుట్టి
  పట్టి నేలతోడఁ గొట్ట కిపుడు? ౭౨.

టీక.—శక్తిహయంబులు = శక్తికి (=పార్వతికి) వాహనములు. మందము = బరువుదము. మొగులు = మేఘమును. దిక్కూలములు=దిక్కుల గట్టులను. దరుల్= ఒడ్డులను. ఔదము = అగుదము. ఉప్పరమును = ఆకాశమును. హరులు = సింహములు. కరులు = ఏనుఁగులు. కిరులు = పందులు. హరిణంబులు = లేళ్లు. ఒళవు = ఉపాయము.

సీ. వెదురుచేల్కాలువు దీసి దినంబుఁ గాపాడు
    కమతీలు మా కేకలములు సుమ్ము,
  కరిముత్తియపు రేకఁ గనిపట్టు సంగాత
    కాండ్రు మా కల్ల సింగములు సుమ్ము,
  జింక వేఁటలఁ గాచి జంకించి దొడ్డిఁ దో
    ల్గొల్లలు మాకుఁ గ్రోల్పులులు సుమ్ము,
  పుట్టజున్నుం గళ్లఁ బెట్టించువాఁడుక
    కోమట్లు మా కెల్లుగొడ్లు సుమ్ము,
గీ. వాటిలో నిసుమంత తాటోటు చేసి
  యటమటింపక యుండఁ బైయద్దికముగ
  నేవఁ దిరుగాడు విశ్వాసు లెపుడు మాకు
  జాగిలంబులు సుమ్ము మాసామి కాన. ౭౩.

టీక.—మా సామి కాన = ప్రియమైన మాయొక్క ప్రభువా. కమతీలు = పైరు పండించుహాలివాండ్రు. ఏకలములు = అడవిపందులు. కరి ముత్తియపు రేకన్ = ఏనుఁగు ముత్తియముల పంక్తిని. సంగాతకాండ్రు = స్నేహితులు. జింక వేఁటలన్ = జింకలనెడిపాట్లేళ్లను. జంకించి = జడిపించి. పుట్టజున్ను = పుట్టతేనె. వాటిలోన్ = పైచెప్పినవానిలో (వానిల్లో అనుటకు వాటిలోన్ అని గ్రామ్యము). ఇసుమంత=కొంచెము. తాటోటు = మోసము. అటమటింపక = అపహరింపక. పైయద్దికముగన్ = పైకావలిగా. ఏవన్ = వ్యాజముచేత. విశ్వాసులు = నమ్మకమైనవారు.

సీ. ఒకసింగ మల్లసత్తికిఁ గ్రిందు సొచ్చుట
మాధాక కటు నిల్వ నోడి కాదె?
వాలుఁదొల్పంది పాతాళంబుఁ దూఱుట
మాధాక కటు నిల్వ నోడి కాదె?
హరిణాం బొకటి రాజు శరణంబుఁ జొచ్చుట
మాధాక కటు నిల్వ నోడి కాదె?
వడి దచ్చియేనుఁగుల్ కడభూమిఁ జేరుట
మాధాక కటు నిల్వ నోడి కాదె?
గీ. కను గలిగి మున్నె తప్పించుకొనియెఁ గాక,
కొట్టి కోలాహలము చేసి కూలఁ గుమ్మి,
చెండి చెకపిక లాడమా యుండెనేని;
మించి పోయినసుద్దుల నెంచ నేల? ౭౪.

టీక.—అల్ల సత్తికిన్ = ఆ పార్వతికి. క్రింద సొచ్చుటల్ = క్రిందుగా చొరఁబడుట (అనఁగా వాహనముగా నుండుట). ధాకకున్ = ఔద్ధత్యమునకు. వాలు తొల్ పంది = గొప్పదైన యాది వరాహము. హరిణము = లేడి. రాజున్ = చంద్రుని (శేని ననియు). దచ్చి యేనుఁగుల్ = అష్ట గజములు. కడభూమికిన్ = దిగంతములకు. కను = ఆలోచన. కోలాహలము = అల్లరి. చెండి = చంపి. చెకపిక లాడమా = కకవికలు చేయమా. సుద్దులన్ = మాటలను.

చ. అన విని మందహాస మొలయం దమతోడ విభుండు 'పొండు, మీ
వెనుకనె వత్తు, నన్నియును వేటకు నాయితపెట్టుఁ డిప్పుడే,'
యని యచిరత్న రత్నఖచి తాభరణాంబర పంక్తు లిచ్చి పం
చినఁ గొని చెంచుతేం డ్రపుడు సింగఁడు బూరఁడు నై ముదంబునన్.

టీక.—మందహాసము = చిఱునవ్వు. ఒలయన్ = పుట్టఁగా. తమితోడన్ = ప్రేమతో. ఆయితపెట్టుఁడు = సిద్ధపఱుపుఁడు. అచిర...ంబులు—అచిరత్న = క్రొత్తవైన - రత్న ఖచిత = రత్నములతో చెక్కఁబడిన - ఆభరణ = సొమ్ములయొక్కయు - అంబర = వస్త్రములయొక్కయు - పంక్తులన్ = వరుసలను. సింగఁడున్ = సింహము వంటివాఁడును. బూరఁడున్ = పూరించినవాఁడును. ముదంబునన్ = సంతోషముతో.

క. కైవడి మొకములఁ గ్రుమ్మెడి
కైవడి మా యావ చేవ కనఁ బోయెదుగా
దేవర, మాదేవరవలె
వేవేగమె సామి వేఁట విచ్చేయవయా. ౭౬.

టీక.—కైవడిన్ = చేతికొలఁది. కైవడిన్ = రీతిని. ఆవ = జ్ఞానమును. చేవ= బలమును. దేవర = సామీ. మాదేవరవలెన్ = లక్ష్మీభర్తయైనవిష్ణువువలెనే. వేవేగమె = అతిశీఘ్రముగానే. విచ్చేయవయా = రావయ్యా.

క. చని; రంత వేఁటఁ బోవం
జన మీ రాయిత్తపడి వెసన్ రం డనుచున్
జనవరులన్ జనవరులన్
మన సలరన్ దొరల ననిపి మహిపతి దానున్. ౭౭.

టీక.—మహిపతి = రాజు. చనన్=తగునట్లుగా. ఆయిత్తపడి = ప్రయత్నపడి. వెసన్ = శీఘ్రముగా. రండు = రండి. చనవరులన్ = స్నేహితులను. జనవరులన్ = రాజులను. మనసు అలరన్=మనస్సు సంతోషింపఁగా. దొరలను = ప్రభువులను.

తే. అంతిపుర మేఁగి, మజ్జనం బాడి, వేఁటఁ
బోవుతఱి జేగపడనుగ భోజనంబు
సేసి, యాఖేటవిహారణోచితము గాఁగ
తత్తఱంబునఁ గై సేసి చిత్తరువుగ. ౭౮.

టీక.—అంతిపురము ఏఁగి=అంతఃపురములోనికి పోయి. మజ్జనంబు=స్నానము. తఱిన్ = సమయమందు. ఆఖేట = వేఁటయొక్క - విహారణ = క్రీడకు. ఉచితము= యోగ్యము. చిత్తరువుగన్ = ఆశ్చర్యముగా. కైసేసి = అలంకారము చేసికొని.

సీ. ఒంటిముత్తెములతో నొంటికెంపులకాంతి
చెక్కులజవ్వాడఁ జికిలి సేయ,
హురుమంజిముత్యాల యొరగుపాగమెఱుంగు
నొసలిబిత్తరిబొట్టు ముసుఁగు వేయ,
జాతిసేలపుఁదాళిచాకచక్యప్రభల్
కస్తూరినెటిపూఁతఁ గుస్తరింప,

సొగసుసూర్యపటంపుసురెవాలుమైతళుక్కు-
హొంబట్టుదట్టిపై నోలగింపఁ,

గీ. జేతివజ్రంపుఁబిడిఁత్రోడిచిక్కటారి
చాయ వలెవాటుదుప్పటిసంకు దోఁప,
రాచిలుక తేజి నెక్కెడురౌ తనంగఁ
జక్కఁదన ముప్పతిల్లంగ జనవిభుండు. ౭౯.

టీక.—చెక్కులః = చెక్కిళ్లయందు. చికిలి సేయః = మెఱుఁగెక్కింపఁగా. హురుమంజి = శ్రేష్ఠమైన. బిత్తరి = అందమైన. బొట్టుః = తిలకమును. ముసుఁగు వేయః=కప్పి పోషింపఁగా. జాతి...భల్—జాతి నీలపుఁ దాళి= మేలైన నీలమణుల పతకముయొక్క - చాకచక్యప్రభల్ = చకచ్చకకాంతులు. కుస్తరింపః = బుజ్జగింపఁగా. సూ...ళుక్క—సూర్యపటంపు = మొకమల్ పట్టుయొక్క - సురెవాలు = కత్తియొక్క - మై తళుక్క = దేహ కాంతి. హొం బట్టు దట్టి పైః = బంగారు వన్నె పట్టు కాసె మీఁదను. ఓలగింపః = కొలువు తీరి యుండఁగా - ప్రకాశింపఁగా అనుట. చిక్కటారి = చిన్నబాకుయొక్క, చాయః=కాంతిచేత. సంకు దోఁప = సందేహము కలుగఁగా. రా చిలుక తేజిని = ఉత్తమమయిన చిలుక గుఱ్ఱమును (మన్మథుఁడు చిలుకగుఱ్ఱము నెక్కురౌతు).

గీ. నగరు వెలువడి వేఁటసన్నాహమునకు
హితులు మన్నీలు దుర్గాధిపతులు దొరలు
వేత్రహస్తులు రౌతులు వీరభటులు
బలసి యిరువంకలను జేరి కొలిచి రాఁగ. ౮౦.

టీక.—హితులు = మిత్త్రులును, మన్నీలు=మన్నెపురాజులు, దుర్గ అధిపతులు= దుర్గము నేలురాజులు, దొరలు = బంధురాజులును, వేత్రహస్తులు=బెత్తములుచేతఁ గల వారును, బలసి = పరివేష్టించి. ఇరు పక్కియలః = ఉభయ పార్శ్వములయందు.

సీ. ముదు వైనచక్కని మొగముట్టు సవరించి,
నవరత్నమయఖలీనం బొనర్చి,
పచ్చసూర్యపటంపుఁబల్లంబు ఘటియించి,
బిరుదుఁదలాడంబు నిరవుకొలిపి,
చికిలిఁజొకాటంపుఁ బికిలి కుచ్చు లమర్చి,

యపరంజిపక్కెర యలవరించి,
సమకట్టుజల్లులు సమకూర్చి, యిరువంక
గొరకసింగిణిపొదుల్ గూర్చి కట్టి,
గీ. పంచకము ఱొమ్ము విరివి యై పరిఢవిల్ల,
మోడి శిర సెత్తుటయుఁ గల్గి మొయిలులోని
జలము తేనోపుపాదరసంబువంటి
యుత్తమాశ్వంబు సాహిణి యొకఁడు నిలుప. ౮౧.

టీక.—మురువు = సుందరము, మొగముట్టు = మొగపట్టెడను, ఖలీనంబు = కళ్లెమును, పచ్చ సూర్యపటంపుఁ బల్లంబుల్ = పచ్చని మొకమల్పట్టు జీనును, బిరుదు తలాడంబుల్=బిరు దైనతలగడను, ఇరవు కొల్పి = సమకొల్పి, చికి...చ్చులు—చికిలి = మెఱుఁగు పెట్టిన - చొకాటంపు = చొక్కమైనట్టి - పికిలికుచ్చులు=పికిలిపిట్టయొక్క పింఛములచేత కట్టినకుచ్చులను, అపరంజి పక్కెర = బంగారు కవచమును, అలవరించి= తొడిగి, సమకట్టు జల్లులు = కవచపు జాలరులను, గొరక = బాణములయొక్క - సింగిణి = విండ్లయొక్క - పొదుల్ - కట్టులును, పంచకము=గుండెలును, పరిఢవిల్లన్= ప్రకాశింపఁగా, మోడిన్ = శృంగారముగా, మొయిలులోని=మేఘములోని, సాహిణి= గుఱ్ఱపువాఁడు.

ఉ. ఉక్కళి మైనమంచిమను వొప్పెడునాహయరత్న మెక్కినన్
గక్కస మేమి లేక రవగాలును జోడన యడ్డవేడెము
ల్డుక్కుదువాళి జంగనడలుం గనిపించుచుఁ బోయిపోయి రా
జక్కడ వన్నె సోఁక నటు హో యనినన్ గదలెన్ జరీలునన్. ౮౨.

టీక.—ఉక్కళము=ఉన్నతము, మనువు = జాతి. ఆహయరత్నము=శ్రేష్ఠమైన యాగుఱ్ఱమును, వాగెలోన్ = కళ్లెమును తగిలించుటలో, కక్కసము = కార్కశ్యము, రవగాలును = రెండురెండుకాళ్లయెగురుటయు, జోడన = చౌకళించి దూఁకుట, అడ్డ వేడెముల్ =పామునడకవంటి నడకలును, డుక్కు దువాళి = మఱుఁగుపడినట్టిదవుడును, జంగనడలున్ = దాఁటునడకలును, వన్నె = అంకవన్నె, సోఁకన్ = తగులఁగా, జరీలునన్ = శీఘ్రముగా.

గీ. ఎనయఁ జెవిఁ బొడిగించి తోలినహయంబు
దనదువక్షంబు నేలపైఁ దాఁకినటుల

నోటిలోఁ గాళ్లు వెళ్లెడునో యనంగఁ
గంచుమించుగ ధరణి గ్రక్కదలఁ గదల. ౮౩.

టీక.—ఎనయన్ = ఒప్పునట్లుగా. వక్షంబు = ఱొమ్ము. కంచుమించుగన్ = అగపడక పోవునట్లుగా. ధరణి = భూమి. గ్రక్కదలన్ = చలించునట్లుగా.

గీ. అసమతురగసమారూఢుఁ డైనవిభుఁడు
కదలునప్పుడు దిక్కులు గగనతలముఁ
గప్పెఁ గెంధూళి సాంధ్యరాగంబు మించి,
గదిసెఁ జీఁకట్లు, చక్రంబు లొదిగె నంత. ౮౪.

టీక.—అస...భుఁడు—అసమ = సమానములేనట్టి - తురగ = గుఱ్ఱమును - సమారూఢుఁడు = ఎక్కినవాఁడు, విభుఁడు = రాజు, గగనతలమున్ = ఆకాశమును, కెంధూళి = ఎఱ్ఱనిదుమ్ము, సాంధ్య రాగంబున్ = సాయంకాలసంబంధమైన యెఱుపును, కదిసెన్ = పొదివెను, చక్రములు = జక్కవలు, ఒదిగెన్ = తొలఁగెను.

క. వల లురులు బోనులు సివం। గులబండ్లును బొసఁగఁగా జిగురుగండెల దే
గల జాగిలములఁ గొని యపు। డలబలములతోడ మృగయు లరిగిరి వెంటన్.

టీక.—జిగురుగండెలు = బంకప్రామినదారములు. అల బలములతోడన్ = ఆ సేనలతో. మృగయులు = వేఁటకాండ్రు.

క. భూభాగ నభోభాగ స। మాభోగ నిరోధి మేదురాశ్వవ్రజ రిం
ఖాభీషణఘననినదస। మాభీలదిగంతబలసమన్వితుఁ డగుచున్. ౮౬.

టీక,—భూ...తుఁడు—భూభాగ = భూతలముయొక్కయు - నభోభాగ= ఆకాశముయొక్కయు - సమాభోగ = వైశాల్యమును - నిరోధి = ఆక్రమించుచున్న - అశ్వ వ్రజ = గుఱ్ఱపుసమూహములయొక్క - రింఖా=గొరిజల (ఘట్టన) యొక్క-భీషణ= భయంకరమైన - ఘన నినద=గొప్ప ధ్వనిచేత - సమాభీల = మిగుల భయంకరమైన - దిగంత=దిక్కులతుదలుగల - బల = సేనతోడ - సమన్వితుఁడు=కూడుకొన్న వాఁడు.

—* దండకారణ్యమున వేఁట. *—

మ. చని యంతం గనియెన్ బ్రమోదమున నాసన్నాంకపోదారధీ
ఖని కూలంకష దానతోయఝరకృత్కౌశల్యమేఘాయితా
త్యనఘాస్తోకయశోఘనుం డెదుట రుంద్రాభ్రంకషాశేషపు
ష్పనిధానావనిజాగ్రగణ్యము విరాజద్దండకారణ్యమున్. ౮౭.

టీక.—సర్వం కష = సకలమును ఒరయునట్టి - ఉదార=గొప్ప - ధీ=బుద్ధికి - ఖని = ఆకరమైనవాఁడును, కూలం కష = గట్లను ఒరయునట్టి - దానతోయ = దాన జలముయొక్క - ఝర = ప్రవాహమును-కృత్ =చేయునట్టి - కౌశల్య = నేర్పుచేత - మేఘాయిత = మేఘముగా నాచరించిన - అత్యనఘ = మిక్కిలి పాపరహితమైన, అస్తోక = అల్పముగానట్టి - యశః= కీర్తిచేత - ఘనుండు=దట్టమయినవాఁడు. రంధ్ర= గొప్పదియైన - అభ్రంకష = అకాశమునొరయుచున్న - అశేష = సమస్తమైన - పుష్ప = పుష్పములకు - నిధాన = నిక్షేపమైనట్టి - అవనిజ అగ్రగణ్యముల = వృక్ష శ్రేష్ఠములుగల దానిని. విరాజత్= ప్రకాశించుచున్న. ప్రమోదమునన్=సంతోషముతో.

మ కని సొత్తే హరి పుండరీక సపది గ్రస్త ప్రతిత్యక్త దం
తినికాయైణతతుల్ నిరాకులసముద్వృత్తంబులై వర్తిలన్
ఘన నిస్సాణ మృదంగ కాహళ హుడుక్కా భూరి భేరీ నిగుం
భన గంభీర విజృంభణ ధ్వని కదంబంబుల్ వనిం బొల్చినన్. ౮౮.

టీక.—కని, చొత్తేన్ = ప్రవేశింపఁగా, హరి...తతుల్—హరి = సింహముల చేతను - పుండరీక=పులులచేతను - సపది = అప్పుడే - గ్రస్త = పట్టుకొనఁబడి - ప్రతిత్యక్త = విడువఁబడినట్టి - దంతినికాయ = ఏనుఁగుసమూహములును - ఏణ తతుల్ = లేళ్ల సమూహములును, నిరా...త్తంబులు—నిరాకుల=వ్యాకులతలేనట్లుగా - సముత్ = సంతోషముతోఁ గూడుకొన్న - వృత్తంబులు=నడతకలవి, ఐ, వర్తిలన్=ప్రవర్తింపఁగా, ఘన...బంబుల్—ఘన = గొప్పవైన - నిస్సాణ = నిస్సాణముయొక్కయు-మృదంగ= మద్దెలయొక్కయు - కాహళ=నఫీరయొక్కయు - హుడుక్కా=ఉడుకయొక్కయు- భేరీ = నగారాయొక్కయు - నిగుంభన = నిండినటువంటి - గంభీర = అగాధమైన- విజృంభణ = వ్యాపించుటగల - ధ్వని కదంబంబుల్ = మ్రోఁతల సమూహములు.

క. సెలవిండు లెక్కవెట్టుచు,
'సెల విండు నృపాల' యనుచుఁ, జేరి కిరాతు
ల్వాలకేల మ్రొక్కి, 'చూడుము
వల కేల మెకాలఁ దోలవలె మే మునికిన్? ౮౯.

టీక.—కిరాతుల్ = బోయలు. సెలవిండులు = సెలసు బద్దలధనుస్సులను. నృపాల = రాజా. సెలవు = ఆజ్ఞను. ఇండు = దయసేయుఁడు. వలకేలన్ = కుడిచేత. వలకున్ = జాలమునకు.

గీ. పులులఁ జట్టలు చీరి, దుప్పులను లేళ్ల
నేకలమ్ములఁ గ్రుమ్మి కూరాకు సేసి,

యమరఁ జమరులఁ బట్టి పాలార్తు మిపుడు.'
సామి, చూడుము నీబంట్లసత్తు వనుచు. ౯౦.

టీక.—చట్టలు చీరి = చంపి. ఏకలమ్ములన్ = పందులను. కూరాకు = నజ్జు. చమరులన్ = సవరపు మృగములను. పాలార్తుము = నొంచెదము.

క. ఆరభటుల్ విలసిల్లఁగ । వీరభటుల్ గెడపి రవుఁడు విభుకట్టెదుటన్
సైరిభముల మదవదనీ । చైరిభముల సింహశరభశార్దూలములన్.

టీక.—ఆరభటుల్ = కోలాహలధ్వనులు. వీరభటుల్ = పరాక్రమము గల బంట్లు. విభు కట్టెదుటన్ = రాజు మ్రోల. సైరిభములన్ = దున్నపోతులను. మద .. ములన్—మదవత్ = మదముగల్గినట్టి - అనీచైః = అల్పముగానట్టి - ఇభములన్ = ఏనుఁగులను, సిం...ములన్—సింహ = సింగములను - శరభ = ఎనిమిదికాళ్ల జంతు విశేషములను - శార్దూలములన్ = పులులను, కెడపిరి = చంపిరి.

సీ. జిగు రంటినటుల వెన్ దగిలి పోనీక యా
సింగాణి మనుఁబోతుఁ జెండివైచుఁ,
గడుఁదురీఁగయుఁ బోలె వడిఁ దోలి కఱచి యా
కస్తూరి దుప్పుల గావుపట్టుఁ,
దొట్రించి గొర్లలోఁ దోడేలు సొచ్చిన
ట్లీగబ్బి లేళ్ల నట్టిట్టు సేయుఁ,
దగరువైఖరి దూఁటి తెగువ నీసురగాలి
పీఁటవెట్టినపందిఁ బీఁచ మడఁచు,
గీ. నని యిటులు వేలువేలు నాయకునియెదుటఁ
గాటుబంటుఁదనంబులు వేఁటకాండ్రు
మెచ్చి పొగడుచు మెకములమీఁద గొలుసు
లుడిపి జాగిలముల నుసికొలిపి రవుడు. ౯౧.

టీక.—చెండివైచున్ = చంపివేయును. గావు పట్టున్ = చంపును. తొట్రించి = తడఁబడి. గొర్లలోన్ = గొఱ్ఱెలలోను. తగరువైఖరిన్ = పొట్టేలురీతిగా. పీఁటవెట్టిన = కూర్చున్నటువంటి. పీఁచము అణఁచున్ = గర్వము పోగొట్టును. కాటుబంటుఁదనంబులు = కొఱికెడు బంటులయొక్క గుణములను. (సింగాణి, కస్తూరి, గబ్బి, సురగాలి, ఇవి ఆయా కుక్కల నామధేయములు.)

చ. ఒడిసెలరాతిచందమున, నుర్వడి సింగిణికోల వాఱుకై
వడి, లగుడాఁకటం బఱచువైఖరి, బిస్సున సాళువంబు దూ
ఱెకుక్రియఁ, దూఱఁ బాఱి కిటిబృందముఁ జిందఱ సేసెఁ జెంచు ల
య్యెడరున 'బాపురే! శుని, నరేశుని మెచ్చఁగఁ జేసితౌ!' ననన్. ౧౩.

టీక.—ఉర్వడిన్ = శీఘ్రముగా. సింగిణి కోలన్ = శృంగధనుస్సుయొక్క బాణము. లగుడు = ఒక తెగడేగ. పఱచువైఖరిన్ = పాఱు తెంచులాగున. సాళువంబు = డేగ. బిస్సునన్ = బిస్సుమని. కిటిబృందమున్ = పందుల సమూహమును. అయ్యెడరునన్ = ఆసమయమందు. శుని = ఓయాఁడుఁగుక్కా. నరేశునిన్ = రాజును.

చ. తికమక గాఁగఁ జేసి నలుదిక్కుల నార్భటి సేయుసారమే
యకముల సెల్గి కొట్టి నుఱుమాడుచు నొక్కవరాహ మేఁగెఁ జే
వకలిమి నప్పుడాయెఱుకువాండ్రదలింపుల కేమి సడ్డ సే
యక తనయిచ్చగా సరగున న్వడినడ్డమదేభమో యనన్. ౧౪.

టీక.—తికమక = కలఁత. ఆర్భటి = మ్రోఁత. సారమేయకములన్ = కుక్కలను. సెల్గి = సెలగి = ఖండించి. నుఱుమాడుచున్ = చంపుచు. చేవకలిమిన్ = బలము కొలఁది. సరగునన్ = వేగముగా. మద ఇభము = మదపు టేనుఁగు.

వ. ఇవ్విధంబున నేకలంపుగుంపుల శునకపరంపరలు చెండాడుచున్న యెడ.

టీక.—ఏకలంపు = అడవిపందులయొక్క. పరంపరలు = గుంపులు.

క. వడిఁ దేజిఁ దోలి రాజు । ర్వడి డొంకెనపోటుగా నురఃస్థలి నప్పుడా
పిడికిటిగొరకన్ వేయం । బిడి కిటి బిట్టగసి బిల్లమీటుగఁ బడియెన్.

టీక.—తేజిన్ = గుఱ్ఱమును. డొంకెన పోటుగాన్ = వంకరయలుఁగుగలయీఁటెతో పొడిచినవిధముగా. ఉరఃస్థలిన్ = ఱొమ్మునందు. ఆ పిడికిటి గొరకన్ = పిడికిటనున్న యా బాణముచేత. పిడికిటి = ఆఁడుఁబంది. బిట్టు = మిక్కిలి.

చ. బలువిలుకాండ్రు మెచ్చ నరపాలకుఁ డేసినయాశుగం బన
ర్గళ మద నాగ కేసరిని గాఁడి రసాస్థలి దూఱఁబాఱె, నా
వలఁ దనపేరు దాలిచినవాయువుఁ గ్రోలుట యెట్లు భోగిరా
ట్కుల మని నాగలోకమునకున్ బగ దీర్పఁగఁ బోవుకైవడిన్. ౧౫.

టీక.—...ఆశుగంబు = బాణము - వాయు వని యర్థాంతరము, అనర్గళమద నాగ కేసరిని = అడ్డులేని మదపు టేనుఁగు తోడి సింహమును (అడ్డులేని గర్వముగల

నాగేంద్రుని అనియు), కాఁడి = దూసి, తనపేరు తాలిచిన వాయువున్ = ఆశుగ మనుతనయొక్క పేరు పొందిన గాలిని, భోగి రాట్కులము = శ్రేష్ఠసర్పముల వంశము, క్రోలుట = భక్షించుట, రసాస్థలిన్ = భూమిలో.

ఉ. భూమివరేణ్యుఁ డేయుశరముల్ పులులన్ గఱి మోవ నాటుటల్
పై మఱి వెళ్లునెత్తురులు భాసిలె, నౌ, నవి పుండరీకముల్
తాము శిలీముఖంబులుఁ గదా, యటు గావున రక్తసీధువాః
స్తోమము లాని కుత్తుకకుఁ దొట్టిన వెల్లఁగఁ గ్రాసెనో యనన్. ౯౮.

టీక.—భూమివరేణ్యుఁడు=రాజు. శరముల్ = బాణములు. గఱి మోవన్= పిడిలోనియాఁకలవఱకు. పుండరీకముల్ = పెద్దపులులు - తెల్ల దామర లని యర్థాంతరము. శిలీముఖంబులు = బాణములు - తుమ్మెద లని యర్థాంతరము. రక్తసీధు వాః స్తోమములు ఆని = రక్తమనెడి యాసవ రస సమూహములను ద్రావి - ఎఱ్ఱనైన గజ మదజల సమూహములను పానము చేసి యని యర్థాంతరము. కుత్తుకకున్ తొట్టినన్ = గొంతునకు అనఁగా. క్రాసెనో = క్రక్కెనో.

క. నీపాలఁ బెట్టుకొను మవ । నీపాల యనుగతిఁ జేర నెగసినలేడిన్
జేపట్టి పులిని జీఱె ద । యాపరుఁ డై రాజమౌళి కది యుక్తమె ౯౯.

టీక.—అవనీపాల = రాజా, నీపాలఁ బెట్టుకొనుము=నీయొద్ద నుంచుకొనుము. చేపట్టి = చేతఁబట్టుకొని. రాజమౌళికిన్ = రాజశ్రేష్ఠునికి (శివునికి అని యర్థాంతరము. శివుఁడు సారంగపాణియు శార్దూలచర్మాంబరుఁడును గదా.)

చ. సమదగజంబుపై కుఱుకుసామజవైరికి సూటి పెట్టునా
గమకముఁ జూచి భూపతిముఖంబున వ్యాధులమూఁక నిల్వలే
కమితభయాప్తి నోరసిలె, నౌ నవు, నేనుఁగు పోవువీథి సిం
హము మెడగంట యెవ్వరొ రయంగల రా నెలవంక బాణమున్. ౧౦౦.

టీక.—సామజవైరికిన్ = సింహమునకు. సూటి=గుఱి. గమకమున్=ప్రయత్న మును. ముఖంబునన్=ఎదుట. వ్యాధుల= వేఁటకాండ్రయొక్క. నెలవంక=అర్ధచంద్ర. ఏనుఁ...గంట=ఆ యర్ధచంద్ర బాణము ఏనుఁగు పాఱిపోవుచున్నచోట సింహము మెడ లో గంటవలె తగులుకొను నట్టిది.

చ. అల వెనయం గజారులహృదంతరముల్ నలి నజ్జు చేసె, సం
ధిలుతమి ఋక్షసంఘముల తేజము దూలిచెఁ, బుండరీకమం

డలిఁ దెగటార్చె, నిర్లద టడంచె, నహహా ! కరచాతురీగతుల్
విలసిల రాజు నైజగుణవిక్రమముం గొనియాడ నయ్యెడన్. ౧౦౧.

టీక.—అలవు = అభ్యాసము, ఎనయన్ = కలుగునట్లుగా, గజా...రముల్—గజ=ఏనుఁగుల - అరుల=శత్రువులయొక్క (అనఁగా సింహములయొక్క) - హృత్ = ఱొమ్ములయొక్క-అంతరముల్ =లోపలిప్రదేశములను(గుండెల నడుమ), నలి నజ్జు చేసెన్ = మెత్తనచేసెను, (అని రాజపరము); జారుల = విటులయొక్క (అనిచంద్రపరము); సంముల్—సంధిలు = కూడఁకొన్నట్టి - తమిన్ = త్వరతో - ఋక్ష సంఘముల = ఎలుఁగు గుంపులయొక్క - తేజమున్ = అహంకారమును, తూలిచెన్ = పోఁగొట్టెను,(అని రాజపరము); తమిన్ = రాత్రియందు, ఋక్షసంఘముల = నక్షత్రసముదాయములయొక్క, తేజమున్ = కాంతిని, (అని చంద్రపరము); పుండరీక మండలిన్= పెద్దపులులయొక్క సమూహమును, తెగటార్చెన్= సంహరించెను, (అని రాజపరము); పుండరీక మండలిన్ = తెల్లదామరల సమూహమును, (అని చంద్రపరము); ఇర్లదటు = (ఇఱ్ఱులయదటు) = లేళ్లయొక్కగర్వమును, అడంచెన్= నశింపఁజేసెను; (అని రాజపరము); ఇర్ల=చీఁకట్లయొక్క (అని చంద్రపరము); అహహో=ఆశ్చర్యము, కరచాతురీగతుల్ విలసిలన్ = హస్తచమత్కారప్రకారములు ప్రకాశింపఁగా (అని రాజపరము); కర= కిరణ, (అని చంద్రపరము); రాజు = చంద్రస్వరూపుఁడైన రాజనరేంద్రుఁడు, నైజ గుణ విక్రమముల్ = తనయొక్క గుణపరాక్రమములను, కొనియాడన్ = నుతింపఁగా.

క. వాలమ్ముల దంష్ట్రాకర । వాలమ్ముల నెత్తివైచి వాలమ్ముల వే
జాలమ్ములఁ దగిలినకిటి । జాలమ్ములు దూఁటె నింద్రజాల మ్మనగన్.

టీక.—వాలమ్ములన్ = తోకలతోను, దంష్ట్రా కరవాలమ్ములన్ = కోఱలనెడు కత్తులతోను, వే=శీఘ్రముగా, వాలమ్ములన్ = పెద్దపులులను, ఎత్తివైచి = చిమ్మివేసి, జాలమ్ములన్=వలలయందు, తగిలిన, కిటి జాలమ్ములు=పంది గుంపులు, ఇంద్రజాలమ్ము అనఁగన్ = మాయ అనునట్లుగా, దూఁటెన్ = పాటిపోయెను.

క. ఆవల చించుక వేడలిన
నావలఁ బోసిక చెంచు లపు డడ్డం బై
యావల నుఱుమాడినఁ గని
యావలను విభుండు మెచ్చి హర్షము నొందెన్. ౧౦౩.

టీక.—ఆవలన్=అవతలికి. ఆవలన్ = బలములతో. నుఱుమాడినన్=చంపఁగా. ఆవలను = ఆయుపాయమును.

ఉ. శ్వసనునిఘోటి ఘోటివలెఁ జంగున దాఁటి పయిం జనంగఁ దా
రస మయి యొక్కఁ డొక్క యపరంజిపరుం జిగురొత్తు వాలువాల్
వెసఁ గొని కిన్కఁ గొంకిఁ దెగ వేసి బడిన్ బడి 'లేటికుంటు మా
నిసిపరు' వంట గానఁబడె నేఁ డనఁ గానఁ బడంగఁ జీలిచెన్. ౧౦౪.

టీక.—శ్వసనునిఘోటి = వాయువుయొక్క గుఱ్ఱము - అనఁగా లేడి, ఘోటివలెన్ = గుఱ్ఱమువలెనే, ఒక్క యపరంజి పరంజు ఇగురొత్తు వాలు వాల్ = బంగారు పిడి ప్రకాశించుచున్న వాఁడియైన యొక కత్తిని, వెసన్ = శీఘ్రముగా, కిన్కన్ = కోపముతో; కొంకి = మోఁకాలి యెముకను, బడిన్‌బడిన్ = వెంటనే, లేటికుంటు మానిసి పరువు అంట = లేడి కుంటుట మానిసి పరువెత్తుటతో సమానము అనుట. కానన్ = అడవిలో, చీలిచెన్ = సంహరించెను.

క. భటుఁ డొకఁడు పందిపోటున
బొట్ట వ్రేలికి సూటి వెట్టి పూని యదల్పన్,
గిటి దూఱి ముట్టెమొనఁ బడ
నటు చిమ్మిన ఱొమ్ముఁ దాఁకి యావల వెళ్లెన్. ౧౦౫.

టీక.—భటుఁడు = సేవకుఁడు. పందిపోటునన్ = బరిసిచేతను. దూఱి = చొచ్చి. ముట్టెమొనన్ = మూఁతికొనచేత.

క. బొఱియలకడ నెఱియలయెడ
నెఱి యలవడఁ బొంచి శునకనికరము త్రుంచెన్
బఱియలుగా మురియలుగా
నురియలుగా యన శశముల నుడుముందురులన్. ౧౦౬.

టీక.—శునకనికరము = కుక్కలగుంపు, బొఱియలకడన్ = చిన్నగోతుల చెంతను, నెఱియలయెడన్ = భూమియొక్క పగుళ్లదగ్గఱను, నెఱి = క్రమము, అలవడన్ = లభించునట్లు, శశములన్ = చెవులపిల్లులను, ఉడుము + ఉందురులన్ = గోధికలను మూషకములను. పఱియలుగాన్ = తునుకలుగా. మురియలుగాన్ = చిద్రుపలుగా ఉరి యలుగా యనన్ = ఉరి గోలయో యనునట్లు.

మ. కెడసెన్ దుప్పులు, డింక వేసె నెలుఁగుల్, గిట్టెన్ పులు, ల్సింగముల్
కడగొట్టెన్, మనుఁబిల్లు గంటిగొనె, జింక ల్చిద్దె, దోరం గిటుల్,

మడిసెగ గాఱనుపోతు, లేదు లిలిగెగ, బ్రమగ్గెగ వృకవ్రాతమ్ముగ,
గడుతు ల్చిక్కె, గజాళి చొక్కె, నవుడక్కా_నగ దుమాధూళిగగ.

టీక.—దుమాధూళిగగ= మిక్కిలి దుమ్ముగా. ఇఱుల్=హరిణములు. కెడసెగ
లో నగు సీక్రియలకు చచ్చె నని యర్థము.

వ. ఇవ్విధంబున భూవరేణ్యుం డయ్యరణ్యంబున ననేకమృగవిహగఘూ
టంబుల నిరాఘాటంబుగా గీటడంచి, యాఖేటకవిహారంబు చాలించి,
యెల్లెడం బెల్లుగాఁ బ్రదెల్లిన-యిఱ్ఱి జింక దుప్పి కడితి మనుఁబోతు క్రొండ
గొఱియ యేదుపంది కుందేలు కుఱుపోతు - మొదలయిన తినుమెకం
బులబొందులను శకుంతబృందంబులను బొందుగా నొక్క_కందువఁ
బ్రోవు వేయించి,యందులబుళిందులు సొగయ మృగయాధిదేవతా ప్రీతి
గాఁ జేయం దగుకృత్యంబు సేయించి, యెల్లరకును సమాంశంబుగాఁ
బంచి యిప్పించి, యుత్తమంబు లగుదంతిదంతముక్తికనికరంబులు,నిక
రంబు లయినకస్తూరీసంకుమదపంకంబులుఁ,బొంకంబులగుచమరవాల
జాలంబులు,నాదిగాఁ గలసమస్తవస్తువులుఁ గైకొని,పుష్పరసాదిబహు
పదార్థంబులు పాకనిపుణ పాచకరచితమహితపిశితఖండంబు లఖండం
బులు గా నేదిష్ఠభూమండలాఖండలమండలంబులు నిండువేడుకలఁ
దెచ్చి యొప్పించిన నిష్టమృష్టాన్నంబులు సంతుష్టిగాఁ దానును సకల
జనంబులు భుజియించి, యయ్యేలమావులక్రీనీడలఁ గొండొకసేపు పరి
శ్రమంబు వాయ విశ్రమించి, యంత నమ్మహనీయోత్తమగంధర్వుండు
వరూథినీసమన్వితుం డై మంత్రిపుంగవులు కఱుంగటం గొలిచి చను
దేరఁ గదలి, ముందఱఁ గంచుకు లెచ్చరింపఁ, జెంచుల నవలోకించి
'పదియైదు ప్రొద్దులు నిలిచి యివ్వనవిశేషంబులు చూడ నభిలాష
యయ్యెడు, నియ్యడవి నుండ వసతి యైనస్థలంబు గలదా?' యని య
డిగిన నయ్యాటవికు 'లయ్యా, యిక్క_డికి యోజనత్రయంబున ఘో
రకాంతారంబుఁ జొచ్చి పోవ నొక్క_రమ్యస్థలంబు గలదు. తత్స్థలం
బునఁ జుట్టుముడఁవెడల్పునం దామరకొలంకులు శృంగారవనంబులు

నెడ తెగక యుండు. తదీయమధ్యస్థలంబున ననర్ఘోదకంబుల ఘన దీర్ఘిక కల దందుఁ దొల్లి సీతారాములు విహరించుచుందు రని పెద్దల వలన వినినార మ'ని విన్నవించి, దానికిం ద్రోవ పెట్టుచుం జనఁ జన మధ్యమార్గంబున. ౧౦౮.

టీక.—భూవరేణ్యుండు = రాజు. అరణ్యానిన్ = గొప్పయడవియందు. ఘాటంబున్ = సమూహమును. నిరాఘాటంబుగాన్ = అడ్డములేనట్టుగా. ఆఖేటవిహారంబు= వేఁటయాటను. శకుంత బృందంబులన్ = పక్షిసమూహములను. కందువన్ = చోటను. పుళిందులు = చెంచులు. సొగయన్ = సొక్కునట్లుగా. మృగయా అధిదేవతా ప్రీతి= వేఁటను రక్షించు దేవతలకు తృప్తి. దంతి దంత మౌక్తిక నికరంబులు= ఏనుఁగు దంతములయొక్క ముత్యములయొక్క సమూహములు. నికరంబులు = శ్రేష్ఠములు. సంకుమద పంకంబులు = జవాది బురదలు, చమర వాల జాలంబులును= చమర మృగముల తోఁకలయొక్క (అనఁగా సవరములయొక్క) సమూహములును, పాక...బులు—పాక=వంటయందు - నిపుణ = సమర్థులైన - పాచక = వంటవాండ్రచేత - రచిత = చేయఁబడినట్టి - మహిత పిశిత ఖండంబులు = శ్రేష్ఠమైన మాంసపుఁ దునుకలను, అఖండంబులు = అపరిమితము, నేది - బులు— నేదిష్ఠ = సమీపమందున్న - భూమండల ఆఖండల = భూవలయ దేవేంద్రులయొక్క (అనఁగా రాజులయొక్క) - మండలంబులు=సమూహములు. మృష్ట = పరిశుద్ధమైన. ఎలమావుల = లేఁత మామిడిచెట్లయొక్క, కొండొక = కొంచెము. మహనీయోత్తమ గంధర్వుండు=కొనియాడఁదగిన శ్రేష్ఠమయిన గుఱ్ఱముకలవాఁడు (కొని...శ్రేష్ఠుఁడయిన గంధర్వుఁడు అని శ్లేష). వరూథినీ సమన్వితుండు = సేనతోఁ గూడుకొన్నవాఁడు (వరూథిని యను నప్సరతోఁ గూడినవాఁ డని శ్లేష. వరూథినీ గంధర్వుల కథ మనుచరిత్రలో నున్నది.) కుఱంగటన్= చెంతను. కంచుకులు = అంగజాలలు. అవలోకించి = చూచి. ప్రొద్దులు= దినములు. ఆటవికులు= అడవిజనులు. యోజనత్రయంబునన్ = మూఁడామడను. ఘోర - కాంతార - వనంబు= భయంకరమైన - దుర్గమయిన - యడవి. తదీయ = దానిదైన. అనర్ఘ ఉదకంబుల ఘన దీర్ఘిక = వెలలేని (అనఁగా శ్రేష్ఠమైన) నీళ్లుగల గొప్ప నడబావి.

సీ. కను మాయఁ జని సీతఁ జెనకు కాకాసురుఁ
గనుమాయఁగాఁ బాటికొనినచోటు,
తలకెక్కు వలపు నాఁ దగులు శూర్పణఖముఁ
క్కును జెవుల్ రాపాడుకొనినచోటు,

సపరివేషం బైనచంద్రబింబము వ్రాలె
గుడి వ్రాసి జానకి నిడినచోటు,
కుహనా మృగ నిశాటు గహనాధిదేవత
కనురక్తి బలి యిచ్చినట్టిచోటు,
గీ. గనుఁగొని విభుండు రామలక్ష్మణులు ధర్మ
సాధువులు విష్ణుమూర్తులు సంచరించి
నార లీపుణ్య మగునరణ్యాని జూడఁ
గలిగె నని సంతసిలుచు నావలఁ జనంగ. ౧౦౯.

టీక.—కనుమాయన్ = కంటిమాయగా = అదృశ్యముగా. చెనకు = అంటిన. కనుమాయఁగాన్ = కన్ను పోవునట్టుగా. పాటికొనిన= సరిచేసిన. వలపు=మోహము. రాపాడుకొనిన = కోయించుకొన్న. సపరివేషంబు = పరిధి (గుడి) తో కూడుకొన్న. ఇడిన = ఉంచిన. కుహనామృగ నిశాటున్=మాయ లేడి యైనరాక్షసుని (మారీచుని). గహన = వన.

గీ. అరిది యౌవనులు సరసు లనఁగి పెనఁగి
యెనసి శాఖోపశాఖలై యింపు మీఱి
ప్రబలి తామరతంప రై పరిఢవిల్లి
యెదుటఁ గన నయ్యె వాసనాపదము లగుచు. ౧౧౦.

టీక.—అరిది = ఆశ్చర్యము, ఔవనులు = అగునట్టి వనములును, సరసులు = తటాకములును, (యౌవనులు సరసులు అనుపదములకు ఏకశేషవృత్తిచేత యౌవనవంతులును రసజ్ఞులు నగు స్త్రీపురుషులు - అని యర్థాంతరము). అనఁగి పెనఁగి=ప్రేమ చేతఁ గలిసికొని, ఎనసి = కలసి, శాఖోపశాఖలు=కొమ్మలు వానికొమ్మలును (తెగలును వానిలో చేరిన చిన్న తెగలును). తామరతంపర=అభివృద్ధి (కుటుంబాభివృద్ధి అని ధ్వని). పరిఢవిల్లి = ప్రకాశించి. వాసనాపదములు = పరిమళస్థానములు (నివాసస్థానములు).

క. ఆతావు లపుడు గంధవ
తీతలనాథుండు సన్నుతించుచు బలసం
ఘాతము దిగు మని మెల్లన
నాతలి కటు పాదచారి యై చని చెంతన్. ౧౧౧.

టీక.—గంధవతీ తల నాథుండు = భూ మండ లాధిపతి; ఆతలికిన్ = అవతలికి.

సీ. మరుమావులరవం బమరుమావు లరు దైన
 తావిక్రొన్ననపట్లు క్రేవఁ దనరఁ,
బ్రామానికపునిగ్గుఁ బ్రామానికపుశిలా
 పట్టభంగంబులు పరిఢవిల్లఁ,
గన దంబుజాత కోకనదంబులఁ జరించు
 రాయంచ జక్కవ రవము లెసఁగ,
నా కాశరుచిఁ గేరు నాకాశ గంగతో
 నీకాశమై వారి నిండి తొలఁక,
గీ. మొలక తెమ్మెరకూనలు వెలయ నొలయ,
దేవనిర్మిత మైనట్టి దిగ్గియఁ గని
దిగ్గి యగణిత విభవముల్ దేజరిలఁగ
రాజు మంత్రులుఁ దాను హర్షంబుతోడ. ౧౧౨.

టీక.—మరు మావుల రవంబు = మన్మథుని గుఱ్ఱములయొక్క (= చిలుకలయొక్క) ధ్వని, అమరు మావులు=ఒప్పుచున్న తీయమామిడులు, అరుదైన=ఆశ్చర్యమైన తావిక్రొన్ననపట్లు=వాసనలు కలవియు అప్పుడే వికసించినవియు(నైన) పుష్పములు కలిగిన స్థలములు, క్రేవన్ దనరన్ = ప్రక్కయందు ఒప్పఁగా; ప్రా మానికపు నిగ్గున్ = శ్రేష్ఠమైన మాణిక్య కాంతిని, ప్రా...ంబులు—ప్రాము= పఱపుచున్న—ఆనికపు = సంతసగల—శిలా= రాతియొక్క -పట్ట=బల్లలయొక్క -భంగంబులు=మెట్లు, పరిఢవిల్లన్ = ప్రకాశింపఁగా; కన...బులన్-కనత్ =ప్రకాశించుచున్న - అంబుజాత=తామరలయందును - కోకనదంబులన్=ఎఱ్ఱ గలువలయందును,చరించు,రా...ములు—రాయంచ=రాజహంసలయొక్కయు-జక్కవ=చక్రవాకములయొక్కయు - రవములు = ధ్వనులు, ఎసఁగన్=ఒప్పఁగా; ఆకాశ రుచిన్=అల్లతెల్లు(పుష్పముల)యొక్క కాంతిని, కే...చిన్-కేరు=పరిహాసించునట్టి-ఆకాశగంగతోన్, నీకాశమై=సమానమై, వారి=ఉదకము, నిండి తొలఁకన్; మొలక తెమ్మెర కూనలు = అంకురించుచున్న పిల్ల మారుతములు, వెలయన్=ఒప్పుగా, ఒలయన్= విసరఁగా; దిగ్గియన్ = నడబావిని. దిగ్గి = దిగి.

వ. ఇవ్విధంబున నయ్యావనీవిభుం డమ్మహనీయస్థలశృంగారంబున కత్యంత
 సంతుష్టాంతరంగుం డై యచ్చట విశ్రమించి తత్తద్విశేషంబు లప్పు

టప్పటికిం గనుచు వనవిహారంబు సలుపుచున్న యెడ. ౧౧౩.

క. సారంగధరుఁడు లీలా। సారంగధరుండు సాధుసంస్తుత్యనయా
చారుండు ధర్మమర్మవి। చారుం డపు డుబుసు పోక సమ్మదలీలన్.౧౧౪.

టీక.—లీలా సారంగధరుండు=అవతారపు శివుఁడైనట్టివాఁడు (శివతుల్యుఁ డనుట). నయ = నీతి. ధర్మ మర్మ విచారుండు = పుణ్యముయొక్క రహస్యమును విచారించువాఁడు. ఉబుసు పోక = ప్రొద్దు పోక. సమ్మదలీలన్ = సంతోషముతో.

గీ. పారువంబులఁ బట్టెడి వారిఁ జీరి
యుద్దవడి ర మ్మనిన, భృత్యు లోకనిఁ బట్టి
పదుగు ర త్తఱి బడిబడిఁ బాఱుతెంచి
పులుఁగులను దె మ్మనుచు వారిఁ బిలువ నపుడు. ౧౧౫.

టీక.—చీరి = పిలిచి. ఉద్దవడిన్ = శీఘ్రముగా. పులుఁగులన్ = పక్షులను.

చ. జిలుఁ గగునాభినామములు చెంపలగందము లోరపాగలున్
వలిపపుసాలువింతవలెవాటులు లాఁగులు రావిరేకులుం
గలిగినగుజ్జురూపములుఁ గంబడిచింపులు నీలిపాఁత లీఁ
కలుఁ దగుపారువంపుఁబుటికల్ గొనివచ్చి కుమారుసన్నిధిన్. ౧౧౬.

టీక.—జిలుఁగు అగు నాభి నామములు = దట్టమైన కస్తూరి బొట్లును, వలిపపు సాలు= సన్నపు శాలువలయొక్క. లాఁగులు=చల్లడములు. గుజ్జు= చిన్న. జగ = ప్రసిద్ధమైన. పుటికల్ = బుట్టలను.

క. మే లైనలకోరీ లా। డీలుం బదతీలు పల్లటీ ల్పక్కివలున్
జీలుం బకదార్లును గూ। కీలు ననెడుపేరులం దగిన పార్వములన్.౧౧౭.

మ. వినయం బేర్పడ ముంగలన్ నిలుప నావిర్భూతకౌతూహలం
బున నారాజకుమారమన్మథుఁడు సొంపుల్ మీఱ మాధుర్యధు
ర్యనవీనస్వనగుంభనంబు మొద లౌనానావినోదంబు లె
ల్లను హాళిన్ విని వారివారి మనవు ల్పాటించి పాలించుచున్.౧౧౮.

టీక.—ఆవిర్భూత కౌతూహలంబునన్=పుట్టిన సంతోషముచే. మా...నంబు—మాధుర్యధుర్య = తీపును వహించునటువంటి - నవీన=నూతనమైనన - స్వన గుంభనంబు= ధ్వనులు చేయుట. హాళిన్ = సంతోషముగా. లాలించుచున్ = బుజ్జగించుచు.

క. పారావతరత్నం బని । పే రిడి బలుబిరుదు వేసి పెంచినదానిన్
గూరిచి తనసరిరాజకు । మారులతోఁబం దెమొడ్డి మాత్సర్యమునన్.

టీక.—జగ బిరుదున్ = ప్రసిద్ధ మై జయశీల మైనయందెను.

క. క్రేవ వల యొడ్డి యొంటిం । బావురమున్ దిగిచి వడి నభంబున కెగయం
గా వైచి వ్రాలకుండఁగఁ । జే విసరుచు బెదరు పుట్టఁ జేసినయంతన్.

టీక.—క్రేవన్ = ఒకవైపుగా. వల ఒడ్డి = జాలము ఒగ్గి. తిగిచి = పట్టుకొని. నభంబునకున్ = ఆకాశమునకు. చే = హస్తమును.

(లయగ్రాహి.)

పేరెములు వాఱుచు సమీరునిహుటాహుటిని
గేరడము లాడుచు మహారయముతో న
య్యారె! యన మీఱి గరుదారవముచేఁ జదలు
బూరటిల 'మాకొలమువారిఁ గనమా! యా
రార! యిది వింత గద రోరి!'యని యెంతయు న
నూరుఁడు పయిం దిరిగి సారెకును జూడన్,
దూర మెగఁ బాఱుచుఁ జొకార మయి యన్నలువ
వారువముచందమునఁ బారువము మించెన్. ౧౨౧.

టీక.—పేరెములు = పరుగులు. సమీరుని హుటాహుటిన్=వాయువుయొక్క వేగమును. కేరడములు=పరిహాసములు. అయ్యారె= శహబాసు. గరు..తన్—గరుత్ = ఱెక్కలయొక్క - ఆరవముచేతన్ = ధ్వనిచేత. చదలు = ఆకాశము. బూరటిలన్ = నిండఁగా. అనూరుఁడు = సూర్యసారథి. చొకారము = సౌందర్యము. ఆనలువవారువము చందమునన్ = ఆ బ్రహ్మ వాహన మైన హంసరీతిగా.

సీ. అభ్రమాతంగంబుహస్తంబులోఁ జిక్కి
కద లెడుపుండరీకం బనంగ,
హరివిధు ల్వాఱఁ గందఁ బెరుఁగునంబరకేశు
తలవాకఁ దేలెడునెల యనంగ,
మిన్నేటిదరులందు మేఁత లాడుచునున్న
యుదుటు రాయంచ లేఁగొదమ యనఁగ,

వడిఁ బోవుచోఁ జూటి పడునభోమణితేరి
తెల్లనిచిన్నారిజల్లి యనఁగ,
గీ. తెక్కలార్చుచు లకుముకిపక్కిరీతిఁ
దెలుపుచు ధరణి నే మైనఁ దెలుపుఁ గనినఁ
బెట్ట యని గమకించి చూపెట్టుకొనుచు
నుండెఁ బారువ. మప్పు డయ్యావజనంబు. ౧౨౨.

టీక.—అభ్రమాతంగంబు హస్తంబులోన్ = ఐరావతముయొక్క తొండమున. పుండరీకంబు=తెల్లదామరపుష్పము. హరి విధుల్ = విష్ణు బ్రహ్మలు. వెఱఁగు=ఆశ్చర్యము. అంబరకేశు = శివునియొక్క. నెల = చంద్రుఁడు. మిన్నేటి దరులందున్ = ఆకాశగంగా తీరములందు. ఉదుటు = దిట్టమైన-రాయంచ లేఁగొదమ=రాజహంస శిశువు. నభోమణి తేరి = సూర్యుని రథముయొక్క - చిన్నారిజల్లి = చిన్నిచామరము. పెట్ట = ఆఁడుఁబావురము. గమకించి = యత్నించి. చూపెట్టుకొనుచు = లెస్సగా చూచుచు. ఆయు వజనంబు = ఆయావనవంతుల సమూహము —తరువాతిపద్యముతో నన్వయము.

సీ. కంటికిఁ జే యోరగా నిల్పి కన్గొని
'యన్నన్న! యెంతద వ్వ'నెడువారు,
వలిపచేల ముసుంగు వైచి వేమఱు సూచి
'హా! కంటిఁ గంటి నే న'నెడువారు,
మెడలపై హస్తంబు లిడి తప్ప కీక్షించి
'యౌర మిక్కిలి పొడ వ'నెడివారు,
పళ్లెంపునీటిలోఁ బలిసీడ పరికించి
'కనిపింప దేచాయ న'నెడువారు,
గీ. గొబ్బుగొబ్బునఁ దల లెత్తి కొంద ఱందుఁ
జూడఁ జూడంగఁ బాగలు వీడి పడిన
నవ్వినోదము గని నవ్వినట్టివారు,
నైరి యొడ్డిన యొడ్డనివారు మెఱయ. ౧౨౩.

టీక.—ఒడ్డిన యొడ్డని వారు = ప్రతిజ్ఞ చేసినవారు చేయనివారును. దవ్వు = దూరము. ఈక్షించి=చూచి. పరికించి = చూచి. వలిప చేల = సన్నపు వస్త్రమును.

వేమలు = పలుమారు.

క. మినుకు మిను కనెడి మింటన్
బూనపూన నల తెల్ల మబ్బుపొంతన దిగువా
టున నదె కలదో లేదో
యనుమాత్రము గాఁగఁ గంటివా నృపతనయా? ౧౨౪.

టీక.—మింటన్ = ఆకాశమందు.- పూనపూన=కనఁబడుచు.

గీ. అనినఁ జెలికాంద్రపలు కతఁ డాలకించి
కించి దుపహాసమున విలోకించి 'గంటిఁ
గంటి, నౌ నౌను, నే ముందుఁ గంటి' ననుచు
ననుచుమదిఁ దాని మరలింతు ననుచుఁ దలఁచి. ౧౨౫.

టీక.—కించిత్ ఉపహాసమునన్=చిఱు నవ్వుతో. విలోకించి=చూచి. ననుచు మదిన్ = వికసించుచున్న మనస్సుతో.

ఉ. పెట్టను బట్టి తెక్కె వెలుపించి కనంబడునట్లుగాఁగ న
ట్టిట్టొక రెండుమారులు పయిన్ సురటిం బలెఁ జేతఁ ద్రిప్పుచున్
బిట్టుగఁ గేక వేసి వినఁ బిల్చిన, వెండి గరంగి ముద్ద యై
న ట్టిరుతెక్కలున్ ముడిఁచి యబ్బురపుంబలునిబ్బరంబునన్. ౧౨౬.

టీక.—పెట్టన్ = ఆఁడుబావురమును. వెలుపించి = వెడల్పు గాఁజేసి. సుర టిన్ బలెన్ = చామరము వలె. బిట్టుగన్ = గట్టిగా. ఎఅకల్ = ఱెక్కలు. అబ్బుర పుం బలు నిబ్బరంబునన్ = ఆశ్చర్యమైన గట్టి నిశ్చయముతో.

సీ. సౌధ కేతన పటాంచల వాత ధూత ని
ర్గత గాంగ డిండీర ఖండ మనఁగ,
సితమాని పూర్వావసిత భూ పునర్దిదృ
క్షాగ తేంద్రాగ లతాంత మనఁగ,
నవహార సంఘట్టన గ్రస్త పతయాళు
గగనలక్ష్మీ మౌక్తికం బనంగ,
మధ్యంది నానంతమణి లూన మందేహ
సంత్యక్త బిరు దైక శంఖ మనఁగఁ,

గీ. పంకరుహాసంభవ కళత్ర పత్త్రి పుత్త్ర
సురకులధురీణ కంఖాణ కరి కృపాణ
రమ్య ధావళ్య జైత్ర పారావతంబు
రాఁ దొడఁగెఁ జుక్క దెగి వడ్డ క్రమము దోఁప. ౧౨౭.

టీక.—సౌధ = మేడయందున్న - కేతన పట అంచల=టెక్కెయపు వస్త్రముల యంచులయొక్క - వాత = వాయువుచేత - ధూత = ఎగురఁగొట్టఁబడినదై - నిర్గత = బయలువెళ్లిన-గాంగ = గంగానదీసంబంధమైన - డిండీర ఖండము = నురువు తునుక. సితమానిని = తెల్లమునిచేత (అనఁగా నారదునిచేత) - పూర్వ అవసిత = మునుపు పొందింపఁబడిన - భూ = భూమిని - పునః దిదృక్షా ఆగత = మరల చూడనిచ్ఛచేత వచ్చినట్టి - ఇంద్ర అగ = ఇంద్రుని చెట్టుయొక్క (అనఁగా - కల్పవృక్షముయొక్క) - లతాంతము = పుష్పము. నవ హార = నూతన హారములయొక్క - సంఘట్టనక = ఒరయికచేత - స్రస్త పతయాళు = జాతి పడినట్టి - గగన లక్ష్మీ = ఆకాశ మను లక్ష్మీదేవియొక్క - మౌక్తికంబు=ముత్యము. మధ్యందిన = మధ్యాహ్నమందలి - అనంతమణి = సూర్యునిచేత - లూన = ఛేదింపఁబడినట్టి - మందేహ = మందేహులఁడను రాక్షసునిచేత - సంత్యక్త = విడువఁబడిన - బిరుదాంక=జయచిహ్నమైన - శంఖము = సంకు. పంకరుహాసంభవ = బ్రహ్మయొక్క - కళత్ర = భార్యయైనసరస్వతియు - పత్త్రి = వాహనమైన హంసమును - పుత్త్రి = కుమారుఁడైన నారదుఁడును - సురకులధురీణ = దేవేంద్రునియొక్క - కంఖాణ = గుఱ్ఱమైన యుచ్చైఃశ్రవమును - కరి = ఏనుఁగైన యైరావతమును - కృపాణ = వజ్రాయుధమును—అనువానివలెనే - రమ్య ధావళ్య = మనోహరమైన తెలుపుగలిగిన - జైత్ర = జయశీలమైన - పారావతంబు = పావురము.

గీ. అంతలోనన చిత్రాంగి యది యెఱింగి
క్రీడ సలుపుచు బంగారుమేడమీఁద
ములకవన్నెలు చిలుకురాచిలుకఁ బట్టి
చిలుకపలుకుల నటు చూపి పిలిచె నంత. ౧౨౮.

టీక.—ములకవన్నెల = ములకకాయవన్నె గలిగినటువంటి - అనఁగా పచ్చనివర్ణముమీఁద తెల్లని చుక్కలు గలిగినటువంటి.

మ. కని చిల్కం దనపెంటిగాఁ దలఁచి యాకైలాటపుంబుల్గు గ్ర
క్కున మి న్నందినమేడమీఁదికిఁ దళుక్కంగాంతితోఁ జుట్టి వి
చ్చినఱెక్కల్ పయిఁడంద బ్రమోఁతలు దగఁ, జిత్రాంగిరత్నాంగినం

దనుఁ గారింపఁగ వచ్చినట్టివిధియో నా, వచ్చి వ్రాలెన్ దమిన్. ౧౨౯.

టీక.— పెంటిఁగాన్ = ఆఁడుఁబావురమును గా. కైలాటపుంబుల్గు = నాలి పావురము. గ్రక్కునన్ = శీఘ్రముగా. మిన్ను = ఆకాశమును. పయిఁడంది = బంగారపుటందెయొక్క. కారింపన్ = బాధపెట్టుటకై. విధియో = దైవమో. నాన్ = అనునట్లు. తమిన్ = మోహముచేత.

చ. కెలఁకుల నిట్లు వ్రాల వలకేలను మెల్లనఁ బట్టి దువ్వి యా
నలినదళాక్షి "పక్షి యనునామము దీనికె చెల్లుఁ; బిల్చియుం
బిలువక మున్నె వచ్చె నిటు ప్రేమ దొలంకఁగ; నింక దీనిచేఁ
గలుగునిజంబుగాఁ దనకుఁ గాంక్షలు దీఱ సుఖంబు చెందఁగన్. ౧౩౦.

టీక.— కెలఁకులన్ = పార్శ్వములయందు. నలిన దళ అక్షి = తామర రేకుల వంటి కన్నులుకలదైన యా చిత్రాంగి. పక్షి = పిట్ట (ప్రీతిగలది యనియు భావము).

గీ. సందియము లే దొకింతయు నిందు కిపుడు;
వచ్చు సారంగధరుఁ డిందు; వచ్చునపుడె
తగులు నాచేత." ననుచు సంతసము నొంది
మేడ దిగి వచ్చి యప్పు డామెఱుఁగుఁ బోఁడి. ౧౩౧.

టీక.— సందియము = సందేహము. ఆమెఱుఁగుఁబోఁడి = మెఱుఁగుఁదీఁగవంటిదైన యాచిత్రాంగి.

శా. బంగారాన మెఱుంగు వెట్టినగతిం, బైపై గుబాళించు లేఁ
జెంగల్వం గడుఁ దావి గట్టినటులన్, జిన్నారిజాబిల్లిమీఁ
దం గన్పట్ట సుధారసం బిడుక్రియన్, దన్మోహనాంగంబునన్
సింగారించె వధూటికామణి మణిశ్రేణీపరిష్కారముల్. ౧౩౨.

టీక.— గుబాళించు = ప్రకాశించునట్టి - లేఁజెంగల్వన్ = లేఁతచెంగల్వపుష్పమునకు. చిన్నారి జాబిల్లి మీఁదన్ = బాల చంద్రుని మీఁద. సుధా రసంబు ఇడు క్రియన్ = అమృత ద్రవము నుంచి నట్టుగా. తన్మోహనాంగంబునన్ = మోహింపఁజేయు నా శరీరమందు. వధూటికా మణి = శ్రేష్ఠురాలయిన యా చెలువ. మణిశ్రేణీ పరిష్కారముల్ = మణులవరుసల భూషణములను.

వ. ఇవ్విధంబున బహువిధాభరణభూషిత యై యయ్యేడ. ౧౩౩.

సీ. రహి గట్టి తగెఁ గర్ణమహనీయవిభవంబు

తాటంకములమీఁదితగులు గల్గి,
యచలాయతనితంబ మతిశయిల్లి చెలంగెఁ
గాంచివజ్రప్రభాకలనఁ దనరి,
కృశమై కవును పేదటికము వాయక యొప్పెఁ
బ్రణుతింపఁ దగు నీవి పరిఢవిల్లి,
యలరారె మి న్నంది యరుణకరంబులు
ఘనకంకణములతో నసఁగి పెనఁగి,
గీ. యాార! యద్భుతశృంగార! మభినుతింపఁ
దరమె! వాసన కుల్కుకుందనపుబొమ్మ,
కలికిరూపైనరత్నమో కాక, యల్ల
మోహినియొ, నాఁగఁ జిత్రాంగి మురు వెసంగి. ౧౩౪.

టీక.—తాటంకములమీఁది = కర్ణభూషణముల మీఁది—తగులు = లోభము, గలిగి, కర్ణ మహనీయ విభవంబు = కర్ణునియొక్క పొగడఁదగిన యైశ్వర్యము, రహి కట్టి తగెన్ = శోభను పొంది యొప్పెను, అని విరోధము, కమ్మలు ధరించుటచేత చెవులు ప్రకాశించిన వని ఆభాసము; కాంచి వజ్ర ప్రభా కలనఁ దనరి = మొలత్రాటి వజ్రమణులయొక్క కాంతియను వజ్రాయుధకాంతియొక్క సంబంధముతో ఒప్పి, అచల ఆయతనితంబము అతిశయిల్లి చెలంగెన్ = పర్వతముయొక్క విశాలమైన నెత్తము అతిశయించి ప్రకాశించెను, అని విరోధము, మొలనూలి వజ్రమణులకాంతిచేత పర్వతమువలె విశాలమైన పిఱుఁదులు ప్రకాశించిన వని ఆభాసము; ప్రణుతింపఁదగు నీవి పరిఢవిల్లి = స్తోత్రార్హమైన లిబ్బి ఒప్పఁగా, కృశమై = చిక్కినదై కవును = నడుము, పేదటికము వాయక యొప్పెన్, అని విరోధము, అందమైన పోఁకముడిచేత సన్నని మధ్యప్రదేశము ప్రకాశించె నని యాభాసము; అరుణ కరంబులు = సూర్యకిణములు, ఘన కం కణములతోన్ = మేఘ జల బిందువులతో, అసఁగి పెనఁగి = కూడుకొని, మిన్ను అంది = ఆకాశమును బొంది, అలరారెన్ = ప్రకాశించెను, అని విరోధము, ఎఱ్ఱని హస్తములు గొప్పవైన కడియములతో కూడుకొని ప్రసిద్ధిని పొంది ప్రకాశించెను, అని ఆభాసము; అభినుతింపన్ = స్తుతించుటకు కలికి రూపైన = స్త్రీరూపము ధరించి నట్టి. మురువు ఎసంగి = సింగారము అతిశయించి.

క. ప్రియ మైె రమణీయ మణీమయ మై యతిచిత్రభిత్తిమంజిమ నయ మై
నయ మైనచిలుకపలుకుల। నయగారమునం జెలంగిన యాగారమునన్.

టీక.—ప్రియమై=మనోజ్ఞమై, రమణీయ మణీ మయమై=శ్రేష్ఠమైన రత్న వికారమై, అతి చిత్ర భిత్తి మంజిమ నయమై=మిక్కిలి చిత్తరువులు గల గోడలయొక్క సౌందర్యముయొక్క పొందికగలదై, నయమైన = బాగైన, చిలుకపలుకుల = కీరవాక్కుల యొక్క, నయగారమునన్ = అతిప్రేమచేత, చెలంగిన=ప్రకాశించినట్టి, అగారమునన్= ఇంటియందు.

క. వెయ్యాఱులు తనయుడిగపు
టొయ్యారులు గొలువఁ జెలువ మొలుకఁగఁ గొలువై
గయ్యాళి చిలుక తేజీ
వయ్యాళి పిసాళియాలివలె నున్నంతన్. ౧౩౬.

టీక.—వెయ్యాఱులు = పలువురు. ఉడిగపుటొయ్యారులు = పనికత్తెలయిన విలాసవతులు. కొలువై = సభ దీరినదై. చెలువము ఒలుకఁగన్ = సింగారము అతిశయింపఁగా. గయ్యాళి = ధూర్తురాలైనచిత్రాంగి. చిలుక తేజీ వయ్యాళి పిసాళి యాలివలెన్=చిలుక గుఱ్ఱపు విహారముగల కుత్సితుని (అనఁగా మన్మథుని)భార్య (రతి) వలె.

మ. సరసాగ్రేసర వాసరప్రభుతనూజస్థూలలక్ష్మీ పురం
దరజిద్భోగధురంధరా భరతశాస్త్రప్రౌఢమార్గైకకలా
స్వరసోత్పాదనకోవిదా శ్రవణభూషాదివ్యరత్నప్రభా
తరణిశ్రీకరగల్లభా విభవభృత్తంజాపురీవల్లభా. ౧౩౭.

[ఈ మూఁడు పద్యముల యర్థమును విజయవిలాస టీకయందుఁ గాననగు.]

క. తరుణీమన్మథ యాశ్రిత। భరణగుణాభరణశౌర్య బహురాజ్యధురం
ధర సత్యాదిమచక్రే। శ్వర యభినవభోజరాజవరబిరుదాంకా. ౧౩౮.

(తోటకము).

అతులాగమశాస్త్రనిరస్తసురే। జ్య తులాధికవిద్వదవాప్తశత
క్రతులాభ శుభోదయకారణర। త్న తులాపురుషాదికదానచణా.

(గద్య)

ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాదలబ్ధ ప్రసిద్ధ వాగ్వైభవ చేమకూర లక్ష్మణామాత్య తనూభవ సదారాధిత బుధసమాజ వేంకటరాజ ప్రణీతంబైన సారంగధర చరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ

ప్ర థ మా శ్వా స ము.

# ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీజానకీమనోహర
పూజాంచిత హృత్పయోజ పోష్యాఖిలది
గ్రాజ సకలార్థిజనని
ర్వ్యాజకృపా యచ్యుతేంద్రరఘునాథనృపా. ౧.

వ. అవధరింపుము.

క. ఆరీతిఁ బారువము పో
సారంగధరుండు తోడిజననాథసుతుల్
సారెకుఁ గేకలు వేయఁగఁ
గారాకూర మయి మనసు కళవళపడఁగన్. ౨.

టీక.—కారాకూరము=చిందఱవందఱ. కళకళవడఁగన్=వ్యాకులపడఁగా.

ఉ. బెంగ లిడంగ నెంటి యటుఁ బెంటిని గానక దేలిపోయి చి
త్రాంగి విచిత్రరత్న భవనాంగణసీమను దేల వ్రాలె నా
బంగరుముద్దుఁబావురము; బాపురె! యంతిపురంబులోని కే
భంగుల నవ్వుల న్వేడుకఁ బంపఁగ దా దిఁక నేమి సేయుదున్. 3.

టీక.—బెంగలు=కూఁతలు. రత్న భవన = మణిమయమైన యింటియొక్క — అంగణసీమన్ = మధ్య ప్రదేశమందు. ఏభంగులన్ = ఏరీతులను.

తే. తామసము సేయఁ దగ దింక దీమసమున
నేరుపరి నైన నేఁ బోక తీర దనుచుఁ
బోవ; మతిమంతుసుతుఁడు సుబుద్ధి దీర్ఘ
దర్శి గావున సారంగధరున కనియె.— ౪.

టీక.—తామసము = ఆలస్యము. దీమసమునన్ = ధైర్యముచేత. దీర్ఘదర్శి= దూరము చూచువాఁడు (ఆలోచించువాఁడు).

ఉ. మన్నన చేసి మీరు బహుమానముతో ... నెలవిచ్చినారు, నే
గన్నది దెల్పకుండిన నఘం బగుఁ, గా దని వెగ్గలింప కీ
విన్నప మాలకింపుము, వివేకివి గాని మహాఁడవు గావు, నీ
కెన్నఁడు లేనియోజ యిది యే మటుఁ బోయిన హాని యయ్యెడున్.

టీక.—అఘంబు = పాపము. వెగ్గలింపక = వెక్కసపడక. ఓజ = క్రమము. అటు = ఆయంతఃపురములోనికి.

ఉ. రా జొకఁ డూర లేఁడు, చెలి ప్రాయఁపుబిత్తరి, నీవు రూపరే
ఖాజితమన్మథుండ, వటు గావునఁ బోఁ దగ దయ్య నీకు నో
రాజకుమార, యెక్కడిపరా కిటు సూడఁ గదయ్య, భామినీ
రాజులచిత్తము ల్దెలియ రా దెటు వోయెటు వచ్చునో కదా. ౬.

టీక.—ప్రాయపుబిత్తరి = యౌవనముగల సుందరి. చెలి = చిత్రాంగి. రూపరేఖాజితమన్మథుండవు = సౌందర్యముయొక్క తీరుచేత జయింపఁబడిన మన్మథుఁడు కలవాఁడవు. భామినీ రాజుల = స్త్రీలయొక్కయు రాజులయొక్కయు.

క. వలపు సట, వావులా న హి,
యలసత్యము సున్న, తలఁపు లభ్రచ్ఛాయల్;
తలఁ దడిపి బాస చేసిన
జలజాక్షుల నమ్మరాదు సారంగధరా. ౭.

టీక.—సట = అబద్ధము. నహి = లేవు. అభ్ర చ్ఛాయల్ = మేఘముల నీడలు. తలఁ దడిపి = శిరఃస్నానముచేసి. బాస = ప్రమాణము.

తే. వయసువాఁడును మిగుల బాగయినవాఁడు
నన్నిట నోయూరి మైయుండునట్టివాఁడు
దైవగతి నొంటిపాటునఁ దగిలెనేని,
యోజ చెడి పైకొనదె యెట్టియువిద యైన? ౮.

టీక.—ఉవిద = జవరాలు. ఓజ = యోగ్యత.

వ. అది యటుండ నిమ్ము. ౯.

ఉ. ఇంతులచూపు నాటుకొను టెంతటిదే మగవారిచిత్తముల్?

గాంతలకన్నుసన్న నె మెలంగుఁ గదా మరునంబకంబు. లా
ద్యంతము లెంచి చూడఁ జవరాండ్రయెడాటములందు శక్యమే
యెంతటివాని కైనఁ జలియింపక బిగ్గ మనంబు నిల్పఁగన్? ౧౦.

టీక.—ఎంత అరుదే = ఏమి ఆశ్చర్యమా. మరు = మన్మథునియొక్క—అంబకంబులు = బాణములు. కాంతల కన్ను సన్న నె = స్త్రీలయొక్క నేత్ర సంజ్ఞ చేత నే. కాంతలనూపులే మదనబాణకృత్యమును నిర్వహించు నని భావము. జవరాండ్ర = యావన స్త్రీలయొక్క—ఎడాటములందున్ = క్రీడలందు. బిగ్గన్ = దృఢముగా.

ఆ. నిజము భీష్మునంతటిజితేంద్రియున కైన
నాశ పుట్టు మది, నిరాశ పుట్ట;
దితరు లనఁగ నెంత యేకాంత మై యున్న
ధనముపట్ల యువతిజనముపట్ల? ౧౧.

టీక.—యువతి జనము పట్ల = యావనంపు స్త్రీల విషయమందు.

క. వినమే తొల్లిటి తపసుల?
వనితలకున్ లోను గాని వారలు గలరే?
మన మనఁగ నెంత గరఁగక?
మన మనఁగా నెంత కలికి మటుమాయలకున్? ౧౨.

టీక.—తపసులన్ = ఋషులనుగూర్చి. వనితలకున్ = స్త్రీలకు. లోను=స్వాధీనులు. మనము = మనస్సు.

చ. గుఱుతుగ స్త్రీలకున్ మగలకున్ మది నిల్కడ లెందు లేవు; నీ
వెఱుఁగనినీతియుం గలదె? యేటికిఁ దత్తరపాటు? మీఁదటె
త్తెఱుఁగవు; నీవివేక మిపు డెక్కడఁ బోయె? విచారహీనతన్
గఱటితనంబునన్ బదరి కార్యము సేసిన మెత్తురే జనుల్? ౧౩.

టీక.—మీఁదటెత్తు = పైయోజన. కఱటితనంబునన్ = దుర్జనభావముచేత. పదరి = వేగిరపడి.

చ. నృపతికుమార, లోకమున నీసరి చక్కనివారు లేరు; నీ
విపు డటు పోయినప్పుడె పయిం బడి నిన్నాలవంతఁ బట్టు న

చ్చపలమృగాక్షి ; నీ వది పొసంగక వచ్చితి వేని, రాజుతోఁ
గపటము గాఁగఁ జెప్పి నినుఁ గల్లరిఁ జేయుఁ జుమీ నిజంబుగన్.

టీక.—నీసరి=నీవంటి. ఆ చపల మృగ అక్షి=చంచలములైన లేడి కన్నులవంటి కన్నులు గల దైనయాచిత్రాంగి. కల్లరిన్ = అసత్యమాడినవానినిగా.

క. తల గలిగినఁ గుళ్లాయులు
గల; వేవగ నైన నీవు గలిగినఁ దాదృ
క్కలరవము లెన్ని యైనన్
గలిగెడుఁ; బోకు మని యడ్డఁ గా ల్వేయంగన్. ౧౫.

టీక.—తాదృక్ కలరవములు=అట్టిపావురములు. అడ్డఁ గా ల్వేయంగన్=కాలు అడ్డము పెట్టఁగా.

క. కోపమునఁ జూచి యపు డా। భూపాలకుమారుఁ డను సుబుద్ధికి "నౌనౌ;
పోపొమ్మూరక వలదని। పాపము గట్టెదవు; చాలుఁ బదివే ల్వచ్చెన్.

టీక.—పది వేలు వచ్చెన్ = (నీయుపదేశమువలన) చాల లాభము సిద్ధించెను.

చ. అరమర లేక నీ వహరహంబును మచ్చికఁ గూడి మాడి మున్
బెరిఁగిన మందెమేలమున భీతిల కంటివి గాక; యిట్టు లొం
డొరు లని పోవ నోపుదు రఁటోయి? ప్రధానికుమార, నేఁడు ని
ష్ఠురతరఘోరపాతకపుసుద్దులు నీవలనన్ వినంబడెన్. ౧౭.

టీక.—అరమర = శంక. అహరహంబును = ప్రతిదినమును = ఎల్లప్పుడును. కూడి మాడి = కలసి మెలసి. మందెమేలమునన్=పరిహాసముచేత. నిష్ఠురతర=మిక్కిలి కఠినమైనట్టి. సుద్దులు=మాటలు.

ఉ. ఎక్కడిసుద్దు లయ్యె యివి? యెవ్వరి కైననుఁ జెల్లుఁ గా కిలం;
దక్కినయోజ లావిమలతామరసాక్షికిఁ గల్గ నేర్చునే?
యక్కట! తప్పి దారి యటు లైనను, నా హృదయాంబుజాత మా
దిక్కునఁ జిక్కునే? పరసతీవిముఖుం బని నీ వెఱుంగవే? ౧౮.

టీక.—తక్కిన యోజలు = మిగిలిన క్రమములు. ఆ విమల తామరసాక్షికిన్= పుండరీకమువంటి నేత్రములుగల యా చిత్రాంగికి. అటులైనను = ఆ మెకు చిత్తవికారము కలిగినను. అంబుజాతము = కమలము. ఆదిక్కునన్ = ఆస్త్రీయందు.

క. ఆదేవి యొక్కటియు, మఱి
యీదేవియు నొక్కటియునె? యిద్దఱు నాకుం
గాదిలితల్లులు గారె?
భేదంబులు గలవె తల్లిబిడ్డల కెందుం? ౧౯.

టీక.—గాదిలి = ప్రియమైన.

క. ఆమె యఁట, నన్ను బలిమిం
గామించు నఁట, యొడఁబడక క్రమ్మఱి తే రా,
సామికి వెగటుగ నను నఁట,
యీమాటకె యాజ్ఞ వెట్టు నఁట విభుఁ డహహా! ౨౦.

ఉ. ఆయమ పాతకం బని భయంపడ కూరక యేల నాపయిం
మాయలు పన్ని భూవరుమనంబుఁ గలంకఁగఁ జేయుఁ? జేసెఁ బో,
యీయన యేల పుత్త్రుఁ డని యాత్మఁ దలంపక నొంచు? నామొ, నా
తే! యిది వట్టిశంక, పని లే; దిటువంటివె నీతిమార్గముల్? ౨౧.

టీక.—ఆ యమ = ఆ చిత్రాంగి.

క. నామదికిం సరి పో దిది.
యేమి? యవశ్యంబు పోదు. నిప్పుడె తెత్తుం
నాముద్దుఁ బావురము." నని
భూమీశ్వరసుతుఁడు గడచి పో నతఁ డనియెం.— ౨౨.

ఆ. ఈ సుబుద్ధిమాట లెంత లే యని పోయె
దీసుబుద్ధి నిడుఁ జవిరా లతాంగి.
నిలు, పరాకు మాని తలపోసి చూడుమా,
నిలుప రాకు మనుచు నలుగ నేల? ౨3

టీక.—ఎంత లే అని = లక్ష్యము సేయక. లతాంగి = తీఁగవంటి శరీరముగల చిత్రాంగి; ఈసుం = ఈర్ష్యను. బుద్ధిం = మనస్సులో.

తే. నిన్నుఁ జూచిన నెట్టివంటినెలఁత కైన
మనసు గరఁగక యుండునా మనుజనాథ?

యల్లచిత్రాంగి తల్లి నా కనియె దకట !
వారకాంతల కెంతైన వావి గలదె ? ౨౪.

టీక.—నెలఁతకున్ = స్త్రీకి. వారకాంతలకున్ = భోగమువాండ్రకు.

క. ఏకాంత నైనఁ బురుషుం
డేకాంతమునందుఁ జేరె నేనియు నత్తన్
లోకాపవాద మంటదె ?
చీకాకుగ ధైర్య మెడలఁ జేయఁడె మరుఁడున్ ? ౨౫.

టీక.—మరుఁడున్ = మన్మథుఁడును. చీకాకుగాన్ = చిందఱవందఱగా.

క. వేగ నరేంద్రుఁడు రాకే
బాగా యిటు చనఁగ ? వాఁడిపలుమొన సోఁకన్
భోగంబున నిను మెదుపదె ?
భోగిని యైనపుడు చేరఁ బోరాదు సుమీ. ౨౬.

టీక.—(ఈపద్యములో చిత్రాంగి సర్పమునకు సమానముగాఁ జెప్పఁ బడియున్నది. ఎట్లనిన:—) వేగ=శీఘ్రముగా, నరేంద్రుఁడు రాకే = రాజనరేంద్రుఁడు రాకుండగా (విషవైద్యుఁడు రాకయే యని యర్థాంతరము), ఇటు, చనఁగన్ = పోవుట, బాగా= సరియేనా, భోగంబునన్=అనుభవముచేతను (పడగచేత నని యర్థాంతరము), వాఁడి పలుమొన సోఁకన్ = తీక్ష్ణమైన దంతాగ్రము తగలునట్టుగా (తీక్ష్ణమైనకోఱ తగులునట్టుగా నని యర్థాంతరము), నిను మెదుపదె=నిన్ను నలుపదా (అనఁగా శ్రమపెట్టు ననుట), భోగిని యైనపుడు=భోగస్త్రీ యైనందున (అనఁగా ఉంపుడుగత్తె యై యుండుట) (పడగ విప్పి యున్నపు డని యర్థాంతరము), చేరఁబోరాదుసుమీ. అనఁగా రాజులేనప్పుడు పోవుట యుక్తముకాదు; అట్లుపోయినయెడల అనుభవమునందు, దంతక్షతాదులచేత శ్రమపెట్టును; ఉంపుడై యున్నందున పోరా దని చిత్రాంగి పరమైన తాత్పర్యము. విషవైద్యుఁడు లేకుండ పోవుట యుక్తము కాదు, అట్లుపోయినచో కోఱలతో కఱచును. పడగ విప్పియున్నప్పుడు, సమీపమునకు పోరా దని సర్పపరమైన తాత్పర్యము.

ఆ. ఉగ్రశాసనుండు నిగ్రహింపక రాజు
తనయుఁ డనుచుఁ దప్పు తాళి యిడఁడు.
తండ్రి సేయునాజ్ఞ తాళె దనంటివా,
నింద నిజము గాఁగ నిలుచు నీకు. ౨౭.

టీక.—ఉగ్ర శాసనుండు=భయంకరమైన యాజ్ఞ గలవాఁడు. నిగ్రహింపక=దండింపక. తప్పు = నేరమని. తాళిమి ఇడఁడు = ఓర్వఁడు.

తే. చదువుకొంటివి నీతిశాస్త్రంబు లెల్ల;
నీ వెఱుంగనిమేరలు లేవు జగతి;
నైనఁ దెలిపితి నీమన సయ్యె యింక,
ధాత వ్రాసినవ్రాఁతకుఁ దప్పు గలదె? ౨౮.

క. 'ఈ రాసుతుసమ్ముఖమునఁ
జేరి యెవరు బుద్ధిమతులు చెప్పెడివారల్
లే రైరా?' యని పెద్దలు
దూరుదు రటు గాన నళుకుతో ననవలసెన్. ౨౯.

టీక.—బుద్ధిమతులు = బుద్ధిని మతిని (నీతుల ననుట). అళుకుతోన్=జంకుతో.

క. నావలనఁ గొదువ లే దిఁక,
దేవరకును విన్నవించితిని, మీచిత్తం,
బీవిధముఁ దెలుపకున్న ధ
రావరసుత మీ రెఱుంగరా సర్వజ్ఞుల్? ౨౦.

టీక.—దేవరకు = దేవరవారితో (నీతో ననుట). ధరావరసుత=రాజకుమారా.

క. అనిన నగి, 'యెందుఁ గలదే
మన సెఱుఁగనికలయు నొడలు మఱచినసివముల్?
కనె దేలా? మనసునకున్
మనసే తార్కాణ' మని కుమారుఁడు పేగన్. ౩౧.

టీక.—కనెదు + ఏలా. తార్కాణము = నిదర్శనము.

క. వల దన్న మాన కరిగెన్
జలమునఁ దనపాలివిధి వెసన్ గొనిపోవన్;
దొలుజన్మంబునఁ జేసిన
కొలయును బుణ్యంబు కట్టి కుడుపక యున్నే? ౩౨.

టీక.—చలమునన్ = క్రోధముచేత. విధి = దైవము. కొలయున్ = పాప

ముసు. కట్టికుడుపక యున్నే = నిర్బంధించి అనుభవింపఁజేయక యుండునా.

క. చనుచో వాకిటిపెద్దలు
గని దిగ్గన లేచి, 'రాజుగారిట లేరే!'
యని కొదుకుచు, నన లేకుం
డిన, నే మాయో నని మందటిలఁ బల్కి తగన్. 33.

టీక.—కొదుకుచున్=నోరు తడఁబడుచు. మందటిలన్=ఊఁడిల్లినట్లుగా.

సీ. సికపువ్వు లెత్తుఁదావికి వెంటఁ బడు తేంట్ల
ఝుంకృతి మాగధ స్తవము గాఁగ,
గడిఁది రాయకుమార గండపెండేరంపు
రవళి కంచుకిలోక రవము గాఁగ,
తల చుట్టి వచ్చుదృగ్ధాళధళ్యప్రభ
లిరువంక వేయుచామరలు గాఁగ,
నలుదెస ల్మిఱుమిట్లు గొలుపు దేహచ్ఛాయ
తలఁగఁ ద్రోయఁగ రానిబలము గాఁగ,
తే. రాజసంబునఁ గక్ష్యాంతరములు గడచి
యరిగె నప్పుడు జగన్మోహనాంగవిజిత
రాజరాజకుమారసారంగధరుఁడు
రాజరాజకుమారసారంగధరుఁడు. 34.

టీక.—సిక పువ్వు లెత్తు తావికిన్=సికయందున్న పూబంతి వాసనకు, వెంటఁబడు, తేంట్ల ఝుంకృతి = తుమ్మెదలయొక్క ఝుంకారధ్వని, మాగధ స్తవముగాఁగన్ = బట్రాజులయొక్క పొగడ్త గాఁగా; కడిఁది = గొప్పదైనటువంటి - రాయకుమార = సారంగధరునియొక్క - గండపెండేరంపు = బిరుదుటందెయొక్క - రవళి = ధ్వని, కంచుకి లోక=అంతఃపురపాలక జనముయొక్క - రవము గాఁగన్ = ధ్వని కాఁగా; తల చుట్టి వచ్చు=శిరస్సును చుట్టివచ్చునట్టి - దృక్ = నేత్రములయొక్క - ధాళధళ్య ప్రభలు=ధళధళకాంతులు, తలఁగఁ ద్రోయఁగరాని=విడువఁగూడనటువంటి బలముగాఁగన్ = సిబ్బంది గాఁగా; రాజసంబునన్ = ఠీవితో, కక్ష్యాంతరములు = లోఁగిళ్లు, కడచి = దాఁటి, జగత్ మోహన =లోకమును భ్రమింపఁజేయు నట్టి - అంగ

శరీరముచేత - విజిత = జయింపఁబడిన - రాజరాజ = కుబేరుని-కుమార=కొమారుఁడైన నలకూబరుఁడును - సారంగధరుఁడు = చంద్రుఁడును కలిగినవాఁడు, రాజరాజ కుమార = రాజనరేంద్రుని పుత్త్రుఁడైన - సారంగధరుఁడు. అరిగెను = పోయెను.

తే. అంత నొకకాంత యరుదెంచి యతనిఁ గాంచి
సరగఁ జని, 'యమ్మ సారంగధరుఁడు వచ్చు
చున్నవాఁడ'ని దెలుప, నయ్యుత్పలాక్షి
కోర్కెలీడేఱె నని మెచ్చుకొనుచు నపుడు. ౩౫.

టీక.—అరుదెంచి = వచ్చి. సరగన్ = శీఘ్రముగా.

ఉ. 'కంతుఁడొ? కాక యారజనికాంతుఁడొ? లేక జయంతుఁడో? యితం
డెంతవిలాస! మెంతకళ! యెంతయొయార! మ'టంచు విస్మయా
క్రాంతమనంబుతో సపులకస్తని యై కనుఱెప్ప వేయ క
క్కాంత మహాభిలాషఁ దటకాపడి చూచెఁ గుమారశేఖరున్. ౩౬.

టీక.—కంతుఁడో = మన్మథుఁడో. రజనికాంతుఁడో = చంద్రుఁడో. జయంతుఁడో = ఇంద్రసుతుఁడో. సపులకస్తని=గగురుపాటుతోడి కుచములుగలది. తటకాపడి = తొట్రుపడి. కుమారశేఖరున్ = యౌవనవంతుల సిగదండయైన సారంగధరుని.

చ. ఉరుకుచ డెంద మెంతమృదువో? మఱి తియ్యనితుంటవింట నే
విరవిరఁ బోవునారిఁ గొని పెన్నటిగొజ్జఁగతూపుచేత న
చ్చెరువుగఁ బొంచి కంటికి దిసింపనివాఁ డపు డేసి యార్చెఁ బో
సురసుర స్రుక్క; మెత్త నగుచోటనె గుద్దలి వాఁడి యౌఁ గదా. ౩౭.

టీక.—ఉరుకుచ=గొప్పస్తనములు గలదానియొక్క (చిత్రాంగియొక్క)- డెందము=హృదయము. తియ్యనితుంటవింట నే= చెఱకువింటనే. విరవిరఁబోవు నారిన్= ఒకటితో నొకటి కలియని తుమ్మెదనారిని. పెన్నటి=గొప్ప - గొజ్జఁగ తూపుచేతన్=రోజాపువ్వు బాణముతో. దిసింపనివాఁడు=అంధగింపనివాఁడు - (అగపడనివాఁడు - అనఁగా- దేహము లేనివాఁడు - మన్మథుఁడు.)

క. ఇంతంత గానితమి న । క్కాంతామణి యట్టు లతని గనుఁగొని, మణిపీ
ఠాంతరము డిగ్గి, యతఁడ । ల్లంతట రా హర్షమగ్న యై తనలోనన్.

క. సారంగనయన తనమన । సారంగను గాఁగిలించి యులరఁగ నపుడా
సారంగధరునిఁ గూర్పఁడె । సారంగధరుం డటంచు సాకెం గలఁగన్.

టీక.—సారంగనయన = లేడికన్నులవంటి కన్నులుగల చిత్రాంగి. మనసు ఆరంగన్ = కోరిక తీఱేటునట్లుగా. సారంగ ధరుఁడు = లేడిని ధరించినశివుఁడు. సారెన్ = మాటికి. కలఁగున్ = చింతించును.

ఆ. ఔర! వీనిమోహనాకారరేఖ వే
మాఱు మారు హరికుమారు మాఱు;
వెల్లదమ్మితొగల వీనికన్దోయితీ
రేపు మాపు బాపు! రేపు మాపు. ౭౦.

టీక.—వేమాఱున్ = పలుమాఱును, మారున్ = మన్మథుని, హరికుమారున్ = జయంతుని, మాఱున్ = తక్కువపఱుచును. కన్దోయితీరు = నేత్రద్వయముయొక్క సొంపు, వెల్లదమ్మి తొగలన్ = తెల్లదామరలను కలువలను, రేపున్ మాపున్ = పగటియందును రాత్రియందును (పగలు వెల్లదమ్మిని రాత్రి కలువను అని వివేకము), ఏపు మాపున్ = గర్వము నడంచును. బాపు = ఆశ్చర్యము.

సీ. చక్కఁగా సోగ యై ముక్కు కోశేరు పె
ట్టినరీతి సంపెంగటెక్కు దెగడ,
లచ్చియన్నకుఁ దమ్ములకును వాదులు పెట్టి
కళకళ నగుమోము కళల నీన,
కండెము ల్దిరిగి బల్గొండలు దాపించి
నటువలె నెగుబుజా లతిశయిల్లఁ,
గమ్మిఁ దీసినలీలఁ గనుపట్టునెమ్మేని
మిసమిస ల్కడు మిఱుమిట్లు గొనఁగ,
తే. నడుగులబెడంగు నంచల నాస గొల్పఁ,
జెలఁగి యమ్మక్క! యొక్క యొచ్చెమ్ము లేక
నిలువుసీరునఁ బండిన ట్లలరినాఁడు!
వేయుఁ గన్నులు వలయుఁ బో వీనిఁ జూడ. ౭౧.

టీక.—కోశేరు పెట్టినరీతిన్ = సాఁగేటిచాలువలెనే. టెక్కు = గర్వమును. తెగడన్ = నిందింపఁగా. లచ్చియన్నకున్ తమ్ములకున్ = లక్ష్మికి అన్నయైన చంద్రునికిని కమలములకును. వాదులు = కలహములను. కళల నీనన్ = కాంతులను పుట్టింపఁగా. కండెముల్ తిరిగి = బలిసినవై. దాపించినటువలెన్ = మలిచినట్టుగా. కమ్మిన్ తీసిన లీలన్ = కమ్మచ్చులో

కమ్మి దివిచిన తేజస్సుతో. బెడంగు = సౌందర్యము. అంచలన్= హంసలను. అమ్మక్క= ఆశ్చర్యవాచకము. ఒచ్చెమ్ము= కళంకము. నిలువు నీరునఁ బండినట్లు = మానిసిప్రమాణపు నీళ్లు నిలిచిన చేనిలో పైరు పండినరీతిగా.

ఉ. తీరుగ మల్చివేసినగతిన్ దొడ లున్నవి; ఱొమ్ములోనివి
స్తారము చెప్పరాదు, బలుదల్పు, నదల్పును; బాలు గాఱు నో
రార! మొగమ్ముచక్కఁదన; మన్ని యటుండఁగ నిమ్ము, పీని యొ
య్యారమె లక్షసేయు;నహహా! యనుచున్ దల యూఁచు సారెకున్.

క. ఇవ్విధమున, నే నీతని । జవ్వన మిపు డపహరింతు సరగ నని, మనం
బువ్విళ్లూరఁగ వెనుకన్ । బువ్విలుదొర కలువతూపు మొన దీడంగన్.

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁ; డిటువంటివాని నే
నెక్కడఁ జూచి కాన; జగతీశ్వర! చిత్తరువందు వ్రాయ రా
దిక్కమనీయరూప మొకయింతయు; భాగ్యము గాదె యొచ్చెము
ల్దక్కినకూర్మి నా కితఁడు దక్కినఁ; దక్కినమాట లేటికిన్? ౪౪.

టీక.—జగతీశ్వర= స్వామీ. కమనీయ = మనోజ్ఞమైన. ఒచ్చెముల్ తక్కిన కూర్మిన్=కళంక రహితమైన ప్రీతిచేత. దక్కినన్ = ప్రాప్తమైనయెడల.

చ. వలపు దువాళి సేయఁ, బికవాణి కదంబపుఁగమ్మవాసనల్
కులుకుఁబయోధరంపుమెఱుఁగుల్ హృదయంబున నాటునంబకం
బుల బెడిదంపువాఁడితనమున్ గనిపింపఁగ, జాఱుపైఁటతో
సొలపుఁ బిసాళి వాలుఁ దెలిచూపులతోఁ దమకంబుతోడుతన్. ౪౫.

టీక.—వలపు=మోహము, దువాళిచేయన్=దవుడు సేయఁగా, పికవాణి=చిలుక పలుకులవంటి పలుకులుగల చిత్రాంగి, కదంబపు=చందనాదులయొక్క - కమ్మవాసనల్ కులుకు పయోధరంపు మెఱుఁగుల్ = మధురమైన నెత్తావులను గుప్పించుచున్న పాలిండ్ల కాంతులు, హృదయంబున నాటిన యంబకంబుల = వక్షఃస్థలమందు నాటిన బాణముల యొక్క - బెడిదంపు వాఁడి తనమున్ =అధికమైన తీక్ష్ణ భావమును, కనిపింపఁగన్=చూపుచుండఁగా, (కుచకాంతులు డెందమునం గ్రుచ్చుకొన్న మదన బాణములవలె నొప్పుచుండఁగా ననుట), జాఱుపైఁటతోన్, సొలపు = మందమైన - పిసాళి = క్రూరమైన- వాలుఁ దెలిచూపులతోన్ = వాఁడియైన తెల్లని దృష్టులతోను, తమకంబుతోడుతన్ = మోహముతోను. (తర్వాతి పద్యముతో నన్వయము).

సీ. రాకంత గాని లేదే కైవడి సమంబు
వచ్చు బంగారు మైహెచ్చుజిగికి ?
గోరంత గాని లే దేరీతిఁ బ్రతి వచ్చు
యావరక్తిమ మించు మోవిరుచికి ?
ఇసుమంత గాని లే దెటువలె నెన వచ్చు
సైకతంబు విశాలజఘనమునకుఁ ?
కంటిలోఁ బడినంత గాని లే దెటు లీడు,
వచ్చు కాటుక కప్పువాల్కురులకు ?
తే. ననుచు నఖిలాంగశృంగార మభినుతించు
గతిఁ దులాకోటి మణికోటి కాంచిదామ
కింకిణీగణ కంక ణాకీర్ణ కలక
లారవమ్ములు గులుక నొయ్యార మొలుక. ౭౬.

టీక.—మై = దేహముయొక్క-జిగికిన్=కాంతిముందఱ, రాకంత గాని లేదు= ఇంచుకంత యేని లేదు (బంగారురాక లే దనియు భావము), మించు మోవిరుచికిన్= అతిశయించిన యధరకాంతిముందఱ, యావ రక్తిమ=లత్తుకయొక్క యెఱుపు, గోరంత గాని లేదు= ఇంచుకంతయేనియు లేదు (గోటికి లత్తుక పూసికొందురుగావున గోరంతయే అనియు భావము), జఘనమునకున్ = కటిప్రదేశము ముందఱ, సైకతంబు=ఇసుకదిబ్బ, ఇసుమంత గాని లేదు = ఇసుకరవపాటియుఁ గాదు (ఇసుకదిబ్బయంతయు ఇసుకయే యని చమత్కారము), ఎన=సాటి. కప్పు వాలు కురులకున్ = నల్లనైన దీర్ఘకేశములముందఱ, కంటిలోఁ బడినంత గానిలేదు=కంటిలోఁ బడునంత కంటెనధికము లేదు (కాటుక కంటిలోఁ బడునట్టిదే యనియు భావము). అంగ = అవయవములయొక్క. తులాకోటి = అందెలయొక్క- మణి కోటి = రత్నముల సమూహముల యొక్కయు- కాంచి దామ = మొలనూలి తీఁగయొక్క - కింకిణీగణ = గజ్జెల సమూహము యొక్కయు, కంకణ = మురుగులయొక్కయు- ఆకీర్ణ = వ్యాప్తమైన, కలకల ఆరవమ్ములు=సంకులధ్వనులు.

ఆ. ఇంద్రనందనుఁ గాంచి మోహించి వచ్చు
నుర్వశి తెఱంగు దోఁప నయ్యూర్వసితప
యోదకచ పాకశాసని యొఱపు నెరపు
నక్కుమారునిఁ గని చేర నరుగుదేర. ౭౭.

టీక.—ఇంద్రనందనుఁ = ఇంద్రునికుమారుఁడైన యర్జునుని. తెఱంగు = విధము. (ఆ) ఉరు అసిత పయోద కచ=గొప్పవియై నల్లనైన మేఘమువంటి కొప్పుగలదైన (యా) చిత్రాంగి. పాకశాసని ఒఱపుఁ సెరపు = అర్జునునియొక్క సౌందర్యమును వ్యాపింపఁ జేయుచున్న. ఎరుగుదేరఁ = రాఁగా.

తే. అపుడు మంజీరకలకలం బాలకించి
వలదు వల దన్నగతి దోఁపఁ బలికి పెనఁగు
నంచగమిఁ గాళ్లఁ ద్రోచి యేతెంచె; శకున
మడ్డగించినపని సేయ నగునె యెందు ? ౪౮.

టీక.—మంజీర కలకలంబు = కాలియందెలయొక్క మనోజ్ఞధ్వనిని. పలికి= కూయుచు. పెనఁగు అంచగమిఁ = (కాళ్లకు) చుట్టుకొన్నటువంటి హంసలయొక్క గుంపును. శకునము = శుభాశుభసూచకము (పక్షి యనియు భావము).

క. తనుఁ గన్నవారి నామడఁ
గను మన్నది తేటపడఁగఁ, గడువేడుకతోఁ
బినతల్లికి నెదురుగ వే
చని, యప్పు డింపెనయ వినయసంభ్రమపరుఁ డై. ౪౯.

టీక.—ఆమడఁ కనుము అన్నది=ఆమడదూరమం దున్నప్పటికిని చూడు మని యుండుట. వే=శీఘ్రముగా. ఇంపు ఎనయఁ=ప్రీతి అతిశయింపఁగా. వినయ సంభ్రమ పరుఁడై = నమ్రతయొక్క తేగిరపాటునకు లోనైనవాఁడై.

ఆ. 'రాజు లేనివేళ రాఁ జెల్ల దిందు, నా
వలనఁ దప్పు గలదు, లలన సైఁపు,
మనుచు' మనుచు వేఁడుకొనురీతి మ్రొక్కె సా
రంగధరున కనుఁ గురంగనయన. ౫౦.

టీక.— కురంగనయన = లేడి (కన్నులవంటి) కన్నులుగలదైన చిత్రాంగి. మనుచుము = రక్షింపుము.

క. వసుధేశుఁడు నీవును నొ
క్కసమం బని మదిఁ దలంపఁగా, నాకు నహో !
యసమాంబకుండ వయ్యుఁ,
బొసఁగునె తొడిఁబడఁ బ్రణామముఁ ఘటియింపఁ ? ౫౧.

టీక.—వసుధేశుఁడున్= రాజును. అసమ అంబకుఁడవు= వేఱు తల్లి కలవాఁడవు (మన్మథుఁడవు అనియును భా). తోడఁబడన్=తొట్రుపాటుతో. ప్రణామమున్ = నమస్కారమును.

తే. అని సుశీలయుబలె నా గయాళిజంత
చేయి చూపి ముందఱగ విచ్చేయు మనుచు,
నయ్యనఘుఁ దోడుకొని యేఁగె, నతివినయము
ధూర్తలక్షణ మని మదిఁ దోఁప నప్పుడు. ౫౨.

టీక.—సుశీలయుబలెన్ = మంచిస్వభావము గలదానివలెనే. జంత = ధూర్తురాలు. విచ్చేయుము = విజయంచేయుము- రమ్ము. ఆ అనఘున్=ఆ పాపరహితుని.

క. గంబూర గులికి, యనురా। గంబూర మనంబు, చల్లఁగాఁ బన్నీటన్
బింబోష్ఠి యతనిపాదా। బ్జంబులు గడిగించెఁ గూర్మిసకియలచేతన్.

టీక.—బింబోష్ఠి—బింబ = దొండపండువంటి - ఓష్ఠి = మోవిగలదైన చిత్రాంగి. మనంబు అనురాగంబు ఊరన్ = మనస్సులో ప్రేమ ఉప్పతిల్లుచుండఁగా. గంబూర = కర్పూరమును. కులికి = (పన్నీటిలో) వేసి. అబ్జంబులు = కమలములను.

చ. జనవరసూనుఁ డందులకుఁ జాలఁ బ్రియంబు దొలంక నన్నెలం
తను గని, 'నీ కుమారుఁడఁ గదా, యిటు తక్కినవారికి న్బలెన్
జననిరో, నాకు నింతయుపచారము సేయఁగ నేటికమ్మ నేఁ?
డనవుడు 'నాకు మారుఁడవె యాటను జేయుదు' వంచు నేర్పునన్.

టీక.—జనవరసూనుఁడు = రాజకుమారుఁడైన సారంగధరుఁడు. తొలంకన్ = కొల్లివిరియుచుండఁగా. ఆనెలంతన్ = ఆచిత్రాంగిని. అనవుడున్ = అని పల్కఁగా. నాకుమారుఁడవె = నాపుత్త్రుఁడవే (మన్మథుఁడవే అనియు అర్థము).

క. పేర్చినబలుమానికములు
నేర్చినయొక జాళువాపసిఁడిగద్దియపైఁ
గూర్చుండఁబెట్టి వినయము
గూర్చి నృపాలసుతుఁ గూర్చి గూర్మి పొసంగన్. ౫౩.

తే. తలిరుఁగెమ్మోవిఁ జిఱునవ్వు మొలక లెత్త,
నలరుకమ్మనివాసనల్ గులకరింప,

గెలనఁ దియ్యని తేనెలు చిలుకుచుండఁ
గలికిలతకూన యాకొమ్మ పలికె నపుడు.— గీ.౬.

టీక.—తలిరు కెమ్మోవిన్ - తలిరు = చిగురుటాకులవంటి- కెమ్మోవిన్ = ఎఱ్ఱనియధరోష్ఠమందు. గులకరింపన్ = వ్యాపించుచుండఁగా. కెలనన్ = సమీపమునందు. తియ్యనితేనెలు= మధురములైన (రసములు అను) మకరందము. కలికి=విలాసవతియైన-లతకూన = లేఁదీఁగవంటిదైన. ఆ కొమ్మ = శాఖారూపమైన యా చిత్రాంగి.

ఉ. నీసుగుణత్వమున్, జెలువు, నేర్పును, నెచ్చెలు లెల్లఁ జెప్పఁగా,
వీసరవోని మోహమున వీనులవిందుగ విందు నవ్యరే
ఖాసుమకాండ; నేఁడు పొడగంటిని; గన్నులపండు వయ్యె; నేఁ,
జేసినభాగ్య మెవ్వరును జేయ రయోరె! ఫలించెఁ గోరికల్. గీ.౭.

టీక.—వీసరవోని = తక్కువగానటువంటి. వీనుల విందుగన్ = చెవులపండువుగా. నవ్య...౦డ - నవ్య = నూతనమైన - రేఖా = సౌందర్యముగల - సుమకాండ = పుష్పబాణుఁడా (=మన్మథుఁడా).

ఉ. చందురునిన్, జయంతుని, వసంతునిఁ, గంతుని, నాదిగా జనుల్
కొందఱు మోహనాంగు లనుకో విని పోవుట కాక, చూడ లే
దెందును వారిరూప మది యెట్టిదయో? యిదె నిన్నుఁ గంటి నా
నందము గాఁగ. నేఁడు సుదినంబుగ నావదనంబు రంజిలెన్. గీ.౮.

టీక.—కంతునిన్ = మన్మథుని. మోహనాంగులు = సౌందర్యవంతులు. వదనంబు = ముఖము. రంజిలెన్ = ప్రసన్నమాయెను.

ఉ. తొల్లి మనంబులోఁ గలుగుతుందుడు కెల్లను బాసెఁ, గామినీ
హల్లకబాణ, యెంతపని కైన నిధానము నీవు గల్గ, నే
నల్లవిభుండు రాఁ డనిమహాపరితాపము నొంది యేల చిం
తిల్లఁగ? వెన్నఁ బెట్టుకొని నేతికి నేటికి నంగలార్పఁగన్? గీ.౯.

టీక.—కామినీ = వలపుగల్గెలపాలిటి - హల్లకబాణ = (హల్లక = ఎఱ్ఱగలువ. బాణ = బాణముగాఁగలవాఁడా, అనఁగా) మన్మథుఁడా. నిధానము = నిక్షేపము.

క. ననుఁ జూడరాఁ డ దేమో!
యని నిను దూఱకొనుచుందు ననయము; నాపై

నెనరు గలందుకు గుఱుతిదె
కనిపించెను; మనము వేడుకలు గనఁ గల్గెన్. ౬౦.

టీక.—దూరికొనుచుందును = నిందించుచుందును. అనయము = మిక్కిలి. నెనరు = ప్రేమ. మనము = మన స్సని యర్థము - ఉభయులము నని భావము.

ఉ. నాయపరంజిమేడ యొకనాఁడునుఁ జూడవుగా, యగోచరం
బా యురుమంజిము త్తియపు టన్నువసోరణగండ్లయంద, మా
చాయల కెంపుటోవరుల చందము, నా చలువ ల్దొలంకు రే
ఛాయల రా యరంగుల సరాగము, నా మణి కుడ్యభాగముల్. ౬౧.

టీక.—అపరంజి = బంగారు. ఉరుమంజి = పసుపునీరుకలిగినట్టి. అన్నువ = సూక్ష్మమైన - సోరణగండ్ల = గవాక్షములయొక్క. చాయల = కాంతులుగల-కెంపు= రత్నఖచితమైన - ఓవరుల చందము = కేళీగృహములయొక్క తీరు. రేరాయలరా= చంద్రకాంతమణులయొక్క - అరంగుల= తిన్నెలయొక్క - సరాగముక్ = బాగును. కుడ్య=గోడలయొక్క. అగోచరంబు = మూడఁదరము గానివి.

ఉ. అందు వినోదమార్గములు, నందు విశేషము, లందు హర్మ్య, లిం
పొందఁగఁ జూచి, మానికపు టోవరిలో సొగసు ల్నటింపఁగాఁ
గందము వక్కలాకులును గైకొని, వేడ్క నొకింత సేపు నీ
వందుల విశ్రమించి, చనుమా చను మానముతోడ.—నావుడున్. ౬౨.

టీక.—హర్మ్యలు = నాణెపుఁబనులు. అందులక్ = ఆకేళీగృహమందు. చను మానముతోడక్ = అతి ప్రీతితోడను.

చ. వెడనగ వంకురింపఁ బృథివీవరసూనుఁడు వల్కె నప్పు డ
ప్పడఁతుకతోడ.—'నా కిపుడు ప్రాణపదం బగుపావురంబు పైఁ
గడుఁ బొడ వేఁగి పెంటిఁ బొడగానక యిచ్చట వ్రాలె; దాని వెం
బడిఁ బడి రాజు లేనియెడ మాపినతల్లివి నీవు గావునన్, ౬౩.

టీక.—పృథివీ వర సూనుఁడు = భూ నాయక పుత్త్రుఁడైన సారంగధరుఁడు. వెడనగవు= చిఱునవ్వు. అంకురింపక్ = మొలకయెత్తఁగా. పడఁతుక = స్త్రీ.

చ. రవి శశి రశ్మికిక్ జొరఁగరాని భయానక మైన నీమణీ
భవనము వచ్చి సొచ్చి పదపంకజము ల్గని మ్రొక్కఁగంటి; నీ

దవుకరుణావిశేషమున నన్నియు నున్నవి; యేటి కమ్మ; పా
రువము నొసంగు; పోయెద సరోరుహాలోచన.' యన్న నవ్వుచున్.

టీక.—రవి = సూర్యునియొక్కయు - శశి=చంద్రునియొక్కయు - రశ్మికిఁ = కిరణమునకు. భయానకము = భయంకరము. భవనము = ఇంటిని. పదపంకజముల్ = అడుగుఁదామరలను. నీది = నీసంభంధమైనది. అవు = అయినట్టి. సరోరుహాలోచన = పద్మములవంటి నేత్రములుగల దానా.

క. 'పోయెదు గాకిపు డే మ'ని
యాయనచెయిపట్టి, వట్టియాసల నపు డా
గాయకపుజంత చెంతం
బాయకఁ దోడుకొని, మేడపయికిం జనియెన్. ౬౫.

టీక.—గాయకపుజంత = టక్కులధూర్తురాలు.

ఉ. 'పాయని మోహతాపమున భామిని యుండఁగ, నందుమీఁద నేఁ
డీయెడ హాని వచ్చునని యెంచక, నూరక పిట్టరేఁపుచే
నీయన కన్నుఁ గాన కిపు డిచ్చట వచ్చునె! యమ్మచెల్ల! యే
మో యిది కారణం!' బనుచు నూహలు సేయుచుఁ బ్రోడచేడియల్.

టీక.—భామిని = స్త్రీ (చిత్రాంగి). పిట్టరేఁపుచేఁ=పక్షి (పావురము) యొక్క విజృంభణముచేత. అమ్మచెల్ల = ఆశ్చర్యము. ప్రోడ చేడియల్ = ప్రౌఢలైన స్త్రీలు.

ఆ. తత్తఱింపఁ దొణఁగి, 'యిత్తఱి నిది యేమొ ?
నూటి గాదు, తలఁపఁ బాటి గాదు.
తగదు మాను మన్నఁ బగవార మగుదు మి
క్కటికిమనముపులినకటికి మనము. ౬౬.

టీక.—(ఈ) కటి ... టికిఁ - కటికి = క్రూరమయిన-మనము = మనస్సుగలదైన-(యీ) పులిన కటికిఁ = సైకతనితంబకు (అనఁగా ఇసుక తిన్నెలవంటి పిఱుందులు గలదైన చిత్రాంగికి). మనము = సకియలమైన మనము.

క. అటు గనుక నీమె చెప్పిన
యటువలె నియ్యకొని లియ్యమై యుండంగా,
నటుమీఁద దైవ గతి ' యని
యటు నిటు నడయాడుచుండి రా చెలు లంతన్. ౬౭

టీక.—ఇయ్యకొని = అంగీకరించి. లియ్యము = (ఈ మెతో) ఐక్యము.

సీ. నిశ్రేణి శోణమణిశ్రేణి కాంతులఁ
జరణాబ్జరాగంబు శిరము దన్న,
జాతరూప కవాట జాత రూప స్ఫూర్తి
నంగవల్లీ చ్ఛాయ యవలఁ ద్రోయ,
జాల మౌక్తిక వజ్ర జాల మంజుద్యుతిఁ,
గనుదోయి జిగి యోరగంటఁ జూడ,
నస్తంభ నీలమయ స్తంభ రుచితోడ
నెఱికొప్పుఁగప్పుడాలొరసికొనఁగ,
తే. నవ్విలాసిని యతిమనోహరము లైన
చవికెలరఁగులు పాకలు చప్పరములు
నాది యైన విశేషమ్ము లన్నియతని
కెచ్చరించుచు మేడపై కేఁగునపుడు. ౬౮.

టీక.—నిశ్రేణి = సోపానముల (యందుఁ జెక్కఁబడిన)- శోణమణి శ్రేణి కాంతులఁ = కెంపుల వరుసలయొక్క శోభలను, చరణ అబ్జ రాగంబు = పద్మములవంటి పాదముల యెఱుపు, శిరము దన్నఁ=తలను తన్నఁగా(అతిశయింపఁగా అనియు, మెట్లపై కాలుంచి యెక్కఁగా అనియు భావము); జాతరూప కవాట= బంగారు తల్పులవలన నుండి-జాత= పుట్టిన-రూప స్ఫూర్తిని=ఛాయా ప్రకాశమును, అంగ వల్లీ చ్ఛాయ= తీఁగె వంటి శరీరకాంతి, అవలఁద్రోయఁ=వెడలఁద్రోయఁగా; జాల = కిటికీల- మౌక్తిక= ముత్యములయొక్కయు - వజ్ర = వజ్రములయొక్కయు - జాల = సమూహము యొక్క-మంజుద్యుతిఁ= మనోహరమైన కాంతిని, కను దోయి జిగి = నేత్ర యుగళ కాంతి, ఓరకంటఁ=అపాంగదృష్టిచేత, చూడఁ; అ స్తంభ = అమందమైన- నీలమయ స్తంభ రుచితోడఁ = నీలవికారమైన స్తంభముయొక్క కాంతితో, నెఱికొప్పు కప్పు డాలు = గొప్పదైన కొప్పుయొక్క నల్లనికాంతి, ఒరసికొనఁగఁ; చవికెలు = బొడ్డుఁ జావిళ్లును. చప్పరములు = పందిళ్లును.

తే. చంద్రకాంత వితర్దికా సాంద్ర కాంతి
యింద్రనీల మయ స్తంభ రుంద్రదీప్తి

రెండుఁ బెనఁగొని యరు దొనరించె మదికి
గంగ యమునయుఁ గూడినభంగి మెఱసి. ౭౦.

టీక.—చంద్రకాంత - వితర్దికా = తిన్నెలయొక్క - సాంద్ర = దట్టమైన. ఇంద్ర నీలమయ = ఇంద్రనీలమణి వికారమైన - స్తంభ - సంద్ర = దట్టమైన - దీప్తి = కాంతియు. అరుదు ఒనరించెన్ = ఆశ్చర్యమును గలిగించెను.

ఉ. నాయక మైనకెంపుగమి నాటినచోటులు సాంధ్యరాగమున్
జేయఁగ, నింద్రనీలములచెక్కడపుంబనిచక్కి యంధకా
రాయిత మై వెలుంగ, మగరా లమరించినపట్లు వెన్నెలల్
గాయఁగ, మువ్వెలుంగులకుఁ గందువయో యన మించె నందులన్.

టీక.—నాయకమైన = శ్రేష్ఠమైన - కెంపు గమి = కెంపుల సమూహము, రాగమున్ = సంధ్యాకాలసంబంధమైన యెఱుపును. చక్కి = స్థలము. అంధకారాయితమై = చీకటివలె నొప్పుచున్నదై. మగరాలు=వజ్రములు. కందువయో=స్థానమో.

చ. పరిమళపేటు లారజపుఁబల్కులచిల్కలుఁ బారువంపుఁ బం
జరములుఁ దూఁగుటుయ్యెలలుఁ జప్పరమంచము లించుతావిపూ
సరములు ధూపవాసనలసంభ్రమముల్ గలకేళిరత్నమం
దిరముల నక్కుమారుని మణీమయవేదిక నిల్పి చెంగటన్. ౭౨.

టీక.—పరిమళపేటులు = గంధపుఁబెట్టెలును. ఆరజపు=సొగసుగల. చప్పర = పందిరిగల. ఇంచు = మనోహరమయిన. వేదికన్ = తిన్నెయందు.

ఉ. ఏకడఁ జూచినన్ రతుల కేఁకట తీరఁగ వ్రాసినట్టి కొ
క్కోకకళారహస్యములు గోప్యము లౌచవుసీతిబంధముల్
నాకపురీ విలాస కలనా గణికామణి కాము కాది నా
నాకృతులున్ విచిత్రగతు లచ్చట నచ్చపలాక్షి చూపుచున్. ౭౩.

టీక.—రతులకున్=క్రీడలకు. ఏఁకట = మిక్కుటమైనకోరిక. కొక్కోక కళా రహస్యములు= కొక్కోకునిచేఁజెప్పఁబడిన కళా మర్మములను. గోప్యము లౌ చవుసీతి బంధముల్ = రహస్యములైన యెనుబదినాలుగు విధములైన రతిబంధములను. నాక... తులన్ - నాకపురీ=స్వర్గపట్టణమందలి-విలాస కలనా=శృంగారచేష్టలుగల - గణికామణి= వేశ్యాశ్రేష్ఠలును-కాముక = విటుపురుషులును - ఆది= మొదలైన - నానా ఆకృతులున్= అనేక రూపములను. విచిత్రగతులు = అద్భుత మార్గములను.

ఉ. ఈ విటు లెస్స చూచితె, మహి న్నెఱజాణవు, వల్లవీకుచే
ష్టావిరతానురాగయుతుఁ డై తగ, నెయ్యపుటాలమందలో
నావగ లెల్ల నక్కలికి యారసి కైకొని యున్కి నో వయో
హావకళాభిరామ జలజాంబక కేళివినోదవైఖరిన్. ౭౮.

టీక.—ఈవు = నీవు - ఇటు=ఈదెసను - (ఈవిటున్ = ఈవిటకానిని - శ్రీ కృష్ణులవారిని అనుట), లెస్స, చూచితె = చూచితివా (చూడుము అనుట), (దేని ననఁగా), మహిన్ = భూమియందు, నెఱజాణవు=నీవు మిక్కిలి నేర్పరివి (ఈవిటుఁడు నెఱజాణ+అవును), వల్ల...డై—వల్లవీ = గోపికల యొక్క - కుచ = పాలిండ్లకు - ఇష్ట = అనుకూలమైన-అనురాగ = ప్రేమతో - యుతుఁ డై = కూడుకొన్నవాఁ డై, తగన్ = ఒప్పఁగా ; నెయ్యపుటాలమందలోన్ = ప్రియనుయిన యావుల మందలో, ఆవగలు ఎల్లన్=ఆవన్నె లన్నిటిని, అకలికి=ఆచెలువ (రాధయనుట), ఆరసి = కనిపట్టి, కైకొని = (ఆకృష్ణుని) చేపట్టి, ఓవ...బక—ఓ = ఓయి-వయః = యావనముచేతను-హావ = నేర్పుచేతను - అభిరామ = మనోహరుఁ డయిన - జలజాంబక = తామర పూబాణము కలవాఁడా (మన్మథుఁడా), కేళి వినోద వైఖరిన్=క్రీడా కౌతూహల ప్రకారమందు (ఓయి వయో హావ కళాభిరాముఁడా ఈవిటుని కైకొని యాకలికి కౌతూహల ప్రకారమందు), ఉనికిన్ = ఉండుటను, (లెస్స చూచితె ? అని యన్వయము).

క. ఒకఁ డూరు వ్రూనఁ, జెలి యం
దుకె జం కెనయంగఁ జూడఁ, దా మఱి కటిసీ
మకుఁ బెనఁగుచు, 'గ్రామో నా
స్తి కుత స్సీమా' యటంట సిద్ధం బయ్యెన్. ౭౯.

టీక.—ఒకఁడు = ఒకపురుషుఁడు, ఊరువు ఊనన్ = తొడను ముట్టఁగానే అని ప్రకృతార్థము-(ఊరు వ్రూనన్=గ్రామము వహింపఁగానె యని అర్థాంతరము). అందుకె= అంతమాత్రమునకె, చెలి=స్త్రీ, జంకు ఎనయఁగన్ = (వానికి) భయముకలుగునట్లుగా. తోన్ = వెంటనే (వాఁడు). మఱి = తిరుగ, కటిసీమకున్ = నితంబప్రదేశమునకు-అని ప్రకృతార్థము (సీమకున్ = పొలిమేర కని యర్థాంతరము), పెనఁగుడున్=కలహించుచుండఁగా, గ్రామో నాస్తి = గ్రామము లే దనఁగా, సీమా కుతః=పొలిమేర యెక్కడిది, అటంట = ఈ లాగున చెప్పుట. సిద్ధం బయ్యెన్ = నిజ మాయెను.

క. అనుచు విటీవిటసంఘము
కనఁబడ గోపాలుఁ జూపి కడు నేర్పుగ నా

డిన సరసవాక్యములు విని
వినములు చేసికొనఁ దెలియ విను మని పల్కెన్.— ౭౬.

టీక.—వినివినములు చేసికొనన్ = వినియు విననట్లు ఉండఁగా.

ఉ. 'అల్లన గాధిరాజసుతుఁ డర్మిలి మేనక ము ద్దొనర్ప రా
గిల్లి కుచంబు లాన గమకించుట గంటివె రాకుమార ?'—యా;
నల్ల నగాధిరాజసుతుఁ డర్మిలి మేనక ము ద్దొనర్ప రా
గిల్లి కుచంబు లాన గమకించుట భాగ్యము గాదె మానినీ.' ౭౭.

టీక.—అల్లనన్ = మెల్లగా. గాధిరాజసుతుఁడు = విశ్వామిత్రుఁడు. అర్మిలిన్ = ప్రేమచేత. మేనక = మేనక యను నప్సరస ఆనన్ = స్పృశించుటకు. గమకించుట = యత్నించుటను. (అల్ల) నగాధిరాజ సుతుఁడు=హిమవంతుని కుమారుఁడైన (యా) మైనాకుఁడు, మేనక = హిమవంతుని భార్యయైనమేనక. ఆనన్=త్రావుటకు.

మ. 'పలుసొక్కు ల్నిగుడన్, గళ ల్వెలయఁగాఁ, బైపైఁ జెమర్పన్ సము
త్కలికల్ పెంపు దగం, బెనంగి, యలసత్వం బొప్ప, సం దీక, విం
తలు గా నుండుటఁ గంటివా రతివినోదప్రౌఢి రాచూలి?' 'యాఁ;
దలిరుంబోఁడిరొ కంటి వా రతివినోదప్రౌఢిజె ట్లాఁ గదా.' ౭౮.

టీక.—కళల్ = కాంతులు. సముత్కలికల్ = వేడుకలు. సందు ఈక = ఎడఁబాయక. రతి వినోద ప్రౌఢిన్ = సురత వినోదమందు సమర్థతచేత. రాచూలి = రాజకుమారా. తలిరుంబోఁడిరో = చిగురువంటి మేనుగల యోచిత్రాంగీ. అతి వినోద ప్రౌఢి జెట్లు = మిక్కిలి వినోదమందు దిట్టతనముగల మల్లులు.

ఉ. 'నిక్కఁగఁ జూడు, చిత్ర మిది; నెమ్మది వేఁడుక నోలలాడు న
మ్మక్కలగుట్టు బట్టబయ లై గనిపింపఁగ, శౌరి పొన్నపై
నెక్కి రమించు చున్కి.' 'యవునే, మగువా, యిది చిత్ర మాట తా
నిక్కము, కృష్ణలీల గద నీ విపు డెన్నినమార్గ మంతయున్.' ౭౯.

టీక.—ఓలలాడు=జలక్రీడలుసేయుచున్న. గుట్టు = రహస్యప్రదేశము. మగువా= ఓతరుణీ.

క. అని యిటు లతఁ డా కామిని
యనువాక్యము లెల్ల వేఱె యర్థముగా నే
ర్పున విఱిచి మాట లాడిన,
మన సేమియు విఱుగ కపుడు మదవతి కణఁకన్. ౮౦.

క. పసిఁడికదంబము మంజుల । వసనకదంబము ననర్ఘ వరమణిభూషా
విసరంబులు విరినెత్తా । విసరంబులు దిగిచి వలపు వెలి విసరంగన్.

టీక.—పసిఁడి కదంబమున్ = బంగారుసమూహమును. మంజుల=మనోజ్ఞమైన - వసన = వస్త్ర. అనర్ఘ = వెలలేని. విసరంబులు = సమూహములు. విరి నెత్తావి = పువ్వుల కమ్మవాసనలుగల - సరంబులు=మాలికలును. వలపు = పరిమళము (మోహ మని యర్థాంతరము).

క. 'ఓయి నెఱజాణ, తలకొనఁ
జేయుము విరులివె, జవాది చెయిఁ బట్టుము, వా
లాయ మెదఁ జేర్పు కలపము,
కో.' యని యీఁగొనె మఱఁదు కో యని యార్చెన్. ౮౨.

టీక.—తలకొనఁ జేయుము= ధరింపుము (నిన్ను తలంచుకొనునట్లు చేయుము అని భా). చెయిఁ బట్టుము=చేత గ్రహింపుము (చెట్టఁ బట్టు మని భావము). కలపము = గంధమును. ఎదఁ జేర్పుము = ఱొమ్మునఁ బూయుము (ఱొమ్మున తన్నుఁ చేర్పు మని భావము). కో అని = తీసికొమ్ము అని (తన్ను గ్రహింపు మని భావము).

తే. 'మంచిమే లైన దిదిగొఁ గొ' మ్మంచుఁ గప్పు
రంబు సగపాలు నించి వీడెం బొసంగి,
'పూనుమీ మెయి భోగంబు భూషణంబు
లెసఁగ నీ' వని యొఱఁగ యొసఁగ రాఁగ. ౮౩.

టీక.—కొమ్మంచున్ - కొమ్మ+అంచున్ - అని పదవిభాగము,—కొమ్మ = కైకొనుమా (కొమ్మ = చెలువ - అనఁగా చిత్రాంగి నైన నేను అని యర్థాంతరము). సగపాలు=అగ్రభాగము. పూనుమీ - మెయిన్ = నీదేహమందు - అని యొక విభాగము. (పూనుము - ఈ మెయిన్ = ఈనాదేహమందు - అనియు). ఱాఁగ = గయాళి.

మ. అవి చే నంటె, చెనంటెఁ జూచి, యతఁ డిట్లన్ 'దల్లిదండ్రుల్ మనం
బు విరాజిల్లఁగఁ గూడఁ బెట్టినధనంబుల్ లోకమందున్ గొమా
ళ్లవి గా కెవ్వరి వమ్మ? కావలయువేళన్ వచ్చి కొంపోదు. నేఁ
డివి నీ పెట్టియ నాదు దాఁపురముగా నిం దుండ నిమ్మన్నయున్ ?

టీక.—చెనంటెన్=వల్పితురాలైన చిత్రాంగిని. ఇట్లు అన్=ఈరీతిగా పల్కెను. కొమాళ్లవి = పుత్త్రిలవి (గ్రామ్యము).

క. అని ప్రియము గడల్కొనఁ బ
ల్కిన, నెంతయు హావభావలీలాగతులన్
దనచతురోక్తులచే నా
యన మది మేకొలుప లేక వ్యాకులమతి యై. ౮౫.

టీక.—కడల్కొనన్ = అతిశయించునట్లు. హావ = శృంగారచేష్టయొక్కయు - భావ = మదనోదయముయొక్కయు - లీలా = విలాసముయొక్కయు - గతులన్ = నడవడులచేత. చతురోక్తులచేన్ = చదురుమాటలచేత. మేకొలుప లేక = అంగీకరింపఁ జేయ లేక. వ్యాకులమతి = కలంగిన బుద్ధికలది.

ఉ. ఆతరళాక్షి డెందమున నారట మొందుచు, 'నేమి సేయుదున్?
రాతికిఁ దోడు వోయినది రాసుతుఁ డెందము, మెత్త గాదు, ఢా
దాతికి వచ్చి యుండ నిఁకఁ దాళిమి చెల్లునె? మారుఁ డంటిమ్మా,
ఘాతకుఁ, డోర్వ రాదు. సముఖంబున నేటికి రాయబారముల్?' ౮౬.

టీక.—డెందమునన్ = హృదయమున. దాతికిన్=సమీపమునకు.

మ. అని యూహించుచు, లజ్జఁ బో విడిచి, యేకాంతంబుగా నద్దెస
గ్గనుచున్, బైఁట దొలంగ, నీవి వదలన్, గామాంధకారంబు నె
మ్మనమున్ గప్పినఁ, గన్ను గాన కపు డామత్తేభగంభీరగా
మిని యత్యంతనిరంకుశోద్ధతిని బల్మిన్ బట్టఁగాఁ జూచినన్. ౮౭.

టీక.—(ఆ) మత్త ఇభ గంభీర గామిని = మదించిన యేనుఁగువలె గంభీరముగా నడుచునదైన (యా) చిత్రాంగి, అత్యంత నిరంకుశ ఉద్ధతిన్ = మిక్కిలి అంకుశము (అడ్డు) లేని యౌద్ధత్యముచేత.

క. గడగడ పాపభయంబున
వడఁకుచు, నిది యేటిగొడవ వచ్చె నటంచున్,
వడి లేచి యతఁడు 'తల్లీ,
తడ వాయెను వచ్చి; పోయెదను నే.' ననుచున్.— ౮౮.

క. ని న్నెదు రెదురే సూడఁగ
నిన్నాళ్లకు సెలవు గాఁగ నిట వచ్చితి. నిం

క న్నీవు తిరిగి పోయెద
నన్నన్, నేఁ బోవ నిత్తునా నవమదనా ? ౮౯.

టీక.—నవ మదనా = నూతన మన్మథుఁ డైన సారంగధరా.

మ. అతిమోహంబున మించుతల్లి నిట నీ కాసించియున్నా ననా
రతసౌఖ్యోన్నతిఁ జెందఁ గోరి, సుకుమారా, రాసుతా, యాత్మజా
కృతి న న్వేఁడుకఁ దేల్పుమీ, తలఁపఁగా నేణీకిశోరాక్షి స
మ్మతి సారంగధరుండ వయ్యు నలయింపన్ జెల్లునే?' నావుడున్. ౯౦.

టీక.—అతిమోహంబునన్ = మిక్కిలి వలపుచేత. మించు తల్లిని = శ్రేష్ఠమైన మెఱుపువంటిదానను. అనారత = స్థిరమైన. సుకుమారా = కోమలుఁడా (సుందరుఁడా యనుట.) రా సుతా=రాజకుమారుఁడా. ఆత్మజ ఆకృతిన్ = మదన రూపముచేత. ఏణీ కిశోర అక్షిన్ = లేడి పిల్ల కన్నులవంటి కన్నులుగల దానిని నన్ను. సమ్మతి= ఇష్టమైన. సారంగ ధరుండవు = లేడిని ధరించిన చంద్రుఁడవు.

మ. 'అతిమోహంబున మించుతల్లి నిట నీ కాసించి యున్నా ననా
రతసౌఖ్యోన్నతిఁ జెందఁ గోరి, సుకుమారా రా సుతా యాత్మజా
కృతి నన్ వేఁడుకఁ దేల్పు' మంటివి; ధరిత్రిన్ సత్యవాణీ సర
స్వతి యన్వాక్య మ దేల తప్పు నిజమే వాక్రుచ్చినావి య్యెడన్. ౯౧.

టీక.—అతిమోహంబున మించు తల్లిని=మిక్కిలి ప్రేమచేత మించినటువంటి తల్లిని, సు కుమారా=మంచి పుత్త్రుఁడా. రా = రమ్ము. ఆత్మజ ఆకృతిన్ = పుత్త్రి రూపము చేత. ధరిత్రిన్ = భూమియందు. సత్యవాణీ సరస్వతీ అన్ = యథార్థవాక్కుగలది సరస్వతియే యనెడు. వాక్రుచ్చినావు = పల్కితివి.

మ. అని పోఁ, గుచ్చెలు వీడ, లేనకుము జవ్వాదన్, జగన్మోహన
స్తనగుచ్ఛంబులమీఁద హారములు నృత్యం బాడ, లోఁ ధాల్మి యూ
డని బాడన్, బులకాంకురంబు లొనఁగూడం, గట్టివాయింతి వే
చని యవ్వాకిటి కడ్డమై నిలిచి కాంక్షన్ బట్టఁగాఁ బోయినన్. ౯౨.

టీక.—గుచ్ఛంబుల = గుత్తుల. గట్టివాయింతి = గయ్యాళి.

ఉ. 'అంటకుమీ లతాంగి, నను;' 'నంటిన నేమి మనోహరాంగ?' నే
నంటు పడంగ లే దనుచు నంటెదఁ గాని;' 'యు టంటు గాదు; న

న్నంటఁగఁ జెల్లునే జనకు నంటినపిమ్మట?' 'నంటి వైన, నీ
యంటుస నంటు గామి నెటు లంటును గెంటక మేనఁ బ్రాణముల్ ?

టీక.—అంటు పడంగ లేదనుచు నంటెదఁ గాని= నే నంటుడప లే దని యంటు చున్నాను - అనఁగా పుష్పిణిని కాలే దనుట. నీయంటునన్=నీసంబంధముచేత. అంటు కామిన్ = సంబంధ పడక పోవుట చేత. గెంటక = పోకుండ.

క. మే లాఱడి వెట్టంగా
మేలా? నిలు పోప లేఁ జుమీ. చల మేలా?
మేలావరసుత, తామస
మేలా? రమియింపు.' మనుచు మీఁదన్ బడినన్. ౯౪.

టీక.—మేలు = ప్రీతిని. ఆఱడి వెట్టంగాన్ = వ్యర్థము చేయఁగా. చలము = మాత్సర్యము. మేలా (మా+ఇలా) వరసుత = మన్మథా. తామసము = ఆలస్యము.

తే. 'హా! మహాదేవ!' యని చెవు లంటి కేల,
వడిఁ గడకుఁ బోవ; నప్పు డవ్వని తరణిత
మణిగణోజ్జ్వలకంకణక్వణన మొలయఁ
బట్టుదుప్పటి చేఁ జుట్టి పట్టుకొనియె. ౯౫.

టీక.—రణిత = ధ్వనిచేయుచున్న - మణి గణ = రత్న సమూహములచేత - ఉజ్జ్వల = ప్రకాశించుచున్న - కంకణ = కడియములయొక్క - క్వణనము = శబ్దము.

క. పట్టి చలపట్టి యా రా
పట్టిని గూర్చుండఁ బెట్టి పకపక నగి—'యీ
కట్టిఁడి యగుమరునకు ననుఁ
గట్టిడి యొప్పించి యెందుఁ గదలెద వింకన్? ౯౬.

టీక.—కట్టిఁడి = కఠినుఁడు. మరునకున్ = మన్మథునకు.

సీ. చూపుకన్నెఱకంబు వాప మే, నది మెచ్చి
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొనఁగ వలదె ?
చెవులలో నమృతంబుఁ జిలుక నో ర, ది మెచ్చి
తీయవాతెఱ విందు చేయవలదె ?
బుగబుగ వాసనల్ నిగుడంగఁ గెమ్మోవి,
యది మెచ్చి మోము ము ద్దాడ వలదె ?

యల్లంబుఁ గలఁపఁగా నొయ్యారఁ, మది మెచ్చి
పొసఁగ దానికి నీవి యొసఁగ వలదె ?.

తే. రమ్ము, సారంగధర, వేఁగిరమ్ము మాని,
కలవరమ్ముల నణకించుగళరవమ్ము
నాదు మొలనూలి గంటల నాదు వినక
చంట నీయుర మానక చంట దగునె?'— ౯౭.

టీక.—ఈ పద్యమందు-మేను, అమృతము, సోరు, కెమ్మోవి, ఒయ్యారంబును-సారంగధరునివి ; చూపు, కౌఁగిలి, చెవులు, వాతెఱ, మోము, ఉల్లంబును - చిత్రాంగివి. అమృతంబుఁ=అమృతోపమమైన మాటలను. నీవి=పోఁకముడిని (లిబ్బిని అని య ). కలర వమ్ములఁ = పావురములను. అణకించు = అపహసించునట్టి (తగ్గ చేయు నటువంటి). గళరవమ్ము = కంఠధ్వని (మణిత మనుట). నాదు = ధ్వనిని. చంటఁ = కుచములతో. నీయురము = నీవక్షఃస్థలమును. చంట = పోవుట.

మ. అనినం గాలినశూలము ల్చెవులలో నంటించినట్లైన, నూ
నిన పెందిమ్మున సొమ్మసిల్లి, మగుడన్ వే తేరి, య మ్మంత్రినం
దనువాక్యమ్ములు నిక్కమయ్యె నని విన్నంబోయి, కన్నీళ్లు గా
ఱ నునుంజెక్కుల, వాతెఱం దడుపుచుఁ రాచూలి లోఁ జాలిగన్.

టీక —మగుడన్=తిరుగ. నిక్కము=నిజము. లోన్=మనసులో. జాలి=భేదము.

తే. ఫలుకు పులుకునఁ జూచి యక్కలికితోడఁ
బలుకుపలుకున దైన్యంబు దొలఁకఁ బలికె:—
'ననుఁ బెనుప నోవుపినతల్లి వనుచు నమ్మి
చెల్లఁబో యిటు వచ్చిన దెల్లఁ గలిగె. ౯౯.

టీక.—పులుకు పులుకునన్ = భయదృష్టిచేత. చెల్లఁబో = ఆశ్చర్యము.

చ. మదిఁ దలఁపన్ వినం దగనిమాటలు నోరెటు లాడెఁ జెప్పఁగా ?
నెదిరి మనంబులోఁ దెలుఁగ కేమిటి కీవలవంతఁ దల్లడిం
చెదు మది వావిఁ బో విడిచి ? చెల్లరె ! తల్లియు దైవ మంచుఁ గో
విదులన విందు, నాకు వినవే పరభావములు దోడఁబుట్టువుల్. ౧౦౧.

టీక.—వల వంతన్=మదన వ్యథచేత. చెల్లరె=ఆశ్చర్యము. కోవిదులు=పెద్దలు.

మ వల దమ్మా, యిటువంటి కానిపని యోవామాక్షి ; యీ నెట్టిబు
ద్ధులు నీ కేల ఘటిల్లె నమ్మ? తెగువన్ దుర్భాష లిట్లాడి యీ
కొల నా కేటికిఁ గట్టె దమ్మ? మఱి లోకుల్ విన్న నే మందు ర
మ్మ? లఘుత్వంబుగఁ జూతురమ్మ. తగ దమ్మా. ధర్మ మూహింపుమా.

టీక.—ఓవామాక్షి = ఓసుందరనేత్రా. ఈకొలన్ = ఈపాపమును.

క. తమతల్లి పురంధ్రీ జా
త మతల్లి గదా. దదీయ తనుజుఁడ నఁట. హా!
రమణీ, యేతటి నైనను
రమణీయే తరగుణంబు రా నేర్చునొకో? ౧౦౨.

టీక.—తమతల్లి = మాతల్లి, పురంధ్రీ జాతమతల్లి = కుటుంబినీ సమూహములో ప్రశస్తురాలు. తదీయ తనుజుఁడను=ఆమెయొక్క కుమారుఁడను. రమణీయ ఇతరగుణంబు =మనోజ్ఞము కానటువంటి గుణము.

తే. ఈతలఁపు నుజ్జగింపు భూమీశునాన.
యింకఁ బదివేలు నేల? నా హృదయ శుద్ధి
యొరు లెఱుంగరు; మదనారి యొకఁడె గాక.'
యనుచుఁ దర్జనిఁ జూపి యయ్యనఘుఁ డనిన. ౧౦౩.

టీక.—మదనారి = శివుఁడు. తర్జనిన్ = జుత్తైన వ్రేలిని.

శా. ఆనీలాలక లేఁతన వ్వొలయ నిట్లన్ గ్రమ్మఱన్ 'నిన్ జగం
బా నా మే లన నీవ తెల్పుకొన నేలా నీగుణంబుల్? సతీ
సూనుగ్రామణి వౌదు. నీహృదయ మిచ్చోఁ గంటి. నేదేవతం
గా నే నీపినతల్లిఁ గాను; విభుభోగ స్త్రీని భావింపఁగన్. ౧౦౪.

టీక.—ఇట్లు అన్ = ఇట్లు అనును. సతీ సూను గ్రామణివి = పతివ్రతా స్త్రీల కుమారులలోపల శ్రేష్ఠుఁడవు.

క. భావజునిబారిఁ బడుచో
వావిఁ దలఁప నేల? ధర్మవర్తన మేలా?
నీ వింత యేల పెనఁగెదు?
నే-విడ, నాకన్ను లాన నినుఁ గూడక కిఁకన్. ౧౦౫.

టీక.—భావజుని బారిన్ = మన్మథుని హింసయందు.

తే. తక్కునుడువులు విడువుము. పెక్కు లేల?
నొకగడియమాత్ర మిటు గూడి యున్నఁ జాలు?'
ననుచుఁ గదియంగఁ దలుపు మూయంగఁ దివురు
నాకలికితోడ ధీరత నాతఁ డనియె.— ౧౦౬.

టీక.—కదియంగన్ = పొందుటకు.

చ. 'వడి నరపాలుభోగసతి. వాపులు నాకుఁ బ నేమి?' యంటి. 'వం
గడమున కెల్ల సాడ్డ' నినఁ, 'గా దటు; నే నలచిన్ననాఁడ వే
ర్పడితి.' న టన్నఁ బోవునె స్వభావము? తల్లివి నాకు, నేక్రియం
బడఁతుక నీవు? వావి చెడ మందు మహింగల దమ్మ యెందులన్? ౧౦౭.

టీక.—వంగడమునకున్ = వంశమునకు. పడఁతుక=ఓ చెలువా.

క. వల దిటువలెఁ గక్కుఱితి
పలుకులు పలుకంగ. నింత పదరం దగునే?
తలపోసి చూడు లెస్సగఁ
నెలఁతా, రత్నాంగి యొకటి నీ వొక్కటియే? ౧౦౮.

క. కాయములుఁ గోమిరె, తిమిరపుఁ
బ్రాయములుఁ దలంప నస్థిరంబులు. వీనిన్
స్థాయిగ నమ్మి యకృత్యము
సేయఁగఁ బూనెదవు; మీఁది సిలుఁ గెఱుఁగవుగా. ౧౦౯.

టీక.—కోమిరె = ఓసమారీ (చిత్రాంగీ). కాయములున్ = శరీరములును. తిమిరపుఁబ్రాయములున్ = మదముగల వయస్సులును. సిలుఁగు = ఆపదను.

ఆ. ఇపుడు ధైర్య మూని యినుమంత పుష్పకో
దండధరునిబాధ తాళ లేవు.
పాప మెంచి మీఁదఁ బటుగార్లఁ బట్టించు
దండధరునిబాధ తాళఁ గలవె? ౧౧౦.

టీక.—పుష్ప కోదండ ధరుని=పూ విలు దాలుపు. దండ ధరుని = యముని.

మ. ఖరభానుప్రియసూనుఁ డిప్పుడు నినుం గారించునే కా. విభుం
డటచేలోఁపలినిమ్మపంటివలె నత్యాసక్తి మన్నింప, సౌ
ఖ్యరసైకస్థితి నుండి కావరమునన్ గన్గాన కాపత్పరం
పర రాఁ ద్రుళ్లెద వేలయో! విధిఁ దరింపన్ నీతరంబే మహిన్ ?

టీక.—ఖరభానుప్రియసూనుఁడు = వేఁడివెలుఁగు గాదిలి సుతుఁడు (యముఁడు.) గారించునే కా = బాధపెట్టును గదా. విధిన్ తరింపన్ = బ్రహ్మనియతిని దాఁటుటకు.

చ. అనవుడు, నవ్విశాలతరళాక్షి కటాక్షములందు నంకురిం
చినకినుకన్ బటాబయలు సేయక నవ్వుముసుంగు వైచి, యి
ట్లను నతనిం గనుంగొని యనంగునిమామవెలుంగుసానఁ దీ
రినకలవాఁడితూపుఁ గికురించిన యోరమిటారిచూపునన్. ౧౧౭.

టీక.—తరళ = చంచలములయిన. కినుకన్ = కోపమును. బటాబయలు = వెలుపలికి స్పష్టము. అనంగుని మామ వెలుంగు సానన్ = చంద్ర కాంతియను సానయందు, తీరిన కలవాఁడి తూపున్ = చికిలియైన యతి తీక్ష్ణమైన బాణమును. కికురించిన = వంచించిన. ఓర మిటారి చూపునన్ = వాలిన మదముగల దృష్టిచేత.

ఉ. ఎన్నఁడు నేర్చినాఁడవు ర యీ మటుమాయపుమాట లీవు ? నా
కిన్ని దలంప నేమిటికి ? నిప్పుడు దోసము పెద్ద చేసి, యీ
దున్నవయాళికానిఁ గడు దొడ్డఁగఁ జెప్పి, భయంబు నూపి, చ
క్కన్నను దుద్దు వెట్టి, యెలుకంగఁ దలంచెదు; మాను మీవగల్.

టీక.—ఆ దున్న వయాళికానిన్ = మహిష వాహనుఁడైన (యీ) యముని. కడున్ దొడ్డగన్ = మిక్కిలి గొప్పగా. చక్కన్ = చక్కఁగా, ననున్ = నన్ను (చక్కన్నన్ = మన్మథుని - అనియేని). దుద్దు పెట్టి=మోసము చేసి.

తే. నినుఁ గలయుభర్త కోపగాఁ డనఁగ నేల ?
కోల బుజమున నిడి దున్నఁ దోలువాఁడు
అవ్వ యన నేల ? రా జౌనొ, రడ్డి యౌను ?
నాఁటి కివు డేమి ? రారాదె ? యేటి కలఁప ? ౧౧౮.

టీక.—కోల...వాఁడు = సేద్యగాఁడు. అవ్వ = కలహము. రడ్డి = రెడ్డి. అలఁపన్ = శ్రమపెట్టుట.

క. ఇక్కల్ల దెలిసి విభుఁ డిం
కొక్కప్పుడు సేయుఘాతేత కొప్పితిఁ ; బని లే.
దెక్కడితగ వెక్కడికొల ?
యెక్కడివా వేల ? కొమ్మ లెవ్వారి సొమ్ముల్ ? ౧౧౫.

టీక.—వావి+ఏల. కొమ్మలు=స్త్రీలు.

తే. వలచి పట్టినఁ దాలిమి వదల కిప్పు
డెన్ని చెప్పెదు తగవు లీ వేకతమున !
మొనసి యూరకె రతిరంగమునకు రాని
సుద్దు లివి యేల ? చాలింపు సుగుణి వాడు. ౧౧౬.

టీక.—తాలిమి = ఓర్పు. ఏకతమునన్ = ఏకాంతమున. మొనసి = ఉద్యోగించి. రతి రంగమునకు రాని = అప్రయోజక మైన (సురత క్రీడా ప్రదేశమునకు రానట్టి). సుద్దులు = మాటలు.

క. వలవదు గా రతి మరునకు ?
వలవదు గా రంభ యక్షవరసూనునకున్ ?
వలవ దురాశలఁ బెట్టఁగ
వలవదు రా; వట్టిజోలి వార్తలు విడుమీ. ౧౧౭.

టీక.—వలవదు గా = మోహింప లేదా. వలవన్ = మోహింపఁగా.

సీ. దారువన స్త్రీలఁ దగిలెఁ గాని, య దేమొ ?
శివలె ముక్కంటి నేరఁ డయ్యె ;
గారాబుఁగూఁతునే గవిసెఁ గాని, య దేమొ ?
నీవలెఁ బరమేష్ఠిఁ నేరఁ డయ్యె;
నలయహల్యాకాంత నంటెఁ గాని, య దేమొ ?
నీవలె జంభారి నేరఁ డయ్యె;
గురునియిల్లాలితోఁ గూడెఁ గాని, య దేమొ ?
నీవలె నుడురాజు నేరఁ డయ్యె ;

తే. వారికంటెను హెచ్చైనవాఁడ వౌర !
నీకుఁ గలబుద్ధి వారికి లేకపోయె;

నీవు నాఁటికి లేక పోయితివి గాక,
చేరి వారలయోజలు చెఱుప లేవె?— ౧౧౮.

టీక.—దారు వన స్త్రీలన్ = దారుకావనమం దున్న మునిపత్నులను. ముక్కంటి = శివుఁడు. పరమేష్ఠి = బ్రహ్మ. జంభారి = దేవేంద్రుఁడు. ఉడురాజు = చంద్రుఁడు. ఓజలు = బుద్ధులు.

ఉ. నావుడు, ని ట్లనున్ సుజననాయకుఁ— డీ వెడమాట లేల? త
ల్లీ, వినవమ్మ. యీజగము లెల్ల సృజింప భరింప నొంపఁ జా
ల్దేవత లెట్లు వర్తిలిన లె స్సవుఁ గా కివి చెల్ల వేరికిన్;
నీ విపు డెన్నురంభ రతి నీవలెఁ బుత్త్రిలఁ బల్కఁ బట్టిరే? ౧౧౯.

టీక.—సుజన నాయకుఁడు = సజ్జన శ్రేష్ఠుఁడైన సారంగధరుఁడు. వెడ=వ్యర్థమైన. నొంపన్ = పొలియించుటకును. చాలు = సమర్థులైన. లెస్స + అవున్.

క. మన నేరవు; పతిమతి రాఁ
గన నేరవు సుదతి; తగవు గా దన్న, నహా!
యన నేర; వెంత సెప్పిన
విన నేరవు. చాలుఁ జాలు, విడు, పోవలయున్.— ౧౨౦.

క. అని పల్కునతనితాల్మికి
మనమున నెఱి విఱిగి, చాల మఱియును, గలిఁ బో
సినవెనుక నుట్లకడఁ జూ
చినగతి నను నతివ. యాస చెడ్డది గాదే? ౧౨౧.

టీక.—నెఱి విఱిగి = ఉత్సాహము భంగపడి. కలిన్ బోసినవెనుకన్ ఉట్లకడన్ చూచినగతిన్ = భోజనము చేయునపుడు అన్నములో పుల్లనీళ్లను పోసిన పిమ్మట పెరుఁగు కోసము ఉట్లను చూచినట్టుగా. అతివ = (ఆ) స్త్రీ.

క. ఊా నైనఁ గరఁగు నే నిపు
డీ యాడినమాటలకు; నో కింతఁ గరఁగ, వే
మోయి, యిది నీకు మంచిదొ
కో? యీఁడుది యుసురు మన్నఁ గొఱ గాదు సుమీ. ౧౨౨.

టీక.—కొఱ గాదు = మంచిది గాదు.

చ. కలికి పిసాళి వాలుఁ దెలిగన్నులపై నిడనేల కెంపు? నా
పలుచనిమోవి కెంజివురుపై నిడరా నెఱజాణ; నాయెదన్
నిలుపఁగ నేల గోళ్లు? బలునిబ్బర పబ్బుర పుబ్బు గబ్బి గు
బ్బలపయి నిల్ప రా, సుగుణ; పైపయి రేఁపకు కోపతాపముల్.

టీక.—కెంపు = రక్తిమయు - దంతక్షతమును. కలికి...కెంపు = కన్నులను కోపముచే నెఱ్ఱచేసికొన నేల యని భావము. ఇడరా = ఉంపరా. గోళ్లు = గోడులు = దుఃఖములను (గోళ్లు = గోరులు = నఖములను.)

ఉ. వే దన మించునీవిరహవేదన తాళఁగఁ జాలఁ. గంతునిన్
సా దన రాదుగా, తనదుసాదన చూపఁ దొడంగె. గాడ్పు దా
నీఁ దన వచ్చునే? మొదల నీ దనలాకృతి వేఁడి సూపుచున్.
బో దనఁ జెల్లునా? కడకుఁ బో దనయంబు శుకంబు ప్రేలుచున్.

టీక.—వేదు అనన్ = వెట్టి యనునట్లుగా. సాదు = శాంతుఁడు. సాదన = సామును. ఈఁదు = చలి. అనల ఆకృతిన్ = నిప్పువలె. బోదు అనన్ చెల్లునా = పెంపుడని చెప్పఁ దగునా. అనయంబు = ఎల్లప్పుడు.

సీ. లతకూన యని తగుల్తిఁ దలంపఁడు గదా
వేఁడితావులఁ జల్లి వేఁచుఁ గాని,
జలజగంధి యటంచు సంభ్రమింపఁడు గదా
చుఱుకుసోఁకుల మీఁద సుడియుఁ గాని,
చిలుకలకొలికి యంచలమి పైకొనఁడు గా
చిగురుటాకుఁగటారిఁ జిమ్ముఁ గాని,
కలువకంటి యటంచు నలరఁ జేయఁడు గదా
యుడుకువెన్నెల గాయఁ దొడఁగుఁ గాని,
తే. మధుఁడు, సారంగధరుఁడు, మన్మథుఁడు, విధుఁడు,
వసులపాతర లై నీరు నుసుల నీయ,
రెటుల నిటు దాళఁ గల దని యెఱుఁగ వైతి,
కటకటా! నీకు దయ లేదు గా యొకింత. ౧౨౭.

టీక.—గీతపాదములలోని మధు సారంగధర మన్మథ విధులు వరుసగా సీసపాదములందు కర్తలు. లతకూన=(ఈ చిత్రాంగి) లేఁత తీఁగవంటిది. తగులు = స్నేహమును (తీఁగ తగులు కొనుటను అనియు భా.) జలజ = పద్మ. సంభ్రమిరపఁడు = సంతోషింపఁడు (పద్మగంధమును బోలెఁ ఎత్తుకొని త్రిప్పఁడు). సోఁకులకు = స్పర్శలను. అలమి= వ్యాపించి. పైకొనఁడు = మీఁదికిఁ రాఁడు (వాహనముగా నెక్కఁడు). అలరక = సంతోషించునట్లు (వికసించునట్లు). మధుఁడు = వసంతుఁడు. సారంగధరుఁడు = వాయువు. విధుఁడు=చంద్రుఁడు. వసులపాతరలు ఐ - వసు లనఁగా తాళవృక్షాదులను చీల్చుటకు సాధనమైన యినుపమేకులు - వానికి స్థానములై. నుసుల నీయరు = మేదల నీయరు.

తే. దిమ్మరి గదా సదాగతి, తెలిసి చూడ,
మెఱియఁడు గదా యనంగుఁ డేతఱి, మఱి మడి
యఁడు గద్దా యల్ల జైవాతృకుఁడు దలంప,
నిట్టిచెడుగులచే బాధ నెట్టు లోర్తు? ౧౭౨.

టీక.—సదాగతి = (సర్వదా సంచారము కలవాఁడు అనఁగా). వాయువు. దిమ్మరి = సంచరించువాఁడు (తిరుగఁబోతు అని యర్థాంతరము). అనంగుఁడు = (దేహము లేనివాఁడు-అనఁగా) మన్మథుఁడు. మెఱియఁడు=ప్రకాశింపఁడు - అగపడఁడు అనుట. ఈయర్థమున మెఱయఁడు అనుటకు మెఱియఁడు అని గ్రామ్యము. (చలింపనివాఁడు అనఁగా హింసించుటకు సంకోచింపనివాఁడనియు అర్థాంతరము). అల్ల జైవాతృకుఁడు=ఆ చంద్రుఁడు (ఆయుష్మంతుఁ డని యర్థాంతరము). మడియఁడు=నశింపఁడు (మడ్డివాఁ డని యర్థాంతరము).

క. రారాపు లేల సేసెదు? । రారా; ననుఁ జలువ కలువరా రా మేడన్
'రా రా' యని తలిరాకుజ । రా రాయని కేళి నేలరా రాకోమరా.

టీక.—రారాపులు = ఒరయికలను. చలువ కలువరా రా మేడన్ = శీతలమైన చంద్రకాంత శిలామయమైన యుప్పరిగయందు. రా రా అని = రమ్ము రమ్ము అని. తలిరాకు జిరా రాయని=చిగురుటాకు కవచముగల వానియొక్క - అనఁగా మన్మథుని యొక్క.

మ. పరిరంభం బొనరింపరా, కరుణ నాపై నింపరా, యాలకిం
పర, యేరా? యధరామృతం బొసఁగి నన్ మన్నింపరా, యుంచు దై
న్యరసం బుప్పతిలి న్నెలంత పలవంతం గుల్కులం జిల్కు పాం
డర గండ చ్యుత బాష్పధారఁ గొనగోటన్ మీటుచున్ బల్కుచున్.

టీక.—పరిరంభంబు = ఆలింగనము. ఏరా = ఏమిరా. వలవంతకన్ = మదన వ్యథచేత. పాండర = తెల్లనైన. గండ = చెక్కిళ్లపై. చ్యుత = జారిన.

చ. విని విన నెల్ల కావలికి వేత్రపతాకునకుం జూచి జూడ్కు డే
మను నెటు వచ్చునో యని భయంబున నోరకు మెదల్పకుం, దెవ్విధం
బున నది యూడ వేసికొని పోదు నటంచు నుపాయ మెంచు, న
మ్మనుజవరాగ్రగణ్యు సుకుమారుడు లోభియుఁ బోతె నత్యుకేన్.

క. ఇట్టటు చూచి యాచెలిఁ । బట్టిన వలరాచ గబ్బి బలుబూతంబున్
నెట్టుకొని వీడఁ జేయఁగ । గట్టిగ మాటలవశంబు గాదనీ పోగన్.

టీక.—వలరాచ గబ్బి బలు బూతంబున్ = మన్మథుఁ డనెడు దృఢమైన గొప్ప దయ్యమును. నెట్టుకొని = ఎదిరించి.

తే. అపుడు గురుభామ చిత్రాంగి యతులమి బలిమి
నొడిసి పట్టిన పైకోక విడిచి చనియెఁ,
దా నవీనకళానిధి యై నెగడిన
యట్టి సారంగధరుఁ డయ్యె నబ్బురంబు! ౧౩౧.

టీక.—గురు భామ = తండ్రి భార్య (తార యని యర్థాంతరము). నవీనకళానిధి = నూతమైన (బాలుఁ డనియు భా.) విద్యానిధి (తేజోనిధి యని యర్థాంతరము). సారంగధరుఁడు = ఆపేరి యారాజకుమారుఁడు. (చంద్రుఁ డని యర్థాంతరము). అబ్బురంబు = ఆశ్చర్యము (తన్ను పైకొన్న తారను చంద్రుఁడు విడిచిపెట్టి పోవుట ఆశ్చర్యము కదా).

తే. సాము సేసినగతి, దట్టిచల్లడముల
తో వెడలె స్త్రీకి లోఁగాక దేవుఁ డనఁగ;
నీరు పైకొని వచ్చిన నేరి కైన
కోక యనుబుద్ధి గల్గునే లోకమునను? ౧౩౨.

టీక.—నీరు...గల్గునే = నీట మునిఁగి పోవుచున్నవాఁడు వస్త్రము వీడి కొట్టుకొని పోయిన దని చింతించునా – చింతింపఁ డనుట.

క. వేగ పులిచేతఁ దడఁబడి। యేఁగెడుగతి నట్టు లేఁగ, నెంతయు మది యా
లోఁ గామిని తన కాతఁడు। లోఁగామిని వంత జింతిలుచు నిట్టనియెన్.—

టీక.—ఆలోన్ = అంతలో. లోఁగామిన్ = స్వాధీనుఁడు కానందున.

క. ఎటువంటి సుగుణి వయ్యో!
యిటువంటిదె రసికముద్ర! యేఁగెదు పైదు
ప్పటి విడిచి! నేర్పు చెలి నేఁ
చుకొను? మఱి నీయంగ మెల్లఁ జూపితివి గదా. ౧౩౪.

టీక.—రసికముద్ర = సరసలాంఛనము.

క. ఆరోపింతును నాపై
నేరము విపరీతముగను నీపై; రాగా;
యూరకె యిఁకైన రాజకు
మారక, నామాట వినుట మంచిది సుమ్మీ. ౧౩౫.

శా. ఔనా! పోయెదవా ననుం గలఁచి? యేలా యింక నీతోడ? నెం
తే నేమింపఁగ నాడఁ జిక్కె నిదిగో నీయంగమచ్చంబు నా
చే; నీలోనన రాజు రావలెఁ గదా; చెక్కెంతు నీ కీలు కీల్.
గానీ, యిందుల కేమి? తాళు? మని కేల్గ బ్రొమ్ము తాటించుచున్.

టీక.—నాచేన్ = నాచేత. అంగమచ్చంబు = ఆనవాలు. ఎంతేన్=మిక్కిలి.
నేమింపఁగ నాడన్ = నిశ్చయించి చెప్పుటకు.

క. సారెఁ బగ చాటి పలుకం
గా, రిచ్చలు విటిగి, పోవఁ గా ల్లాడక, యా
భూరమణసుతుఁడు సద్గుణ
హారుం డటు నిలిచి యిట్టు లనుఁ బటుబుద్ధిన్.— ౧౩౭.

టీక.—రిచ్చలు విటిగి=విస్మయము లడఁగి. సత్ గుణ హారుండు=మంచి గుణమే
హారముముగాఁ గలవాఁడు.

క. తల్లీ, నాపై నీకుం
జెల్లునె కోపంబు? మదన శిత శర పాళీ
హల్లీసక నిహతి వ్యథఁ
దల్లడపడి పట్టిదూఱు తగవా పూన్న ? ౧౩౮.

టీక.—మదన = మన్మథునియొక్క - శిత = తీక్ష్ణమైన - శర పాళీ = బాణ

సమూహముయొక్క - హల్లీసక = నటనముయొక్క - నిహతిఁ = కొట్టుటచేతనైన- వ్యథఁ = బాధచేత. దూఱు = నింద.

మ. ఇపు డీ వాఁడుభయంకరోక్తులకుఁ గా నే లోఁగి, దుర్వృత్తి న
ల్పపుసౌఖ్యం బగునీమనోరథము దీర్పం బూనినన్, లోకమం
దపకీర్తిం బడి, మీఁదఁ ద్రెళ్లి, యమబాధన్ నిక్కముం జెంది, హీ
నపుయోనిం దుదిఁ బుట్టఁగా వలయుఁ గాంతా, పెక్కువేలేం డ్లిలన్.

తే. అ ట్లగుటకంటె నీకె వినవమ్మ యొకటి,
జగతిలోఁ గీర్తి వెలయఁగాఁ దెగువ మీఱ
నీకు రాజున కింపు సంధిల్లుచేత
కియ్యకొని యుండ నటుమీఁద నీశ్వరాజ్ఞ. ౧౮౦.

టీక.—ఇయ్యకొని = ఒప్పుకొని.

ఉ. కావక రాజు చిత్తము వకావక లై తెగఁ జూచునట్లు లా
హా! విపరీత మైనపలు కాడెద నంటివి. మున్ 'వినాశకా
లే విపరీతబుద్ధి' యని లెస్స బయల్పడఁ జెప్పినారె కా.
నీవిధి యీఁడుమీఁ యనఁగ నీవిధి నాడెదు సుమ్ము భామినీ. ౧౮౧.

టీక.—కావక = ప్రోవక. వకావకలు = చిందఱవందఱ. నీవిధి = నీప్రారబ్ధ ము. ఈవిధిన్ = ఈప్రకారముగా.

క. నీకపటోక్తుల పట్టి మ
హీకాంతుం డలిగెనేని, యీధారుణి యె
య్యాకాశవాణి యెఱుఁగరె?
నీ కాకోల తోఁదుతోఁడనే సిద్ధించున్.— ౧౮౨.

తే. అని పలికి, పోయి వచ్చెద ననుచుఁ జక్కఁ
దననగరి కేఁగి యుపరాజు తగినరీతి
దొరల భృత్యుల సఖుల నందొఱను బనిచి
తుందుడుకు డెందమునఁ జాల సందడింప.— ౧౮౩.

టీక.—డెందమునన్ = మనస్సునందు. తుందుడుకు = కలఁత.

సీ. పట్టు పాఱు మటంచుఁ బారావతంబును
వెకలినై నే నేల విడువఁ బోతి?
విడువమా యిన్నాళు విడిచిన నది పోయి
యేటికిఁ జిత్రాంగియింట వ్రాలె?
వ్రాలిన నది యట్లె వఱదఁ బో ని మ్మని
యూరక యేమిటి కుండ నైతిఁ?
జనవుమై నుండక పినతల్లి యని పోవఁ
జెడుగుణం బామెకుఁ బొడమ నేల?
తే. పొడమెఁ బో, యిది బుద్ధి గా దుడుగు మనినఁ,
మాన కిటువలెఁ జెల్లునే మచ్చరింపఁ!
గారణం బన్నిటికి నల్లపారువమె క
దా! య దెక్కడఁ దాఁపుర మాయెఁ దనకు! ౧౪౪.

టీక.—వెకలినై = వెఱ్ఱినై. చనవుమెౕ = అతిప్రేమతోను.

క. మాయ నెటు లైన మీఁదట
నాయమబాధలను బడుట యది నిశ్చయ మే.
మాయ నెటు లైన మీఁదట
నాయమబాధలను బడుట యది తప్పెఁ గద్దా. ౧౪౫.

టీక.—మాయౕ = కపటముచేత; ఆ యమ బాధలౕ = ఆ చిత్రాంగి పెట్టు శ్రమలను. ఆ యమ బాధలౕ = ఆ యమునియొక్క శ్రమలను.

తే. అని ప్రమోదించు, నుసు రను, నలతఁ గుందుఁ,
గుడిచి కూర్చుండి తన చేసికొన్న నేర
మికి వగచుఁ, బాన్పుపై వ్రాలు, మిన్ను విఱిగి
పైఁ బడినరీతి నివ్వెరపాటు నొందు. ౧౪౬.

టీక.—కుందుౕ = దుఃఖించును. నివ్వెరపాటుౕ = నిశ్చేష్టతను.

క. మదవతికిఁ గోర్కె చేపడి
నది మొదలుగఁ గట్టు పాటి యడలుఁ గుమారుం

డెదలోనఁ జీర చిక్కిన
యది మొదలుగ బిడ్డకుట్టు లను పుర్వడఁగన్. ౧౮౮.

టీక.—కుట్టు = వేదన. పొతి = వ్యాపించి. చీర...లనుట = చూలయునది మొదలు వేవిళ్లు అనుట.

తే. అంతఁ జిత్రాంగి మదనబాణాగ్ని వేఁగి,
హస్తగత మైనసొమ్ము పో నాడుకొన్న
కరణిఁ బరితాప మంది, యేసరణి నైనఁ
జెటుతు సారంగధరు నింక, సిద్ధ మనుచు. ౧౮౯.

టీక.—కరణిన్ = రీతిగా. ఏసరణిన్ = ఏమార్గము చేతను.

సీ. పాయని యపకీర్తి ప్రాపించుఁ దన కన్న
పోలిక నల్లనినైల గట్టి,
తల చూపఁ బాసె నందఱిలోనఁ దన కన్న
కైవడి వాసనకట్టు కట్టి,
తనుఁ ద్రోయుదురు గదా ఘనకూపమున నిట్టు
లనుభాతి మ్రుచ్చాలయిఱట్టను వసించి,
తనదేహ మిట్టులఁ జిదదక్కలౌ ననెడురీతిఁ
గులుకుగుబ్బలు వాఁడిగోళ్ల వ్రచ్చి,

తే. యెంతపాపాత్ము రాలని యింక మీఁద
బ్రహ్మ నిజఫాలఫలకాక్షరములు గట్టి
పెట్టునట్టులఁ గస్తూరిపట్టు వెట్టి,
సోటసోటలు పోవు విన్నయై సొంపు దఱిఁగె. ౧౯౦.

టీక.—వాసనకట్టు=తలకు మోఁతికట్టు. ఘనకూపమునన్=గొప్ప నూతిలో. భాతిన్ = ప్రకారముగా. వ్రచ్చి = చీల్చుకొని. ఫాలఫలక = ఫలకవంటి నుదుటి యందలి. సోటసోటలు పోవున్ = కృశించును.

శక్తిగల చెలులమొఁద నాసక్తియు సూక్తియును లేక జాలి విరాళిన్
శమునాహారమనోహారమ్ము నాహార యము క్రోధమున సాధమున్నన్.

టీక.—ర క్తి = అనురాగము. సూ క్తియు = మంచిమాటయు. జాలిన్ = : చారముచేత. విరాళిన్ = విరహముచేతను. ము క్త = విడువఁబడిన - ఆహార = భు కలది. మనోహర = మనోజ్ఞమైన - ముక్తా హార = ముత్యాల హారముకలది. సా ముననే = మేడయందు.

తే. జంత యిటు లల్గి యుండ, రా జంత నచట
సరసిచెంత బిసాగ్రంబు సరసి కొంత
మగని కందిచ్చుకోకిప్రేమ గని, తనదు
దుండిమెడఁ దగు లెంచి యం దుండి యపుడు. ౧౯౧.

టీక.—జంత = గయ్యాళి(యైన చిత్రాంగి). బిస అగ్రంబు = తామరతూఁటి చివరను. సరసి=సర్దుకొని. కోకి = చక్రవాకియొక్క.. దుండిమెడన్=భార్యయందు.

ఉ. కేలుఁజోకాటపుందలిరు, కేశమదాళులు, కౌనుదీఁగలే
నూలును, జన్ను మొగ్గలు, గనుందెలిదమ్ములు, మోవితేనెయుం,
జా లగునవ్వుఁదేటయు, భుజాబిసము, ల్గని యవ్విలాసపాం
చాలుఁడు ప్రేమఁ బద్మిని నిజప్రియఁ గా మదిలోఁ దలంచుచున్.

టీక.—అ విలాస పాంచాలుఁడు = విలాసయుక్తుఁడైన యా పాంచాలజాతి పురుషుఁడు. ప్రేమన్ = ప్రీతిచేత. పద్మినిన్=పద్మినీజాతి స్త్రీరూప మైనసరస్సును.

చ. దళ మగుతమ్మిపూఁగొలనితావిసెకల్ గదియంగ ముంగలన్,
జిలుకలు గోయిలల్ చెవులు చిందఱవందఱ సేయ సూరెలన్,
మలయసమీరముల్ వెనుకమల్లున నుల్కి పడం బయింబడన్,
గళవళ మంది చుట్టుకొనెఁ గంతునిమంది యటంచు నాత్మలో. ౧౯౩.

టీక.—దళము=దట్టము. సూరెలన్=పార్శ్వములయందు. సమీరముల్=మారుత మును. వెనుకమల్లనన్=వెనుకపార్శ్వమునందు. కళవళము=కలఁత. మంది = సేన.

ఉ. అక్కట! యేమి సేయుదు? రయంబున నిప్పుడె పోదు నంటినా,
మిక్కిలి దూరదేశము; సమీపమె? మాళవభూమిమండలం
బెక్కడ? దండకావన మి దెక్కడఁ? జక్కనిముద్దుగుమ్మ నా
చక్కెరబొమ్మఁ జూడ కిట సైఁపఁగఁ జాల వియోగవేదనన్. ౧౯౪

వ. అని యత్యంతసంతాపంబున నాందోళించుచు. ౧౯౫

క. రాజిత విభ్రమ లవ కల। నా జిత సుర మానవాంగనన్ జిత్రాంగిన్
తేజవ్వని మదిలో నిడి। రా జవ్వనిలోపలన్ విరాళిం గ్రాఁగెన్. ౧౫౬.

టీక.—రాజిత = ప్రకాశమానమైన - విభ్రమ=విలాసములయొక్క-లవ=లేశము యొక్క - కలనా = ఒప్పుచేత - జిత = జయింపఁబడ్డ - సుర మానవ అంగనన్ = దేవ మనుజ స్త్రీలు గలిగినట్టి.

తే. అట పరావనిభృ న్మౌళి ఘటిత పాదుఁ
డైన చక్రేశ్వరుండు సహస్రకరుఁడు
రామవిశిఖాగ్ని తేజఃస్ఫురణ హరింప
వ్రాలె నన వ్రాలెఁ జరమాంబురాశిలోన. ౧౫౭.

టీక.—ఈ పద్యములో కార్తవీర్యార్జునునియందు సూర్యత్వారోపణము చేసి అభేదాధ్యవసాయముగా చెప్పఁబడియున్నది.—అటు + అ = అట్లే-పరఅవనిభృత్ = శత్రురాజులయొక్క - మౌళి = శిరస్సులందు - ఘటిత = కూర్పఁబడిన - పాదుఁడు = పాదములు గలిగినవాఁడు - (అని కార్తవీర్యార్జున పరము), అటు = ఆప్రకారము - అపర అవనిభృత్ = పడమటి కొండయొక్క - మౌళి = శిఖరమందు - ఘటిత= కూర్పఁబడిన - పాదుఁడు = కిరణములు గలిగినవాఁడు - (అని సూర్యపరము); చక్రేశ్వరుఁడు = భూమండలాధిపతి (అని కార్తవీర్యపరము), చక్రవాకములకు ప్రభువైనవాఁడు (అని సూర్యపరము); సహస్రకరుఁడు=కార్తవీర్యార్జునుఁడు-(వేయిచేతులవాఁడు-వేయికిరణములవాఁడగు సూర్యుఁడును) - రామ=పరశురామునియొక్క - విశిఖ అగ్ని= బాణానలము-తేజః స్ఫురణన్ = పరాక్రమ వ్యాప్తిని, హరింపన్=గ్రహింపఁగా(అని కార్తవీర్య పరము), రామ = మూఁడైన - విశిఖ = గొప్ప జ్వాలలు గలిగిన - అగ్ని = అగ్నిదేవుఁడు - తేజఃస్ఫురణన్ = తేజోవ్యాప్తిని - హరింపన్ = హరింపఁగా - (అని సూర్యపరము); చరమ అంబురాశిలోనన్=మృత్యుసముద్రములో (అని కార్తవీర్య పరము), పశ్చిమసముద్రములోపల (అని సూర్యపము).—శత్రురాజులచేత నమస్కరింపఁబడిన భూమండలాధిపతి యైనకార్తవీర్యార్జునుఁడు పరశురాముల బాణాగ్నిచేత హరింపఁబడిన పరాక్రమము గలవాఁడై మృత్యువును పొందినవిధమున, అస్తాద్రియందుంపఁబడిన కిరణములు కలవాఁడై చక్రవాకములకు ప్రభువైనసూర్యుఁడు అగ్నిచేత తన తేజస్సు హరింపఁబడఁగా పశ్చిమసముద్రములో నస్తమించె నని తాత్పర్యము.

మ. తమి మందేహులతోడఁ బోరి యనుఁ డంతన్ వీఁగి తన్ జేర, న
స్తమహీభృన్మణి వెన్క వేసికొని మిత్రప్రేమ రక్తప్రవా

హాముగాఁ బోరె ననంగఁ జిక్కి, యలదైత్యశ్రేణి కాన్పింపకుం
డ మొగు ల్లాయలు వన్నె నాఁ, దనరెఁ జూడఁగ సంజకెంజీకటుల్.

టీక.—ఇనుఁడు = సూర్యుఁడు. తమిఁగ = రాత్రియందు. మందేహులతోఁడఁగ= మందేహులను రాక్షసులతో -(ఉదయాస్తమయ కాలములయందు మందేహనామక రాక్షసులు సూర్యుని ఎదిరించి పోరి ద్విజోత్సృష్టమంత్రతోయాంజలిత్రయముచే మడియుదురు). అస్తమహీభృత్ మణి=అస్తాద్రి శ్రేష్ఠము(అస్త మనెడురాజశ్రేష్ఠుఁ డనియు). మిత్త్రప్రేమఁగ=సూర్యునియందు ప్రీతిచేత (స్నేహితునియందు ప్రీతిచేతననియు). సంజకెంజీకటుల్=సాయంకాలముయొక్క యెఱ్ఱ చీఁకటులు.

ఉ. ద్రోహమె నీతిగాఁ దలఁచి దుర్మదుఁడై కనుఁ గాన కాత్మప
త్నీహరణం బొనర్చె నని దేవగురుండు శపింపఁగాఁ జుమీ
యాహరిణాంకుఁ డిట్లు తుము రాయె నటంచును జారచోరులు
త్సాహము మీఱఁగా నపుడు తారకముల్ నెరసెఁ నభంబునఁ.

టీక.—అహరిణాంకుఁడు=ఆచంద్రుఁడు. దేవగురుండు = బృహస్పతి. తుమురు= తునుకలు. నభంబునఁ = ఆకాశమందు. తారకముల్ = నక్షత్రములు.

తే. నల్లప్రజపై సరగ దండు వెళ్లఁ దలఁచి
రాజు వేయించువెలిగుడారం బనంగఁ
దోఁచెఁ బాండిమ ప్రాచిఁ; దోడ్తోన యందుఁ
గువలయదళమ్ము లప్పుడు గూచి యయ్యె. ౧౬౦.

టీక.—నల్ల ప్రజపైఁ=చీఁకటి యనుజనులమీఁద. రాజు=చంద్రుఁడు-ఱేఁడు. ప్రాచిఁ=తూర్పుదిక్కున. పాండిమ=వెల్లన. కువలయ దళమ్ములు = కలువ రేకులు-కలువలనెడు దండులు. కూచి యయ్యెఁ = వికసించెను (యుద్ధవాద్యములను వాయింపఁదొడంగినవి).

క. కలువలు కిలకిల నవ్వెఁ,
దొలిమల సెలయేటి యవలి తుహినాంశు కరం
బులు గని, యపు డేటావలి
గిలిగింత లటంట వానికిఁ సరి దాఁకెఁ. ౧౬౧.

టీక. —తుహినాంశు కరంబులఁ = చంద్ర కిరణములను. అవలి = అవతలనున్నటువంటి. ఏటావలిగిలిగింతలు అటంట=ప్రవాహమున కావల నుండి గిలిగింతలుచేయుట యను సామెత. వానికిఁ = ఆకలువలకు.

సీ. కరము లొయ్యనఁ జాఁచి, యిరులనెఱుల్ చక్కఁ
గాఁ దీర్చి తెల్విఁ సంఘటిలఁ గూర్చి,
కడు నయనచకోరికల ముద్దు గావించి,
చనుజక్కవల గోళ్ల నెనయ నాని,
కళలు రంజిల్లంగఁ దొలునాఁడు తనుఁగూడి,
'యిటుఁ బ్రొద్దు గ్రుంకునప్పటికి రేపు
వడి వచ్చి నిలుతు నీ కడల, నేఁటికిఁ జాలు.'
నని యేఁగుటను జేసి యవ్విధమునఁ
తే. దామరల నిక్కు వమ్ముగఁ, దనకుముదము
లతిశయిల్లంగ, వే వచ్చి యపుడె నిల్చె ?
దమివిటుఁడు తూర్పుదిక్కు లేఁ గొమిరెవయసు
బిత్తరిముఖంబునను బొట్లు వెట్టినట్లు. ౧౬౨.

టీక. (ఈ పద్యమున చంద్రునియందు విటత్వారోపణ చేసి అర్థద్వయము కలుగఁ జెప్పినాఁడు.) కరములు = కిరణములు, ఇరుల నెఱుల్ = ఇరులనెడు కురులను, తెల్విన్=ప్రకాశముతోడ, (అనిచంద్రపరము), కరములు=హస్తములను, ఇరుల నెఱుల్= చీఁకట్లవంటి వెంట్రుకలను, తెల్విన్=వివేకముతోడ, (అని విటపరము); నయన= నేత్రములవంటి - చకోరికలన్ = చకోరపక్షులను, (అని చంద్ర.), నయన చకోరికలన్ = చకోరికలవంటి నేత్రములను, (అని విట.); చను జక్కవలన్= స్తనములవంటి చక్రవాకములను, గోళ్లన్ ఎనయన్ ఆని=దుఃఖములను పొందునట్లు చేసి (అని చంద్ర.), చనుజక్కవలన్ = చక్రవాకములవంటి కుచములను, గోళ్లన్ = నఖక్షతములను, (అని విట.); కళలు = షోడశభాగములు, (అని చంద్ర.), కళలు రంజిల్లంగన్=రజఃస్థానములు ద్రవించునట్లు, (అని విట.); తామరల = కమలములయొక్క-నిక్కు = గర్వము, వమ్ముగన్ = నశించునట్లు, (అని చంద్ర.), తాన్=తాను, మరలన్=తిరుగ, నిక్కువమ్ముగన్=యథార్థము గా (అని విట.); తన కుముదములు = తన (చంద్రుని) తెల్లగలువలు (అని చంద్ర.), తనకున్ - విటుఁడైన తనకు, ముదములు=సంతోషములు, (అని విట.); తమివిటుఁడు= విటస్వరూపుఁడైన చంద్రుఁడు, తూర్పు = పూర్వదిశయను - లేఁ గొమిరెవయసు=ఎలజవ్వనముగల - బిత్తరి =సుందరియొక్క.

తే. రిక్క లెనయంగ నుదయభూభృత్తటమునఁ,
దెలివిఁ బొదల మృగాంకమండలముఁ జూచి,

వేగ వి ల్లెత్తి పచ్చనివింటిబోయ
యట విరహిజాలములను వేఁటాడఁ దలఁచె. ౧౬౩.

టీక.—(ఈ పద్యములో మన్మథునియందు కిరాతత్వ మారోపించి, అర్థద్వయము చెప్పఁబడి యున్నది.) ఉదయ భూభృత్ తటమునన్ = పొడుపు గుబ్బలి దరియందు, రిక్కలు ఎనయంగన్ = నక్షత్రములు ప్రకాశింపఁగా, తెలివిన్ పొదలన్ = ధావళ్య ముతో వర్ధిల్లఁగా, మృగాంక మండలమున్ = చంద్ర బింబమును, (అని మన్మథ పరము); రిక్కలు=ఎలుఁగుబంట్లు, తెలివిన్=వివేకముచేత, పొదలన్ = లతాగృహము లందు, మృగ అంక మండలమున్ = మృగముల గుర్తుల సమూహమును, (అని కిరాతపర ము); పచ్చని వింటి బోయ=అప్పుడే పచ్చి వెదురు బద్దతో చేసిన విల్లుగల కిరాతునిరూప ము గల పచ్చవిల్తుఁడు, విరహి జాలములన్ = వియోగి జన సమూహములను.

వ. అప్పు డల్ల హల్లకహి తాభిజన జనవల్లభ తల్లజుం డాయల్ల కానల దందహ్యమాన మానసుం డగుచు నిబిడ రస కుసుమ కిసలయ విసర శీతల చూతలతికా నికాయ నికాయ్యంబున నిశాకాంత కాంత మణి వేదికా నితాంత కాంత లతాంత శయ్యాంతరంబున మేను సేర్చి, పరిచారకుల నందఱం బనిచి, యేకాంతంబున నొక్కరుండ చిత్రాంగీ లతాంగీ దిదృక్షాసదృక్షాతిజాగరూకరూక్షాక్షుం డై, యుపరిప్రదేశ ప్రసూన వితాన నిర్గళ దనర్గళ మరందోదకబిందు ధూళి పాలికలు చందన చర్చలుగా, మరు ద్దోధూయమాన ప్రాంత శారద భూరుహ దళవ్రజంబులు వ్యజనంబులుగాఁ, దన్నివాసం బయత్న శిశిర కృత్యంబులు ఘటియించుచుండ, నిమ్మ కెరువు వేసినచం దంబున, నందు నంతకంతకుఁ బరితాపం బగ్గలం బై యీవల నీవలం బొరలం దొణంగె. ౧౬౪.

టీక.—అల్ల...జుండు—అల్ల = ఆ - హల్లక = కలువలకు - హిత = చెలికాఁ డైన చంద్రునియొక్క - అభిజన = గోత్రమునందలివాఁడైన - జనవల్లభ తల్లజుండు = రాజ శ్రేష్ఠుఁడు = రాజరాజనరేంద్రుఁడు, ఆయల్లక అనల=విర హాగ్నిచేత - దందహ్యమాన = మిక్కిలి తపింపఁబడుచున్న - మానసుండు = హృదయముగలవాఁడు, నిబిడ= దట్టమైన - రస = మకరందముతోడి - కుసుమ = పుష్పములయొక్కయు - కిసలయ= చిగుళ్లయొక్కయు - విసర = సమూహముచేత - శీతల = చల్లనైనటువంటి - చూత =

మామిడిచెట్లయొక్కయు - లతికా = తీఁగలయొక్కయు - నికాయ = సమూహముతో కూడుకొన్న - నికాయ్యంబునన్ = గృహమందు - అనఁగా పొదరింటియందు, నిశాకాంత కాంత మణి = చంద్ర కాంత మణుల - వేదికన్ = అరుగునందు, నితాంత=మిక్కిలి - కాంత = మనోజ్ఞమైన - లతాంత = చిగుళ్లయొక్క - శయ్యా అంతరంబునన్ = పాన్పు మధ్య, దిదృక్షా = చూచుటయందు - అసదృక్ష = అసమానమైన - అతిజాగరూక = మిక్కిలి మెలఁకువగలిగినటువంటి - రూక్షఅక్షుండై = పరుసమైన నేత్రముగల వాఁడై, ఉపరి ప్రదేశ = పై స్థానమందలి - ప్రసూన వితాన = పూల మేలుకట్లవలననుండి - నిర్గళత్ = వెలికి రాలుచున్న - అనర్గళ = అడ్డములేని - మరంద ఉదక బిందు = తేనె నీటి బొట్టులును-ధూళి పాలికలు = పరాగ సమూహములును, చందన చర్చలు గాన్ = గందపుఁ బూఁతలు కాఁగా, మరుత్ = వాయువులచేత - దోధూయమాన = మిక్కిలి కదలింపఁబడిన - ప్రాంత = సమీపమందలి - శారద భూరుహ = ఏడాకుల యనఁటి చెట్టులయొక్క - దళ = ఆకులయొక్క - వ్రజంబులు = సమూహములు, వ్యజనంబులు గాన్ = విసనకఱ్ఱలుకాఁగా, అయత్న = యత్నములేని - శిశిర కృత్యంబులు = శీతల క్రియలు, నిమ్మకున్ = నిమ్మచెట్టునకు, అగ్గలంబు = అధికము.

క. మధుమాసం బఁట, శుకపిక
మధుపాది మనోజబల సమన్విత వన మే
యధివాసం బఁట, యాపై
విధుఁ డుదయించె నఁట, విరహి వేఁగుట యరుదే? ౧౬౫.

టీక.—మధు = చైత్రః. పిక = కోయిలలు. మధుప = తుమ్మెదలు. మనోజ బల = మన్మథసేనతోడ-సమన్విత = కూడుకొన్న. అధివాసంబు=నివాసము. విధుఁడు= చంద్రుఁడు.

ఉ. వెట్టగ మందమారుతము వీవఁగఁ, దోడన వ్రాలెఁ బై విరుల్,
మిట్టిపడంగ వీఁడె దవిలెం బథికుం డడకొత్తులోనిపోఁ
కట్టుల నంచు, గాలి గలయప్పుడె తూరుపుపాటఁ బట్టుకొ
న్నట్టి ప్రకార మేర్పడ ననంగుఁడు నించినతూపులో యనన్. ౧౬౬.

టీక.—వీఁడె = ఈరాజె. పథికుండు=మార్గస్థుడు. అడకొత్తు = పోఁకొత్తు.

చ. వెనుకొని యంతలో మరుఁడు వెంద్రుక పట్టెడుతూపు లేర్చి బో
రున నల యించువిల్లు గొని త్రొక్కని-వోఁటులు ద్రొక్కు-వాజిపైఁ

బనుపడ నెక్కి సీళ్ళపయిఁ బా తెడులీలఁ జెలంగు మంచి తి
య్యనిపద నైనవా ల్నిలిపి యట్టిటు చేసె నృపాలు డెందముర్.

టీక.—బోరున౯ = శీఘ్రముగా. అలయించు = బాధపెట్టునట్టి-(అల యించు) విల్లు = (ఆ చెఱకు) ధనుస్సును. వెంద్రుక పట్టెడు తూపులు - (పువ్వులనుతుఱుము లోఁ దాల్తురుగాన) పుష్పబాణములను అని భా. ఏర్చి = సంధించి. త్రొక్కనిచోటులు త్రొక్కు తేజిపై౯ = త్రొక్కరానిచోట్లు త్రొక్కు చిలుకగుఱ్ఱముమీఁద. పనుపడ౯= జితపడునట్లు. తియ్యని పద నైన వాలు పఱపి=మధురమైన మకరందద్రవముగల (తామర తూఁడు లనెడు) కత్తులను ప్రయోగించి.

వ. అత్తఱిఁ దత్తఱిల్లి చిట్టాడిన గుట్టున నెట్టనం దెట్టిగిలం బడి మట్టుము ట్టినట్టిమరు కరాళి తేజీల శిశిరక రాళి చకోర కానిల రమానూనుల నుద్దేశించి వసుధేశుండు సుప్రలాప విప్రలాపంబుల నిట్లనియె. ౧౬౮.

టీక.—చిట్టాడిన గుట్టున౯=చంచల హృదయముచేత. నెట్టన౯ = మిక్కిలి. తెట్టగిలంబడి = దీనతఁజెంది. మరు కరాళి తేజీల౯= మన్మథునియొక్క భయంకరమైన గుఱ్ఱములను (చిలుకలను), శిశిరకర=చంద్రుఁడు-అళి = తుమ్మెదలు - మలయ పవమాన= గందపుఁగొండ గాలి-రమానూనుఁడు= మదనుఁడు. సుప్రలాప = మంచిమాటలచేత - విప్రలాపంబుల౯ = మిక్కిలిదుఃఖవచనములచేతను.

సీ. ఓచందమామ, నిన్ జూచినయపుడె మా
చిత్రాంగి మొక మింత చేసికొనును,
రాచిల్కలార, మీరాక గన్నపుడె మా
మదిరాక్షి నోరూర మాటలాడు,
నెలదేటులార, మి మ్మీక్షించినపుడె మా,
గజయాన తల గ్రుచ్చి కౌఁగిలించుఁ,
దమిఁ జకోరములార, మిముఁ గాంచినపుడె మా
కలకంఠి కన్నులఁ గప్పుకొనును,

గీ. దయ గలిగి కూర్పుచుట్టంబు లయితిరేని
యటకు మీ రేఁగి తా విరహార్తిఁ వేఁగఁ
దెలిపి మాపద్మగంధిఁ దోడ్తెచ్చి నన్నుఁ
గూర్పఁగదరయ్య మిము వేఁడుకొనెదఁగాక. ౧౬౯

టీక.—మొగ మింత చేసికొనుసు = ముఖమును వికసింపఁజేసికొనును-(చంద్రునిఁ జూడఁగానే సంతోషించు ననియు చంద్రునితో సమానమైనముఖము కలది యనియు భా.); సూరూరన్ = తీయగా-(చిలుకపలుకులకు సంతోషించు ననియు చిలుకపలుకుల వంటిపలుకులు గల దనియు భా.); తల గ్రుచ్చి కౌఁగిలించున్ = శిరస్సును పొడిచి ఆలింగనముచేయును - (అతిప్రేమచేత తల వంచి యాలింగనము చేయు ననియు, తుమ్మెదలవంటి కురులు గల దనియు భా.); కన్నులఁ గప్పుకొనున్ = దయాదృష్టితో చూచును-(చకోరముల నతిప్రేమతోఁ జూచుచు ననియు, చకోరములవంటి నేత్రములు కల దనియు భా.); కూర్పు = నెయ్యముగల.

తే. తనదుపై రైనయిరులు చిందఱలు సేయు
దనుచు నినుఁ బట్టిఁ జూచుఁగా యాతమంబు;
రాజ, నీపేరివాఁడ; గోత్రపతి వీవు;
వల దనక మారుతోఁ గూడి కలఁప నేల? ౧౭౦.

టీక.—తనదు పై రైన యిరులు = రాహువునకు నామమయిన 'తమము' అను పేరుగల చీఁకట్లను. తమంబు = రాహువు. రాజ = ఓచంద్రుఁడా, నీపేరివాఁడన్- అనుట చంద్రునికిని భూపతికిని రా జను పేరు సమానము గనుక. గోత్రపతివి - అనుట ఈ రాజు చంద్రవంశస్థుఁడు గనుక.

మ. నను నీగోత్రజు నింత యేఁచుటకుఁ గా నాయంబె నీ కబ్జ? చ
య్యనఁ దోఁబుట్టువు లైనయబ్జముల నీ వయ్యో! పగల్ మీఱఁగా
ననయంబున్ గఱిగందఁ జేయుదువు, నీ కట్లాగె; యె ల్లని రా
జునకుం దమ్ములమీఁదఁ బ్రేమ గలదా సొంపారఁగా నెందులన్?

టీక.—అబ్జ=చంద్రుఁడ. తోఁబుట్టువులు=అన్నదమ్ములు (చంద్రుఁడును కమలములును నీటఁ బుట్టినందున ఈమాట). అబ్జములన్=కమలములను. పగల్ మీఱఁగాన్= దివాభాగ మతిక్రమింపఁగా - రాత్రి కాఁగా - (ద్వేషము లధికము కాఁగాఁ ననియు). గఱిగందన్ = ఒక్కుమాఁడునట్లు=నశించునట్లు. రాజునకున్=చంద్రునకు-(భూపతికి అనియు), తమ్ముల = తామరల-(అనుజుల అనియు).

తే. పాము తనరఁ గా మనియెడు పలుకు నిజము
గా మెలంగినరాహువు గఱచి నిన్ను
నేమి సేయక పోయె! న దేమి యకట!
యోషధీశుండ వీ వౌటనో మృగాంక. ౧౭౧.

టీక.—గాము = గ్రహము - (రాహువు సర్పరూపమయిన గ్రహము గాన నిట్లు చెప్పుట). ఓషధీ ఈశుండవు = మందుల దొరవు-(చంద్రుఁడు ఓషధులకు ప్రభువు).

చ. 'సకలుఁడు కాలకూటసహజన్ము సుధాకరుఁ' డంద్రు, నిక్క మా
నోకొ యిది? యంచు నోసితమయూఖ, నినుం దెలియంగఁ గోరి యూ
రక యటు చేరినంతఁ దలప్రాణము దోఁకకు వచ్చె; లెక్క సే
యక దిగ మ్రింగె నేని యకటా; యలరాహువు మన్కి గాంచునే?

టీక.—సకలుఁడు = కళలుగలవాఁడు. కాలకూట సహజన్ము=(సముద్రమున) హాలాహలముతోడఁ బుట్టినవాఁడు. సుధా కరుఁడు=కిరణములలో అమృతముకలవాఁడు. నిక్కము=నిజము. ఓసితమయూఖ = ఓచంద్రుఁడా. తలప్రాణము తోఁకకు వచ్చెన్= (రాహువునకు) ప్రాణాంతమునకు వచ్చెను. మన్కి = బ్రతుకు.

ఉ. ఆవిమలాత్ము డౌమధునిశాటమహాబలభేది యైనలో
కావనుపట్టి వై, మధు నిశాట మహాబలులందుఁ గూడి లో
కావళి నేఁప నీవు విరహార్తులమీఁదనె చూపుశౌర్యమున్
భావజ, యీహళాహళియు భర్గునిముందఱఁ జూప వైతిగా. ౧౭౪.

టీక.—మధు నిశాట మహా బల భేది = మధువను రాక్షసునియొక్క అధిక బలమును పోఁగొట్టినవాఁడు. లోక అవను పట్టి=జగద్రక్షకుఁడైన విష్ణువుయొక్క కుమారుఁడవు. మధుని శాట మహాబలులందున్=వసంత చంద్ర వాయువులతో. భర్గుని=శూలి.

సీ. కరమండలాగ్రికకలన భాస్వద్ద్విజా
వలిఁ బాఱఁ దోలినతులువ వీవు,
నెమ్మి నెక్కుడు గాఁగ నమ్మి యుండెడుమేటి
గురుని కై గ్గొనరించుకుమతి వీవు,
మిత్త్రుండు వడినంత మెఱసి ధామంబు ముం
దుగ నాక్రమించిన ద్రోహి వీవు,
తమ్ముల మిగులఁ బాదమ్ములఁ గారించి
యల వింటఁ గనిపించుఖలుఁడ వీవు,
తే. కటకట వియోగలోకంబు కటకట పడ
ననలశరముల నేఁచకు మనిన నీవు

మానుదువె నీగుణంబు? లౌ నౌను మేన
మామపోలిక యిది గద మాకుమార. ౧౮౫.

టీక.—(ఈపద్యమున సీసచరణములలో మన్మథునికిని చంద్రునికిని అభేదాధ్యవసాయముచేసి యర్థద్వయము కలుగఁ జెప్పినాఁడు.) కర = హస్తములయొక్క - మండలాగ్ర = కత్తితో - ఏకకలనన్ = మిక్కిలి కూడుకొనుటచేతను, భాస్వత్ = ప్రకాశించుచున్న, ద్విజావళిన్ = బ్రాహ్మణసమూహమును, (అని మన్మ.); కర మండలాగ్ర= కిరణములనెడు కత్తులతో, ద్విజావలిన్ = చక్రవాకసమూహమును, (అని చంద్ర.); (నెమ్మిన్=నెమలిని. ఎక్కుడు=వాహనము.) నెమ్మి... మేటి=మయూరవాహనుఁడగు కుమారస్వామియొక్క-గురునికిన్=తండ్రియైనశివునికి, (అని మన్మ.); నెమ్మిన్ = ప్రేమతో, ఎక్కుడుకాఁగన్=అధికునిఁగా, మేటి గురునికిన్=శ్రేష్ఠుఁడైన బృహస్పతికి, (అని చంద్ర.); మిత్త్రుండు = సూర్యుఁడు, మెఱసి = వెలుఁగడి, ధామంబున్ = ఇంటిని (అనఁగా ఇల్లాండ్రను ఆవేశించి), (అని మన్మ.); ధామంబున్ = తేజస్సును, (అని చంద్ర.); తమ్ములన్ = తామరలతో, పాదమ్ములన్ = పాదుకొనునట్టి బాణములతో, కారించి = (వియోగులను) బాధించి, అల వింటన్ = ఆ చెఱకు వింటిచేత, (అని మన్మ.); తమ్ములన్ = తామరలను, పాదమ్ములన్ = కిరణములచేత - కారించి = నశింపఁజేసి, (అనుజులను కాళ్లతో తన్నియనియు), అలవింటన్ = ఆయాకాశమందు, (అని చంద్ర.); కటకటపడన్= సంతాపపడఁగా. ననల శరములన్ = పుష్పబాణములచేత. మాకుమార = లక్ష్మీదేవికుమారుఁడైన మన్మథుఁడా.

ఉ. విం ఖరవృత్తిఁ జూపఁ దగవే విరహార్తులపై? ధురంధర
త్వాంఖశరేక్షుచాపములు పూనిటు లేటికి సాము సేసె, ద
ల్కాం ఖిల మా శరీర మని కాన కనంగ? యయో! శరీర మా
ద్యం ఖలు ధర్మసాధన మటన్నది విన్నది లేదొ యెన్నఁడున్ ?

టీక.—విన్ = వినుము. ఖరవృత్తిన్ = క్రూరవ్యాపారమును. ధురంధరత్ = సమగ్రములయిన - శర ఇక్షుచాపములు = బాణములను చెఱకువింటిని. అల్కన్ ఖిలము ఔన్ = కోపముచేత దేహము నశించును. శరీరమ్ = దేహము, ఆద్యం = మొట్టమొదటి, ధర్మసాధనమ్ = ధర్మముచేయుటకు ఉపకరణము, ఖలు = గదా.

గీ. మలయపవమానబాలకుల్ మందులు గద,
యమృతకరుఁడవు గద నీవు కమలవైరి,
యకట యిటు లయ్యుఁ బెంపు సేయంగఁ దగునె
యంగజవ్యాధులను మాన్పకం గరంబు? ౧౮౮.

టీక.—మందులు = మెల్లనివి. అమృతకరుఁడవు = సుధాకిరణములు కలవాఁడవు (అమృతహస్తము కలవాఁడవు అనియు). అంగజవ్యాధులను = మదనజాడ్యములను, (శరీరజన్య మైన జాడ్యముల ననియు), మాన్పకన్ = పోఁగొట్టక.

క. వ్రతమా యిటు లేఁచ మధు
వ్రతమా? నీ కుచితమా విరాళిం బఱునా
రుత మాలింప వయో! చా
రుతమామోదయుతమా చిఱుతమారుతమా. ౧౭౮.

టీక.—మధువ్రతమా = ఓ తుమ్మెదా. చారుతమ=మిక్కిలిమనోజ్ఞమై - ఆమోదయుతమా = పరిమళముతోఁ గూడుకొన్న దానిసంబుద్ధి.

(పంచచామరము.)

జొహారు మీకుఁ జల్లగాఁగఁ జూడుఁ డోసమీరకం
జహారులార, మంటమారి శంబరారిఁ గూడి, నన్
గొహారు సేయ నేల సారెకున్ జలంబునం? భుజం
గహారుపాద మాన మీరు క్రాఁక లింకఁ జేసినన్. ౧౭౯.

టీక.—జొహారు = నమస్కారము. ఓ సమీర కంజహారులార = ఓ మారుత చంద్రులారా. మంటమారి శంబరారిన్=చండకోపి యైన మన్మథునితో. గొహారు = ఉపద్రవము. భుజంగహారు పాద మాన = సర్పహారములుగల సాంబశివుని పాదము తోడు; అనఁగా వాయువునకును, చంద్రునకును సర్పములు విరోధములు చేయునవి గనుక, 'భుజంగహారు' అనుచోట సాభిప్రాయవిశేష్య మనియు, చంద్రునికి సర్పరూపుఁ డయిన రాహువు విరోధి యనియు, నెఱుంగవలయు.

చ. పలుమఱు పచ్చరాచలువబండల వ్రాలుచుఁ, బారిజాతమం
జులలవలీనికుంజముల సోలుచు, విన్నదిఁ దేలుచున్, సురల్
నెలకొని కంటికిన్ నిదుర లేక చరించుచు నుండు రెల్ల నీ
కళలు భుజింపఁగా నయినకాఁకకుఁ గాక సుమీ సుధాకరా. ౧౮౦.

టీక.—సురల్ = దేవతలు (కర్త). పారిజాత = పారిజాతవృక్షములయొక్క - మంజుల=మనోజ్ఞమైన - లవలీ నికుంజములన్ = తీఁగ పొదరిండ్లయందు, విన్నదిన్ = ఆకాశగంగయందు. కంటికిన్ నిదుర లేక - (దేవతలు నిద్రలేనివా రనియు భా).

చ. గరళపుముద్ద దిన్నకఱకంఠుఁడు నీకళ దాల్పఁగా నిశా
కర, జడగట్టి, మీఁద హిమగాంగజలంబుల నందు నించి, మే

నారయఁగ నుండఁ జేసె; నటు లుండియుఁ, దా సగ మయ్యె! హా! సుధా
కరుఁడవె యైన నిన్ వెడలఁ గ్రాయఁగ నేమిటి కల్ల రాహువున్. ౧౮౧.

టీక.—హిమ గాంగ జలంబులన్ = చల్లని గంగోదకములను. సగ మయ్యెన్ - మిక్కిలి కృశించెను - (అర్ధనారీశ్వరుఁ డనియు భా). క్రాయఁగఁ నేల = క్రక్క నేల.

చ. చిడిముడిపాటునన్ జెఱకుసింగిణిఁ బూని, మధుప్రియత్వ మే
ర్పడ, వడిలావు లున్నహరిపైని జివుక్కున నెక్కి, యుక్కునన్
వెడలెదు చంద్రుఁ జూచి, తమి నేఁ డిదె గోవధ మాచరించు పూఁ
పడరఁగ నీవు వచ్చితుర కౌదువు పాంథులకున్ మనోభవా. ౧౮౨.

టీక.—చిడిముడిపాటునన్ = తొందరపాటుచేత. చెఱకు సింగిణిన్ = ఇక్షుధనుస్సును (ప్రియమైన వింటెని అనియు); మధుప్రియత్వము = వసంతునియందు ప్రేమ (అని మన్మ.) - సారాయియందు ప్రేమ (అని తురకపరము.); వడి లావు లు ఉన్న హరిపైన్ = వేగమైన ఱెక్కలు గల చిలుక (గుఱ్ఱము) మీఁద (అని మన్మ.) - మిక్కిలి వేగమైన గుఱ్ఱముమీఁద (అని తురుష్క.); ఉక్కునన్ = చేవచేత. తమిన్ = ప్రేమచేత. గోవధము - గో = భూమియొక్క (అనఁగా భూమిలోనివారియొక్క) - వధము = మారణమును, (అని మన్మ.), గోవధము = ఆవును చంపుట (అని తురక.); (మదనుఁడు తనసఖుని చంద్రుని యుద్ధమునకు తరలుచుఁజూచును, తురక పండువురాత్రిని చంద్రదర్శనము చేసి గోహత్యం గావించును). పూఁపు = పూనిక.

వ. అని యనేకప్రకారంబుల నవ్విశ్వంభరాజంభారి యుపాలంభం బొన
రించి, మందరగిరియునుం బోలె వనరాశిమధ్యంబున మరు న్నిశాచ
ర కర భ్రమితుం డై, లోభియునుం బోలె నతనుదుష్టమార్గణగణ
క్షుభితుం డై, పద్మాకరంబునుంబోలె మధుపరాజితసుమనఃపాళి యై,
విరాళిం దూలి యున్న సమయంబున. ౧౮౩.

టీక.—అవ్విశ్వంభరాజంభారి = ఆభూమీంద్రుండు. ఉపాలంభంబు = నిందను. వనరాశిమధ్యంబునన్ = అడవినడుమను (అని రాజ.)-సముద్రమధ్యంబున (అని మందర.); మరుత్ నిశాచర కర భ్రమితుండు = వాయువుచేతను చంద్ర కిరణములచేతను భ్రమ పడినవాఁడు (అని రాజ.)-దేవ దానవుల చేతులచేత తఱవఁబడినది (అని మందర.); అతను దుష్టమార్గణ గణ క్షుభితుండు = మన్మథుని క్రూరములైన బాణ సమూహములచేత దుఃఖపెట్టఁబడినవాఁడు (అని రాజ.)-పలువురు చెడుయాచకుల సమూహముచేత దుఃఖపెట్టఁబడిన వాఁడు (అని లోభి.); మధుపరాజిత సుమనః పాళి = మకరందముచేత జయిం

బడిన (అనఁగా అధికముగా మకరందము గలిగిన) పుష్పసమూహముగలవాఁడు (అని రాజ.)-తుస్మెదలచేత ప్రకాశించుచున్న పూలమొత్తము కలిగినటువంటి (అని పద్మా.)

చ. ఇనుఁ డుదయాద్రి నండగొని, యిప్పుడె సంజను ముచ్చిలంబడన్
బనిచి, రయంబ తా వెనుకఁ బ్రాఙ్ముఖపార్శ్వము లేర్చి దాడి దా
నొనరిచె, నోటమిం బయట నుండక పొమ్మని వేగుఁ దెల్ప వ
చ్చినగతి వేగుచుక్క పొడిచెన్, జనె రాజును బశ్చిమాద్రికిన్.

టీక.—ఇనుండు = సూర్యుఁడు. అండ=ఆసరా. సంజను=సంధ్యను (సూర్య.)-సంధ్యయందు (ప్రభు.) ముచ్చిలంబడన్ = అపహరించుటకు. ప్రాఙ్ముఖపార్శ్వములు = తూర్పుతొలిభాగముయొక్క ప్రక్కలు. ఏర్చి = ఎండకాయునట్లుచేసి (అని సూర్య.)-దహించి (అని ప్రభు.) దాడి = దండయాత్రను, ఒనరిచెన్ = చేసెను, ఓటమిన్ = అపజయముచేత (అపజితుఁడవై యనుట). బయటన్ = వెలుపలను (ఆకాశమున). వేగుచుక్క = శుక్రుఁడు. రాజు = చంద్రుఁడు శత్రురాజు, (అని ప్రభు).

మ. ఇనుఁ డన్నాముఁడు ప్రేమ సారసవనం బీడేర్పఁగాఁ జొచ్చి, మిం
చినసంధ్యారుచి రక్తధారలు ప్రవర్షింపంగ వింటం గరం
బను వంద న్నిగిడించుచో సమయవాయవ్యాస్త్ర ముద్వృత్తి నె
క్కొన మారీచనిశాచరుం డన మృగాంకుం డంబురాశిం బడెన్.

టీక.—ఇనుఁడన్ = సూర్యుఁడనెడు. సారసవనంబు = పద్మాటవిని (అని సూర్య). సార = శ్రేష్ఠమైన - సవనంబు=(విశ్వామిత్రుని) యజ్ఞమును (అని రామ). సంధ్యా రుచి రక్తధారలు=సంధ్యాకాలమునకు సంబధమైన యెఱ్ఱనికాంతులు (నెత్తురువానలు ననియు), వింటన్ = ఆకాశమందు (ధనుస్సునందు). కరంబు = కిరణమును (హస్తమును). సమయ = ఉదయకాలమందలి - వాయవ్యాస్త్రము = బాణమువంటివాయువును-(సూర్య.); సమయన్ = నశింపఁజేయుటకు-వాయవ్యాస్త్రము = వాయవ్యాస్త్రమను బాణమును-ఉద్వృత్తిన్=మిక్కిలియౌద్ధత్యముచేత - నిశాచరుండు = రాక్షసుఁడు-(రామ.); మృగాంకుఁడు=చంద్రుఁడు,అంబురాశిన్=సముద్రములో. అనఁగా, శ్రీరాములు వాయవ్యాస్త్రము ప్రయోగింపఁగా మారీచుఁ డనురాక్షసుండు సముద్రములో పడినట్లు, సూర్యుఁడు వాయువును ప్రకాశింపఁ జేయఁగానే చంద్రుఁ డస్తమించెను.

తే. ద్విజకులమ్ములకూఁతలు దెసల నెగసె,
నింకె సద్గణతేజముల్, పంకజాత
మటు విజృంభించెఁ, గువలయం బట్టిటు వడె;
నట్టు లగుఁ గా యరాజకం బైన యెడల. ౧౪౯.

టీక.—ద్విజకులమ్ముల కూఁతలు = పక్షి సమూహముల ధ్వనులు - బ్రాహ్మణ సమూహముల వేదపాఠములు. సత్ గణ తేజముల్ = నక్షత్ర సమూహముల వెలుఁగులు - సత్పురుష సమూహముల మహిమలు. పంకజాతము = కమలము - పాపసమూహము. కువలయంబు=కలువ - భూమండలము. అరాజకంబు = చంద్రుఁడు లేనిది - రాజులేనిది.

చ. కొలఁదిగఁ జక్రకైరవ చకోర సరోజదళంబులన్ జలం
బలవడఁ గూర్పఁ బిప్పఁ గలయట్టియినుం డలచందమామ క
ర్మిలిఁ గర మిచ్చి పుచ్చుకొనుమిత్త్రుఁడు చీఁకటు లెల్ల నీరు గా
నలఁచువిభావసుండు గన నయ్యెఁ బతంగుఁడు ప్రాఙ్ముఖంబునన్ ౧౮౭.

టీక.—చక్ర=చక్రవాక పక్షులయొక్కయు - సరోజ=తామరలయొక్కయు-దళంబులన్=సమూహములను, జలంబు = ఉదకమును (చలంబు = ద్వేషమును), కూర్పన్ విప్పన్=సంకుచిత వికసితములనుచేయుటకు, ఇనుండు = సూర్యుఁడు (ప్రభు వనియు), అర్మిలిన్=ప్రేమచేత, కరము=కిరణము (కప్పము అని ప్రభు.), మిత్త్రుఁడు=సూర్యుఁడు (స్నేహితుఁడు అని ప్రభు.), చీఁకటులు=అంధకారములను (అజ్ఞానములను), నీరు గా నలఁచు = నీళ్లు అగునట్లుగాఁ శ్రమపెట్టు, విభావసుఁడు=సూర్యుఁడు (జ్ఞానియు), పతంగుఁడు=సూర్యుఁడు, ప్రాఙ్ముఖంబునన్ = తూర్పుదిశయందు.

వ. అయ్యెడం గాలోచితకృత్యంబుల నిర్వర్తించి సమస్త చమూ సమూహ సమేతుం డై నరపాలపురుహూతుండు గదలి నిజరాజధానిఁ జేరం జనుదెంచి నగరు ప్రవేశించుసమయంబున. ౧౮౮.

టీక.—నరపాలపురుహూతుండు = రాజేంద్రుఁడు.

సీ. శృంగారము లెసంగ బంగారపుమెఱుంగుఁ
 బోండ్లు కురుఁజులపై గొండ్లి సలుపఁ,
బుణ్యాంగణములందుఁ బుణ్యాంగనల్ గ్రందు
 గా సారె ముత్యాలసేసఁ జల్లఁ,
జెలరేఁగి మణిసౌధముల మూఁగి యవరోధ
 కామినుల్ సోరణగండ్లఁ జూడ,
నాద్య ఘోషణముల హృద్యభాషణముల
 వందిమాగధులు చెల్వొంది పొగడ,

తే. గడలపోఁజులరొద లిరుగడలఁ జెలఁగ,
దొరల నందఱ మన్ననల్ దొరల ననిచి,
వడి నిగుడఁ దేజిఁ గొల్పు చావడిని డిగ్గి,
యరిగె నత్తఱి మహిభర్త యరిగె లెత్త. ౧౮౯.

టీక.—బంగారపు మొలుంగుఁబోండ్లు=పసిఁడివన్నెగలస్త్రీలు, కురుఁజులపైన్=కోటకొమ్ములమీఁద, గొండ్లి = క్రీడ, పుణ్యాంగనల్ = ముత్తైదువులు, క్రందుగాన్ = గుంపుగా, సేసన్=అక్షతలను, అవరోధకామినుల్=అంతఃపురస్త్రీలు, సోరణగండ్లన్=గవాక్షులగుండ, గడల పోఁజుల రొదలు=ఈఁటెల దండుల యొక్క ధ్వనులు, అరిగెలు ఎత్తన్ = బిరుదులు పట్టఁగా.

తే. అటుల నంతఃపురంబున కరిగి విభుఁడు
కొలువుసింగారము సడల్చి కొందఱ నుడి
గంపుఁగుంభస్తనుల జలకంబుఁ బట్టుఁ
డనుచు నానతి యీ నంత నతిరయమున. ౧౯౦.

సీ. రమణి నిల్పె మనోహరమణిపీఠి యొకర్తు,
తల యంటె నీలకుంతల యొకర్తు,
అటకలి యిడె లెస్స యట కలికి యొకర్తు,
జలజగంధి యొకర్తు జలక మార్చెఁ,
దడి యొత్తె నొక్కపుత్తడిబొమ్మ నృపతికిఁ,
జెలువొచలువ లిచ్చెఁ జెలువ యొకతె,
సికఁ జుట్టె విరు లొక్కసికతామయనితంబ,
వెలఁదికస్తురి నొక్క వెలఁది యలఁదె,
తే. ధూప మొనరించె నొక్కవిధూపమాస్య,
తిలక మొనఁగూర్చె భామినీతిలక మొకతె,
మించుఁదొడవులు దొడిగెను మించుఁబోణి,
భోజనము వెట్టె నొక్కయంభోజనయన. ౧౯౧.

టీక.—నీలకుంతల = నల్లనిమురులుగలస్త్రీ. అటకలి = జిడ్డుపోఁగొట్టువస్తువును. పుత్తడి = బంగారు. చెలువు = అందము. చలువలు = చలువవస్త్రములు. సికతామయ

నితంబ = ఇసుక దిబ్బలవంటి పిఱుఁదులుగలస్త్రీ. వెలఁది = శ్రేష్ఠమైన. విధు ఉపమా ఆస్య = చంద్రునికి సమానమైన ముఖముగలస్త్రీ.

క. ఈరీతి శిరముమజ్జన
మారోగణ మయి, మణీమయపుఁబాదుక లో
య్యారముగ మెట్టి, యుడిగపు
నీరజముఖి కేలు వట్టి నృపుఁ డింపెసఁగన్. ౧౯౨.

టీక.—మజ్జనము = స్నానము. ఆరోగణము = భోజనము.

క. సోగలగు వెండితేకుల
లాగునఁ దెలనాకు మడిఁచి లలన యొసంగన్,
బాగాలు వేసికొని, తన
బాగా లున్నట్టిమేడపజ్జకు నేఁగెన్. ౧౯౩.

టీక.—లలన = స్త్రీ. బాగాలు = తాంబూలము. తనబాగాలు = తనబాగైన యాలు. పజ్జకున్ = సమీపమునకు.

తే. ఏగుచోఁ దొంటిచందాన నించుకైన
మెలఁగుచెలికత్తియలయలబలము లేక,
ప్రాణవల్లభపోలకువ గాన రాక,
విన్ననై యున్న యాసౌధవీథిఁ జూచి. ౧౯౪.

క. వాలికమెఱుంగుఁజూపు ని
వాళిగ నొనరించి యెపుడు వడిఁ జేయును దా
నాలింగన; మేమో? యిపు
డాలింగన మనుచు నృపతి వ్యాకులమతి యై. ౧౯౫.

టీక.—నివాళి = హారతి.

క. అరుదెంచి, యలిగి యుండెడి
యరుదెంచి, మదిన్ వితాకుఁడై తహతహతోఁ
దరియంగ నరిగి, శాతో
దరియంగం బపుడు గాంచి దయ దయివాఱన్. ౧౯౬.

టీక.—వితాకుఁడై = నిశ్చేష్టితుఁడై. తహతహతోన్ = తమకముతో. దరియంగన్ = సమీపమునకు. శాతోదరి = సన్నని కడుపుగల యాచిత్రాంగియొక్క. దయివాఱన్ = వర్ధిల్లఁగా.

తే. హంసతూలికాతల్ప మంత తల్పమే, ల
తాంగి, కడఁ ద్రోచి నేలఁ బడంగ నేల?
వెలగలవు సేయు వెలచేలములు గలుగఁగ
నూన మగుమైల నెమ్మేన నూన నేల? ౧౯౭.

టీక.—హంసతూలికా తల్పము = జిల్లేడుదూది శయ్య. అంత + అల్పమే. వెలకలవు సేయు = వెలలేని. వెల = వెల్ల = తెల్లని. చేలములు = చీరలు. ఊనము = తక్కువ. ఊన నేల = ధరించుట యెందులకు.

ఉ. కప్పురపున్ విడెంబు కుతుకంబునఁ జేయ వ దేల? వాసనల్
చిప్పిలుకుంకుమంబు మయి లేప మొనర్ప వ దేమి? చీఁకటుల్
గప్పెడుకీలుకొ ప్పొలపుగా నవరింప వ దేటి కిప్డు? డా
యొప్పులకుప్ప, నీ వలిగియుండెడి కారణ మేమి తెల్పవే. ౧౯౮.

టీక.—కుతుకంబునన్=సంతోషముచేత. చిప్పిలు=వెల్లిగ్రక్కునట్టి. మయిన్=దేహమందు. ఒలపుగాన్ = అందముగా.

సీ. ఇం పైననీపాట కెన గా దటంచునో
మెలనాగ వీణ వాయింప వేల?
నీరీతి మాటలు నేర దటంచునో
కలకంఠి చిలుకతోఁ బలుక వేల?
తళుకొత్తు నీదుచెక్కులఁ బోల వంచునో
శుకవాణి యద్దముల్ చూడ వేల?
యొరయునీపాలిండ్ల కుద్ది రా వంచునో
యలివేణి పూబంతు లంట వేల?
తే. కడు నొయారంబు లైననీనడలకరణి
నడువఁగ నెఱుంగ వంచునో నంటుతోడ

నంచబోదల నడిపించి పెంచ వేల
మోద ముప్పొంగి చిత్రాంగి మోహనాంగి? ౧౯౯.

టీక.—ఎన = సాటి. చెక్కులన్ = చెక్కిళ్లను. నంటుతోడన్ = స్నేహముతో. అంచబోదలన్ = హంసపిల్లలను.

తే. పోతుటేఁగ కైనఁ బోలయంగ రాదు నా
యానఁ జేసి మందయాన నిన్ను;
నెవ్వ రెగ్గు సేసి రెటేఁగింపవే. మది
నళుక వలదు, నీకు నలుక వలదు. ౨౦౦.

టీక.—ఆన = ఆజ్ఞ. అళుకు అ = భయమే. అలుక = కోపము.

సీ. తరుణి, మహాప్రసాదం బని నీమాట
మంతురుల్ శిరసా వహింతు రెపుడు,
రమణి, నాబాంధవరాజహంసాళి నీ
యడుగుల కేవేళ మడుఁగు లొత్తు,
నండజవరయాన, యవని నీపేరు సె
ప్పినఁ బాఱుపా మైనఁ బెగడి నిలుచుఁ,
గమలపాణి, యొకింత గదిసి నిన్నొకనాఁడు
నట నిక్కి చూడ బ్రహ్మాయును వెఱచు,
తే. నింత చన విచ్చి యరమర యింత లేక
నిన్ను నత్యాదరమున మన్నింప లేదె?
మగువ నే నన కున్న నీమన సెఱుఁగదె?
నీకు నేమిటఁ గొద వయ్యె నేఁడు సెపుము. ౨౦౧.

టీక..—మహా ప్రసాదంబు=అతిశయానుగ్రహము. మహా ప్రసాదం బని శిరసా వహింతురు-దేవతానిర్మాల్యాదిని శిరమునఁ దాల్చినట్లు అని భా. నాబాంధవ రాజ హంస ఆళి=నాబంధువులైన రాజశ్రేష్ఠులసమూహము. మడుఁగులొత్తున్=మడిఁచినవస్త్రములను నొవ్వకుండ ఒత్తును - హంసలు గమనము నేర్చుకొనుటకై అడుగులను గొలుచు నని భా. అండజ వర యాన = శ్రేష్ఠమైన హంసయొక్క నడకగల చిత్రాంగీ, అవనిన్ = భూమియందు, అండజవరుని అనఁగా గరుత్మంతుని పేర్కొనినచో పాము నిలిచినట్లు అని ధ్వని.

కమల పాణి = తామరవంటి చేతులు గలదిగ్రాంగీ (మహాలక్ష్మీ యనియు భా.)

క. వలపు మదిఁ దెలియ కూరకె
యలిగితొ? నినుఁ దక్క వేఱె యతివలపొందుల్
కల నైన నెఱుఁగ; దీనికి
తలిరువిల్తుండె సాక్షి తామరసాక్షీ. ౨౦౨.

సీ. తరుణి, నీనూఁగారుసరి యొందు లే దని
డగ్గఱి పాముఁ బట్టంగవచ్చు;
వనిత, నీముఖకాంతి కెన యొందు లే దని
గెంటక ద్విజరాజు నంటవచ్చు;
నింతి, నీకౌనుతో నీ డెందు లే దని
యెదురుగా హరికిఁ జే యెత్తవచ్చు;
నువిద, నీకనుదోయిసవ తెందు లే దని
ధాత్రిఁ దమ్ముల వైచి దాఁటవచ్చు;
తే. సతివ, నీకనుబొమల కప్రతి యటంచు
నెట్టిధర్మంబుపై నాన యిడఁగ వచ్చు;
నిచ్చకము గాదు సుమ్ము నేఁ డిది నిజమ్ము;
భద్రగజయాన, వలరాజుపాద మాన. ౨౦౩.

టీక.—పాముఁ బట్టంగ వచ్చున్ = పామును పట్టుకొని ప్రమాణము చేయవచ్చును - (నూఁగారు సర్పసమ మనుట), గెంటక = కొంకక, ద్విజరాజున్ = బ్రాహ్మణశ్రేష్ఠుని (చంద్రుని అనియు) - (బ్రాహ్మణుని ముట్టుకొని ప్రమాణము చేయుట లోకప్రసిద్ధము - ముఖము చంద్రతుల్య మనుట), హరికిన్ = విష్ణునికి (సింహమునకు ననియు), (హరిసాక్షి యని ప్రమాణము చేయుటయు, నడుము సింహమునడుము వంటి దనియు భా.), సవతు = సమానము, తమ్ములన్ = సహోదరులను (తామరలను అనియు), (శిశువులను దాఁటి ప్రమాణము సేయుట ప్రసిద్ధము-కన్నులు తామరలవంటి వనియు భా.), ధర్మంబుపైన్ = పుణ్యముపైని (వింటిపై అనియు) - (కనుబొమలు వింటివంటి వని భా.)

తే. ఉప్పు నైనట్టిచక్కరలప్పు లీడె?
చేఁదువగ గలయమృతంపుఁజెలమ యొనయె?

పుల్ల నుండెడి తేనెకరుల్లు సరియె?
వనిత కడుఁ దియ్య నౌసిదువాతెఱకును ౨౦౪.

టీక.—వాతెఱకుఁ = అధరమునకు, ఉప్పనైనట్టి = గొప్ప, చేఁదువగ = ముంచుకొను క్రమము, పుల్లఁ = పుడకయందు, కరుల్లు = తెట్టెలు. చిత్రాంగి మోవిముందఱ చక్కెర భక్ష్యము లుప్పని యనియు, అమృతపుఁజెలమ చేఁదు అనియు, తేనెతెట్టెలు పులుపుగా నుండు ననియు, భావము.

క. మతిసమ్మోహ మొనర్పుట, నతిమధురిమ సారెఁ జిలుక నరిలంచుట, నో
లతకూన, నీదుమోవికిఁ । బ్రతి బింబమె కాక లేదు ప్రతిబింబ మిలన్.

టీక.—ఇందు బింబఫల ధర్మములు శ్లేషచేత మోవియందుఁ జెప్పఁబడినవి, సరిఁ జూచుకొనవలయును.—మతిన్ = మనసునకు, సమ్మోహ మొనర్పుటన్ = మిక్కిలి వలపుఁగొలుపుటచేతను (సమ్మోహ మనఁగా కడు మూఢతయు – బింబము మూఢత గల్గించును-('సద్యో బుద్ధి హరం బిమ్బం, సద్యో బుద్ధికరీ వచా.'), అతిమధురిమన్ = మిక్కిలి తీపుచేతను, సారెన్ – పలుమాఱు, చిలుకన్ = చిలుకుటచేతను (శుకమును అని బింబపరము), అలరించుటన్ = సంతోషపఱుచుటచేతను, ఓ లత కూన = తీఁగవంటి పిల్లా చిత్రాంగి (లేఁదీగా అనియు), నీదు మోవికిఁ బ్రతి = నీయధరమునకు సాటి. బింబమె కాక = దొండపండు తప్ప, ఇలన్ = భూమియందు ప్రతిబింబము = ఇతరవస్తువు, లేదు.

సీ. అతివ, నీమోవి ముద్దాడఁ గల్గినఁ జాలు,
దివ్యామృతంబు సిద్ధించినటుల,
తొయ్యలి, నీపైటఁ దియ్యఁ గల్గినఁ జాలు
దుర్గాధిపత్యంబు దొరకినటుల,
ముదిత, నీమొలనూలు ముట్టఁ గల్గినఁ జాలు
భూలోక మంతయు నేలినటుల,
యలివేణి, నీనీవి యంటఁ గల్గినఁ జాలు
నలమూలధనము నా కబ్బినటుల,
యింతమాత్రము సేయవే యిందువదన,
తాళఁ జాల మనోజాగ్నిఁ దలిరుఁబోణి,
మనవి చేకొను మింక నైన మందయాన,
యేల దయఁ జూడవే నన్ను లోలనయన? ౨౦౬.

టీక.—ఇట పెద్దపాదములయందు, వరుసగా, మోవికి అమృతము, పాలిండ్లకు దుర్గములు, నితంబమునకు భూమండలము, పోఁకముడికి మల్లెయు సాటి యని ధ్వని. తనకు దేవత్వము, దుర్గముపై దొరతనము-(దుర్గయనం బార్వతిగావున) శివత్వము,చక్రవర్తిత్వము, కుబేరైశ్వర్యమును వచ్చినట్లు, అనియు భా. నీవి = పోఁకముడి (మూలధన మనియు.)

క. కుటిలాలక, నీగుబ్బలు। బటువులయి మొగాని కెగయు, బంగరునిగ్గుల్
పోటుమరిలుఁ, బుట్టచెండ్లౌ; । నటుగా దేనింత పట్టి యాడుదునఁటవే?

తే. మదవతీమణీ, రాలతో మాట లాడుఁ
గదవె నీవ్రటువమెఱుంగు గబ్బి కులుకు
టిఱుకు సిబ్బెపు గుబ్బ పాలిండ్లు దెలియ;
నీవు మా కోడ కుండెడి దేమి చెపుమ. ౨౦౮.

టీక.—కుచములు రాలను నిందించును - అనఁగా - రాలవలె కఠినము లని భా.

శా. ఏమే, పల్కవు మోహనాంగి? యిటు లేలే యల్క చిత్రాంగి? ని
న్నే మంటిం గలకంఠి? నావలనఁ దప్పేమే యొయారీ? యయో!
నామీఁదం దయ లేదఁటే చెలి? నను న్మన్నింపవే కోమలీ.
నీమాటల్ జవదాఁటఁ కుందుఁ గదవే నీకేజపత్రేక్షణా. ౨౦౯.

క. ఇంతీ, మదనునిపట్టపు। దంతీ, యొసపరి మిటారి తండములో మే
ల్బంతీ, యేమే? రతిపూ।బంతీ, దయఁ జూచి నన్ను బ్రతికింపఁగదే!

టీక.—దంతీ=ఏనుఁగా. ఒసపరి మిటారి తండములోన్ = రూపవతులైన ఎక్కువ స్త్రీయల సమూహములో.

వ. అని బహుప్రకారంబులఁ బ్రార్థించి. ౨౧౧.

క. ఏ మనిన విననియగ్గజ। గామినియలు కార్పఁ దరము గామిని నృపతి
గ్రామణి సాఁగిలి మ్రొక్కెను.।గాముకులకు నెగ్గు సిగ్గుఁగలవే యొందుర్!

క. ఆ నతిఁ గైకొని యాతని। యానతి మీఱనిది వోలె నత్తటిఁ జిత్తం
బూనినకపటము నెఱపం।బూనినదై యాగయాళి బూమెలు మెఱయన్.

టీక.—నతిన్ = నమస్కారమును. ఆనతి = ఆజ్ఞను. ఊనిన = ఆవహించిన. బూమెలు = మాయలు.

క. ఒడలు వసివాళ్లు వాడన్,। వెడయూర్పు నిగిడ్చి, మెల్లనె కరాంబుజ మ

య్యెడ నూఁదిలేచి, బడిబడి బుడిబుడియేడుపు లెసంగ భూవరుతోడన్.

టీక.—వసివాళ్లు వాడన్ = మిక్కిలి ఆయాసము పొందఁగా. ఊఁది = ఊనుకొని. బడిబడిన్ = పలుమాఱు. బుడిబుడియేడ్పులు = ఆఁచి యాఁచి యేడ్చు నేడుపులు.

తే. నిబ్బరిక మేది విను మేదినీవరేణ్యా,
నీ వరణ్యమునకు వేఁట పోవఁ బ్రొద్దు
గడప లే కెందుఁ, జేతఁ జిల్కఁ గొని దాని
చేత నే నటు లుబుసుగాఁ జెలఁగునంత. ౨౧౫.

టీక.—నిబ్బరికము ఏది = స్థిరతను కోలుపోయి. మేదినీవరేణ్యా = ఓరాజా. ఉబుసుగాన్ = ప్రొద్దుపోవునట్లు.

క. సూరెల ముదికొముదిసిం
గారము గార మయి, పాముకస్వాలె మెఱుఁగుల్
వాఱు చెలువారు నొకతెలి
పారువ మిట వ్రాలె వెరఁగువడి వడిఁ జూడన్. ౨౧౬.

టీక.—సూరెలన్ = పార్శ్వములందు. ముదికొముది = పండువెన్నెలయొక్క.

ఉ. రింగులవల్లెవాటు సవరించి, మెయిన్ మృగనాభి నించి, వే
భంగులనీటు వెట్టి, యలపార్శ్వముఁ బట్టు నెవంబు వెట్టి, సా
రంగధరుండు నేమము దొఱంగుమదిం జనుదేరఁ, గొంకు మీ
ఱం గడకేఁ దొలంగి వడి రాఁ గని, రాగనిమగ్నచిత్తుఁడై. ౨౧౭.

టీక.—రింగుల = కుచ్చెలుగల. మృగనాభి = కస్తూరి. వేభంగులనీటు = అనేక శృంగారములను. నేమము దొఱంగు మదిన్ = నీతి దప్పెడు పూనికచేత. కొంకు = సిగ్గు. ఏన్ = నేను. రాగనిమగ్నచిత్తుఁడై = వలపునందు మునిఁగిన మనసుగలవాఁడై.

ఉ. ఎక్కడ నేర్చెనో నలువ యీచెలువన్ సృజియింపఁ? జూడ మీ
చక్కనిమేను నీమెఱుఁగుఁజన్గవ యీనగుముద్దుమోము నీ
చెక్కులకాంతు లీపిఱుఁదుచెల్వము నీనునుఁగౌనుతీరు నీ
చొక్కపుఁగొప్పు నీతళుకుఁజూపులు నీకలహంసయానముల్. ౨౧౮.

తే. అని వయఃస్మయవిస్మయాయత్తుఁ డగుచుఁ,
జిత్తజవికార దుర్వార చిత్తుఁ డగుచు,

మరులునను జేరి నను( జీరి మత్తు( డగుచు,
ని ట్లనియె మానసనయహీనవృత్తు( డగుచు. ౨౧౯.

టీక.—వయః = యౌవనముయొక్క - స్మయ = మదముచేత - విస్మయాయత్తు(డు = ఆశ్చర్యమునకు స్వాధీనమయినవా(డు. చిత్తజ = మదన. దుర్వార = నివారింపరాని. మరులునన్ = వలపుతో. మాన నయ హీన వృత్తు(డు = అభిమాన నీతులను విడిచిన ప్రవర్తనగలవా(డు.

క. వనిత, గజనిమ్మపండ్లను। ఘనముగ నోరూర( జెప్ప(గా విందుము, నీ
చనుగుబ్బలయొయ్యారము। వినినప్పుడె వానిపులుసు విఱుగుం జుమ్మీ.

క. తళతళ మనువజ్రంబుల। తలతల మనునీదురదనతతిఁ బోలదె కా
యలచుక్కలనిగనిగ; యో। పొల(తీ, నీకాలిగోరు( బోలదు సుమ్మీ.

టీక.—ఓపొల(తీ ఆ నక్షత్రములకాంతి తళతళ ప్రకాశించు వజ్రములయొక్క (తలతలన్) తలలయందు (మను) ఉండునట్టి నీపలువరుసను పోలదు సరియే గదా, నీ కాలిగోటి నయినను పోలదుసుమా.

క. నీ కలికితనమునకు బి। బ్బోకశ్రీకిన్ వయోవిభూతికిఁ దల(పన్,
నీకున్ జేనికిఁ దగునే? । నాకు న్నీకుఁ దగుఁ గాక నాళీకముఖీ.

టీక.—నాళీకముఖీ=పద్మముఖీ. కలికితనమునకున్=చక్క(దనమునకు. బిబ్బోకశ్రీకిన్=శృంగార సంపదకును, వయోవిభూతికిన్=యౌవనముయొక్క ఐశ్వర్యమునకు.

క. నెమ్మేను గంధవహము, మొ
గమ్ము కళానిధి, యనంగకలితము నడు, మా
కెమ్మోవి మధువు, నాఁ గద;
కొమ్మా, యెటు లోర్తు, నేలుకొమ్మా నన్నున్. ౨౨౩.

టీక.—గంధవహము = తావిగలది (మలయమారుతము అనియు). కళానిధి = విద్యలకు తావు (చంద్రుఁడు అనియు). అనంగకలితము = శరీరముతో కూడుకోనిది (మన్మథుఁడు అనియు). మధువు = తేనె (వసంతుఁ డనియు). కామోద్దీపకు లగు మలయమారుత చంద్ర మన్మథవసంతులే నీస్వరూపముగా నున్నారు, ఎటులఁ దాళఁగలను- అనియు భావము.

సీ. నెఱిగొప్పు కొనగోర నివిరి చూచెద నన్నఁ,
జెలి, నీ వది ఘనంబు చేసికొనెదు;

గట్టిచన్గవ చేత ముట్టి చూచెద నన్నుఁ,
జెలి, యది యొకకొండఁ జేసికొనెదు ;
పసిగౌను పిడికిటఁ బట్టి చూచెద నన్నుఁ,
జెలి, యది గగనంబు చేసికొనెదు ;
మించుమే నటు కౌఁగిలించి చూచెద నన్నుఁ,
జెలి, యది బంగారు చేసికొనెదు ;
తే. కొప్పు లెత్తిటు చూడవే యొప్పులాడి ;
యెంత దయలేనిదానవే యేణనయన ?
యాసపడువారి నెఱుఁగవే యలరుఁబోఁడి ?
చాటు కేఁగెద వేటికే జలజగంధి ? ౨౨౪.

టీక.—ఘనంబుచేసి కొనెదు, కొండచేసి కొనెదు, గగనంబుచేసి కొనెదు, బం
రు చేసికొనెదు. అనుమాటలకు - వెలలేని దాఁచుకోవలసిన వస్తువునుగా భావిం
కొనుచున్నావు - అని యర్థము. మఱియు, వరుసగా, కొప్పు మేఘమునకును, చనుఁగవ
ండకును, నడు మాకాశమునకును, దేహకాంతి బంగారునకును, సమ మనియు భా.

అనుచు నాకేలు వట్టినయప్పు డధిప,
యేమి చెప్పుదు, నానగు లీశ్వరుండ
యెఱుఁగు, నాసిగ్గుఁ గాచువా రెవరు లేక,
మిట్టి మీఁ నై పడి చెనంటి నిట్టు లంటి. ౨౨౫.

టీక.—చెనంటిన్ = ధూర్తుని.

ఓరీ, నాపతి లేనిచో భయము లే కొక్కింత శుద్ధాంత మొ
య్యారం బేర్పడఁ జొచ్చి, నన్నుఁ గని, కామాంధుండ వై ప్రేలె దీ;
వారాజన్యునిసొమ్ము ప్రాయమును నాప్రాణంబుఁ; బో మ్మూరకే;
యీరీతిన్ పినతల్లిఁ బట్టినఖలుం డెచ్చోఁ గలండే మహిన్ ! ౨౨౬.

టీక.—శుద్ధాంతము = అంతఃపురమును.

అనినం గామవికారము। నను బలిమిం గౌఁగిలించి నఖముల వ్రచ్చెన్
జనుఁగవ; మఱం జేకంకణ। మున కద్దం జేల ? చూడుము, మహీపాలా.

వ. అని రయంబున నాఖండల భుజాగ్ర మండలాగ్ర ధారా నవవిదారి
త ధరాధరావరణధారాధరంబునుం బోనిపయ్యెద చెఱంగు మఱుంగు
వాయం దిగిచి యయ్యెడ. ౨౨౮.

టీక.—ఆఖండల = దేవేంద్రునియొక్క - భుగాగ్ర=భుజశిరసుమీఁద నుంచు
కొన్నటువంటి - మండలాగ్ర = వజ్రాయుధముయొక్క - ధారా = అంచుచేత-విదా
రిత = భేదింపఁబడిన - ధరాధర = పర్వతములకు - ఆవరణ = మాఁతగానున్న - ధా
రాధరంబునుం బోని = మేఘమువలెనున్న.

క. కుమ్మెలు దాఁకినబంగరు। బొమ్మరములయెమ్మెఁ గడకుఁ బొమ్మనురేఖా,
సమ్మిళిత స్తనకుంభత। టమ్ము దిటమ్ముగను జూపి డగ్గుత్తికతోన్. ౨౨౯.

టీక.—కుమ్మెలు దాఁకిన = బీటికలు వాఱినటువంటి. దిటమ్ముగన్=దృఢముగా.

ఉ. ఇం తపకీర్తి గాఁగ, ఘటియింతునె ప్రాణ? మ దెంత? యీవిధం
బంతయు నీకుఁ దెల్పుటకు నై యిట నుండితి. నీదుపట్టి న
న్నింతట నుండి బట్టి రమియించినయప్పుడె మాను నైతి. నీ
కింతటనుండి కోడలఁ జుమీ నను ముట్టకు రాజశేఖరా. ౨౩౦.

తే. కలికి రత్నాంగి నీకులాంగన రమించు
మించుమేడకు నరుగు; మమ్మెఱుఁగుఁబోఁడి
పోఁడిమిగ నిన్ను రతిఁ దేల్చి పొందఁ జాలుఁ;
జాలు! నాతోడి గొడవ నీ కేల యధిప ? ౨౩౧.

టీక.—రమించు = విహరించునట్టి - మించుమేడకున్ = గొప్ప యుప్పరిగకు.

చ. అని, యపు డంతఁ బోక, మఱి యాయన్నతోదరి రాజుచేత నుం
డిన బెడిదంపుఁజాయల పిడెం బొర వెళ్ల జరీన దూసి, గొ
బ్బున మెడమీఁదఁ బెట్టుకొనఁ బోవ, నహా! యని సంభ్రమించి మిం
చినతదమిఁ బట్టి, యింతపని సేయుదువా మదిరాక్షి నీ? వనన్. ౨౩౨.

టీక.—బెడిదంపుఁ జాయల = అధికకాంతులుగల - పిడెంబు = బాఁకును.

క. ఔఁ దల ధరణీపాలక;। యాఁ! దలవం పాయె నిప్పు డందఱలో నె
చ్చోఁ దలపెట్టక; నెన రిఁ చ్చోఁ దలపెట్టకటు విడువు;చూతువునన్నున్.

టీక.—ఔన్=ఇంతపని సేయుదును. తల=తలఁగును. ఔన్ = ఆశ్చర్యము.

ఎచ్చోటఁ దలపెట్టక = ఎచ్చటను తలచూపక యుండునట్లుగా. వెనుక ఇచ్చోటఁ దల పెట్టక = ప్రీతి నాయందు తలంపక.

క. అని, మరుబాములఁ బడలే
నని, కైదువు దుస్సి, దాఁటునాయితముబలెఁ
బెనఁగునలయుటియచేసురి
యు నులిమి బలిమి విడిపించి యను ననురక్తిఁ. ౨౩౪.

టీక.—దాఁటు నాయితముబలెఁ = చచ్చుటకు ప్రయత్నమువలె. అలయుటియచే = ఆదిట్టచేతి - సురియఁ = కత్తిని, నులిమి = ఒడిసి.

క. నిన్ను మానము గొను హీనుని
ననుమానము మాని నూసుఁ డనుమోహముచే
తను మాఁడక తునుమాడుదు
వినుమా యణుమాత్రమధ్య ; వెత వీడ్కొనుమా. ౨౩౫.

వ. అని బరవసంబుగాఁ బలికి, యక్కలికి నూఱడించి, మఱ డించినకో
పాటోపంబున నచ్చోటు వాసి, మాటువాసి గలరాజమహేంద్రవాసి
యుగ్రాకారుం డై మండుచు సభామండపంబున కేతెంచి, బద్దలవారి
నలుగడలం బంచి, యాప్తామాత్యబంధుజనంబులం దగినవారల రా
వించి, యథోచితాసనంబుల నుండ నియమించి, కొండొక సేపు చిం
తించి, కొంత సంకోచించి, చెప్పక దీర దని నిశ్చయించి, చిత్రాంగి
తన కెఱింగించిన తెఱంగును జెయ్వులకరణియుం దనకన్నసరణియు
నామూలాగ్రంబుగాఁ దెల్పి, యింక నెయ్యది కర్జం బనిన ; సభ్యు
లందఱు డెందంబుల విస్మయంబును సంశయంబును బాపభయంబును
బెనఁగొన, ముందు వెనుక దెలియక, బహిర్లిఖిత చిత్రాకారంబుల
ప్రకారంబున నిశ్చేష్టితు లై, హా! యనక హూ! యనక, నూరకు
న్న యెడ, నందు నయార్ణవుం డనుమంత్రిపుంగవుం డిట్లనియె. ౨౩౬.

టీక.—బరవసంబుగాఁ = నమ్మకముగా. బద్దలవారిఁ = వేత్రహస్తులను. జెయ్వులకరణియుఁ = కార్యముల విధమును. బహిర్లిఖిత చిత్ర ఆకారంబుల ప్రకా

రంబునన్ = వేలుపల వ్రాసిన చిత్తరువు రూపములవిధమున.

తే. ఘోర మగుపాతకం బిది; నోర నుడువ
రాదె కా, మదిఁ దలఁపంగ రా దొకరికి;
నిట్టి యన్యాయ మేజాతి నెన్నఁ డైనఁ,
దొంటికతలందుఁ జెప్పఁగా వింట గలదె! ౨౩౭.

మ. తననీటు ల్తెలియన్ రయం బడరఁ దొల్తన్ రాణివాసంబులోఁ
జనుటే నేరమి యౌఁ గదా; సవతి యీర్ష్యం బట్టి చంపింప నే
ర్పున నీకై వడి మాయ వన్నినది, హా హా మ్మంటివా? యామె కీ
కనుమానంబు దొలంగఁ దెల్పఁ గద యూహాపోహ లిం కేటికిన్.

చ. అలఘుప్రాభవ, యింక నీకొలము రాజ్యం బేమి గా నున్న దో?
తొలఁగెన్ గీర్తి; భవత్ప్రతాపబలముల్ దూరీకృతం బయ్యె; న
క్కులకాంతార కుఠారకుం దనయుఁ డన్ క్రూరిన్ గృపం జూచి భూ
స్థలిలో వెల్వడఁ గొట్టన ట్టయిన, నాజ్ఞల్ జబ్బు దాఁకున్ బయిన్.

టీక.—అక్కులకాంతార కుఠారకున్ = వంశమనెడి యడవికి గొడ్డటివంటి వాఁడగు నా సారంగధరుని. జబ్బు దాఁకున్ = మంద మగును.

క. జననిం దొడరినపాపా
త్ముని గొబ్బునఁ బట్టి తెచ్చి తునిమింపఁ దగున్;
పని లే దిఁక సంకోచము;
మనుజాధిప, కార్య; మనుడు; మతిమంతుఁ డనున్. ౨౪౦.

టీక.—కార్యము = చేయవలసినది.

తే. అధిప, యిది శాస్త్రమతముగా దరసి చూడ,
ధనము వ్రేయిన, ఘనమనస్తాప మయిన,
నొకటి తనయింట దుశ్శీల మొదవిన, నది
బయలు సేయంగఁ దగ దనునయము గలదు. ౨౪౧.

చ. చనవున నొక్కవేళ రభసంబున మెయిన్ బినతల్లులిండ్లకున్
దనయులు ప్రేమతోఁ జనుట తప్పగునే? తమచేయుతప్పు తె

ల్లను మగవారిపై నిడి చలంబున బొంకొనరింతు రెందు; జ
వ్వనులమనోగతు ల్దెలియువా రిల నెంతటివారు గావలెన్? ౨౮౨.
మనమున నిడు టొక్కటి, వెలి
నను టొక్కటి, సేయు టొకటి, యంతయుఁ గపటం
బె నిజంబు లే దొకింతయు,
నన్నృతోదరి యనుట సార్థ మతివకుఁ జెల్లున్. ౨౮౩.
టీక.—అనృత ఉదరి = అబద్ధమే గర్భమందుఁ గలది (నడుము లేనిది, సన్న నిన డుము గలది అనియు భా.)
మ. అనిశక్రౌర్యము కల్కిచూపులనె కా, దత్యంతకాఠిన్య మ
గనపాలిండ్లనె కాదు, చాపలము స్త్రీకందోయినే గాదు, త
గ్గనికౌటిల్యము బోటిముంగురులనే కా, దెల్ల నుల్లంబునం
దును వేటాడుచు నుండుఁ నిక్కమిది యొందున్నమ్మరా దింతులన్.
జనకు నయిన, సోదరు నై
నను, సుతు నైన, నొకపరిఁ గనం దరుణులకున్
దను పెక్కను లజ్జాపద;
మని హరితో ద్రుపదపుత్త్రి యనెఁ గద తొలుతన్. ౨౮౫.
ఓనృప, నాకుఁ జూడ నలయుగ్మలి నీసుతునిన్ మనోహరా
నూనవిలాసుఁ జూచి నిలుపోపకఁ బట్టిన, లోను గామి, నెం
తే నెగు లూని వానిఁ బొలియింపఁగ మాయలు వన్నె నిట్లు కొం
డేనకు; ధర్మరాజులను నిక్కముగా మిముఁ జెప్ప నేటికిన్? ౨౮౬.
టీక.—నెగులు = దుఃఖము. ధర్మరాజులను మిమ్మున్ = ధర్మరాజువంటి నిన్ను.
పొలఁతుక మీకుఁ గానఁబడఁ బొందుగఁ దెల్పినదే నిజంబుగాఁ
దలఁచెద రీ; ర దెంతయును దబ్బర సూ. 'మగవాఁడు బొంకెనా,
యల దడి గట్టినట్టు లగు; నాఁడుది బొంకిన గోడ వెట్టిన
ట్లలవడు.' నన్నమాట వినరా వనరాశిపరీతభూభుజా? ౨౮౭.
టీక.—వనరాశి పరీత భూ భుజా=సముద్రముచేత చుట్టఁబడిన భూమిని ఏలువాఁడా.

తే. ఇలఁ జెఱువు మూయ మూఁకుఁడు గలదు గాక,
నోరు మూయంగ మూకుఁ డెందులనుఁ గలదె?
యొరు లనుట కేమి? సారంగధరునిమీఁద
నాకు సంశయ మొదవ దో నరవరేణ్య. ౨౮౯.

క. ఏతన్మాత్రుఁడె చేతో । జాతారికృపాకటాక్షజాతుఁడు సుగుణా
న్వీతుఁడు? తెలియక యాడెద। రాతని కటువంటిగుణములా నరనాథా!

టీక.—ఏతన్మాత్రుఁడె = ఇట్టిసామాన్యుఁడా. చేతోజాత = మన్మథునికి - అరి = శత్రువైన శివునియొక్క - కృపా కటాక్ష జాతుఁడు = దయా దృష్టిచేత పుట్టినవాఁడు.

క. చెలిమాటలకై తోడ్తోబడి
ఖలుఁ డని సుతుఁ దునిమి తేని, కైకకొఱకుఁ గా
నలకు రఘురాము ననిచిన
యలదశరథుమాడ్కిఁ బిదప నడలుదువు సుమీ. ౨౯౦.

వ. అని పలికిన, మొగంబులు దెలివొంది కొలువువా రెల్ల మతిమంతుం గొనియాడిరి. నృపాలుం డిట్లు నానాప్రకారంబుల మంత్రుల నొరసి యడుగ వార లాడునుడువులకు నుత్తలఁపడుచున్నంబున నాగ్రహ నిశ్చయం బిద్ది యన నేరక, యపారమోహసాగరంబున మునింగి తనలోన. ౨౯౧.

టీక.—ఉత్తలఁపడఁగ = మిక్కిలి వ్యాకులపడుచున్న.

క. ఇటు చూచినఁ జెలిపైఁ ద
ప్పటు చూచిన సుతునిసేర, మవ్వఁగా దనఁగా
నెటువలె వచ్చునో మీఁదట?
నటమటమో లేక నిజమొ యది తెలుఁగముగా. ౨౯౨.

టీక.—అటమటము = అసత్యము.

ఆ. అల్లనీళ్ల లోనిముల్లయినది యిది,
యిట్టు లనుచు నిశ్చయింప రాదు,
కప్పి పుచ్చ రాదు, ఖండించి యాడరా,
దేమి సేయువాఁడ నింక ననుచు. ౨౯౩.

క. వ్రాలినతెప్పలు, వెతఁ గ్రా
వ్రాలిన హృదయాంబుజంబు, వసుమతిమీఁదన్
వ్రాలినచూపులు, మొగమున
వ్రేలంగను, ముక్కుమీఁది వ్రేలుం దనరన్. ౨౫౪.

క. ఉన్నంత నృపాలున కని
యె న్నీతిజ్ఞుఁ డనుమంత్రి యీ మతిమంతుం
డెన్నిన ప్రకారమున నే,
యన్నులు చపలాతిచంచలాత్మలు సుమ్మీ. ౨౫౫.

టీక.—అన్నులు = స్త్రీలు. చపలా అతిచంచల ఆత్మలు = మెఱుపుకంటెను మిక్కిలి చాంచల్యముగల స్వభావముగలవారు.

క. తనకల్ల తెలుపదే కద
మన కల్లలితాంగి, బుద్ధిమంతు నొకని నే
ర్పున మెల్లన రాకొమరుని
మన మెల్లను దెలిసి చూడ మాన మొంపఁ దగున్. ౨౫౬.

వ. అనిన మతిమంతుం డందుకొని యవ్విభున కిట్లనియె. ౨౫౭.

చ. మిగుల దృఢంబు చేసి కద మీ రడుగం దగ; వేడఁ జెల్లు, ని
మ్మగువ నె యందు నిక్క మగుమాటకు నిం దడిగింపుఁ, దూరకే
బెగడుకుమారు నాఱడిని బెట్టఁగఁ జెల్లునె? వింట లేదె, 'యిం
ట గెలిచి రచ్చ గెల్వు' మనునానుడి? నానుడి నానుఁడీ చెవిన్.

టీక.—తగవు=న్యాయము. ఏడఁ=ఎందును. బెగడు=భయపడెడు. ఆఱడిన్ = పకీర్తిని. నానుడిన్ = సామెతను. నానుడిన్=నావాక్యమును. ఆనుఁడీ = పూనుఁడు.

మదిరాక్షుల నమ్మకు, నయ్య
ఏదుఁడవు గద, వేగిరంబు నెరవరిఁ జెలుచున్,
బదరకుమీ, లెస్స పదిం
బదిగ విచారించి సేయ మంచిది సుమ్మీ. ౨౫౯.

టీక.—నెరవరిన్ = నేర్పుగలవానిని. పదరకుమీ = కోపపడకుమీ. పదింబది

గఁ = అన్నివిధములచేతను చక్కఁగా.

క. అనవుడు జనపతి యడుగం
బనిపిన నే మాయె, దోసమా? ని ప్పనినం
తనె నోరు పొక్కదు గదా!
యనిపి యటుం దెలిసి చూత మని కడు వేగఁ. ౨౬౦.

క. సడిసన్న పెద్దవారలఁ
గడఁకఁ దగువారిఁ బిలిచి, 'కల్ల గలిగినఁ
నుడువులవలననె కానం
బడుఁ గద, తెలియుఁ' డని పెట్టి పంపిన, వారల్. ౨౬౧.

టీక.—సడి సన్న = చిహ్నములనుబట్టి నిజము నూహింపఁగల.

సీ. కల నైనఁ బరకాంతఁ దలయెత్తి చూడఁడు,
పడుచువారలఁ గూడి నడువఁ బోఁడు,
మిగుల సిబ్బితికాఁడు మొగమోట గలవాఁడు,
పలికి బొంకఁడు బహుభాషి గాఁడు,
నేర్చినవారిని నేరనివారినిఁ
దనవారిఁగాఁ జూచువినయపరుఁడు,
కినిసి యెవ్వరిని నొచ్చెడుమాటఁ బలుకఁడు,
కపట మెఱుంగఁడు గర్వి గాఁడు,
తే. మేరమానిసి, సా, దుపకారి, గోల,
నిర్మలుం; డట్టివానికి నింద మోవ
జేసెఁగా విధి! కటకటా! దోసకారి!
దయ్యమున కేడ సత్యంబు దలఁచి చూడ. ౧౬౨.

టీక.—సిబ్బితికాఁడు = సిగ్గుగలవాఁడు. మేరమానిసి = మర్యాదకలవాఁడు. గోల = పసివాఁడు.

తే. అనుచుఁ దమలోనఁ గడు నొచ్చుకొనుచుం బనుల
సొగ సొగసును గలనృపసూనునగరి

కేఁగి యువరాజునకుఁ దమ్ము నెఱుక సేయుఁ
డనిన, నవసరములవారు నపుడె పిలువ. ౨౬౩.

టీక.—పనులసోఁగ = పనులయొక్క చెల్వము. అవసరములవారు = సేవకులు.

క. చని గని మ్రొక్కిన, మితపరి
జనయుతుఁ డగురాజసుతుఁడు సవినయమతి యై
తనకడ్డెసరస నుచితా
సనయుక్తులఁ జేసి యనుఁ బ్రసన్నాననుఁ డై. ౨౬౪.

ఉ. వచ్చినకార్య మేమి? జనవల్లభుఁ డంపఁగ నన్నుఁ బిల్వఁగా
వచ్చితిరో? తగు ల్గలుగువారల కై మనవుల్ ఘటింపఁగా
వచ్చితిరో? వచింపుఁ డని వారల సారెకు వెల్లదమ్ములన్
మెచ్చనికన్నులన్ బెదరు మేకొన నెమ్మొగ మూఁచి పల్కినన్.

టీక.—తగులు = స్నేహము.

ఉ. భూరమణుండు మీకడకుఁ బొమ్మన వచ్చితి మయ్య. యెయ్యెడన్
మీరలు రాజకంటె నినుమిక్కిలి మా కనురక్తిమై మమున్
గారవలీలఁ బ్రోతు. రటు గావున నొక్కటి విన్నవింతు మో
భూరివివేక, వీరి నటు పొమ్మనుఁడా. యని యేకతంబునన్. ౨౬౬.

క. ఒకయించుక మదిఁ గొంకుచు
ముకుళితహస్తు లయి వినయమున 'రాజకుమా
రక, వెఱచి చెప్పుదుమొ వెఱ
వక చెప్పుదుమో' యటంచు వారలు పల్కన్. ౨౬౭.

క. ఇది యేమో యని యెదవడి,
యదవద యై, గుండె భగ్గు మని, తల్లడపా
టొదవఁగఁ, బలుకుల దీనత
గదురఁగ, 'నది యేమి దెల్పఁగదరయ్య.' యనన్. ౨౬౮.

టీక.—ఎదవడి = భయపడి. అదవద = కలఁత.

సీ. అవనీతలేశుఁ డల్లవనీతలమునకు
మొన్న వేటాడంగఁ జన్నపిదప,
నంగజాలలు గా దనంగఁ జాలఁ జలమ్ము
మీఱ మొక్కలమున మీఱ లలుకఁ
బారువమ్మును బట్టఁ బాఱునెవమ్మున
రాణివాసముఁ జొచ్చి, క్షోణిపతికిఁ
బ్రాణపదంబైన యేణాక్షిఁ జిత్రాంగిఁ గనుఁగొని,
మోహంబు పెనఁగొనంగఁ,
తే. దమకమునఁ బట్టినా రని తమ కడలుచు
నాపడంతుక దెల్పినఁ గోపగించి,
యమ్ము నిది యంతయును నిక్కువమ్ముగాఁగ
నడిగి రమ్మనె నిప్పు డప్పుడమిఱేఁడు. ౨౬౯.

టీక.—వనీతలమునకుఁ = అడవికి. అంగజాలలు = రాణివాసపుఁగావలివారు.
మొక్కలమునకుఁ = ముష్కరత్వముచేత. తమకుఁ = రాజుగారికి.

చ. అనిన నమశ్శివాయ యని, యక్కట! యెక్కడనుండి సంభవిం
చెను వినరానిపాప మిది! చెల్లరె! మాయలు వన్ని యీవిధం
బున నలయించె నాపయిని బూన్చెను నేరమిం. యింతగోఁతయుఁ
వినవలసెం గదా యిపుడు వీనుల కే మనువాఁడ దీనికిఁ? ౨౭౦.
క. ఆయమ్మ యాగ్రహం బెడఁ। బాయక నామీఁద విన్నపము చేసిన, భూ
నాయకుఁ డిది యాఁగా దన। కీమెడ నామీఁద నాగ్రహింపం దగునే?
గీ. తల్లి నామీఁద నట లేనితప్పు మోపె
నఁట, యల యనుంగుఁదండ్రి దా నదియె నిశ్చ
యంబు సేసె నఁట, యిఁకఁ గాదన్నఁ బోనె?
యేరి నన నేల కల్లరి నేనె యగుదు. ౨౭౨.
క. పాపాలిటిదైవముగా। భూపాలుఁ దలంతు నేను బొరపొచ్చెము తే
పిపట్టం జిత్రాంగిని నాపినతల్లివి దలంతు నాతల్లివలెన్. ౨౭౩.

క. ఇది యిటువలెఁ గా కెన్నఁడు
నెదలోఁ గొండొకవిచార మే నెఱుఁగమి కా
మదనారియె సాక్షి. యిఁకం
బదివేలును నేల పనికి మాలినమాటల్ ? ౨౭౪.

టీక.—కొండొక = వేఱు. మదనారి = శివుఁడు.

ఉ. ఏ నిఁక నేమి సెప్పిన మహీపతి బొంకుగ నెంచు; నెందు 'రా
జానుమతంబు ధర్మ' మని యంద్రు గదా బుధు. లైన నేమి? 'యె
ద్దీనె నటన్నఁ గొట్టమున నేర్పడఁ గట్టు' మటన్నచందమే
కానఁగ నయ్యె; నొక్కయుపకారము సేయుఁడు మీర లీయెడన్.

క. మీపది శంకాతంకం | బేమియు లేక, సభవార లెల్ల వినంగా,
నామాటలుగాఁ, గొన్ని, మ|హీమండలవిభునితోడ నెఱిఁగింపఁ దగున్.

క. 'మండలపతి తప్పొప్పులు | రెండు విచారించి తగినరీతి న్నీతిన్
దండన సేయఁగఁ దగు;ను|ద్దండము సేయంగ శుభముదలకొనదెందున్.

టీక.—నీతిన్ = నీతితో. ఉద్దండము = అధికదండనము.

గీ. మీర లన్నిట సడిసన్నవారు, దెలుప
వలదొకో నన్ను సడిసన్నవానిఁగా న్నె
నర్చుటకు, 'దైవసన్నిధానమునఁ బెట్టి
నిజము సేయించి పిదప మన్నింపు' మనుఁడు. ౨౭౮.

టీక.—సడిసన్నవారు = సన్మార్గులు. సడిసన్నవానిఁగాన్ = నిందితునిఁగా. నిజము = దివ్యప్రమాణము.

గీ. అనఘమతులార నన్నుఁ జిత్రాంగియెదుట
నునిచి తారకాణింపంగఁ గనఁగ, నట్టి
కల్ల నావల్ల గోరంత గలిగె నేని,
యాజ్ఞ కే నర్హుఁడను జుమీ, యని యనుండు. ౨౭౯.

టీక.—తారకాణింపంగన్ = నిదర్శన మగునట్లుగా.

క. కాదే వినుఁ డొక్కటి యిం
కాదేవిని 'గలది గలిగినట్టు దెలుపు, నీ

పైఁడే నేరము, జుణిఁగిన
గా దని యడుగు మనుఁ డామెఁ గట్టిగఁ దెలుపన్. ౨౮౦.

టీక.—జుణిఁగినన్ = డాఁచిన.

క. అటు మీఁదట జగదీశ్వర
ఘటనం బెటు లుండె నటులఁ గా కుండదుగా,
యి టనుం డని, వారికి నా
దటఁ దాంబూలంబు లిడి, యతం డపు డనిపెన్. ౨౮౧.

---

శా. దాక్షిణ్యాకరమూర్తి షోడశమహాదానాదిధర్మక్రియా
దక్షా యాశ్రితదీనరక్షణకళాధౌరంధరీసత్కృపా
వీక్షా శాశ్వతకీర్తివైభవరమాభృచ్ఛ్రేష్ఠసింహాసనా
ధ్యక్షా దుర్మదరాట్కిరీటదలనైకాక్షేయకౌక్షేయకా. ౨౮౨.

క. యాచనకవినుత వనితా । సేచనకతనూవిలాస శృంగారకళా
సూచనకక్రమకవితా । లోచనకందళితహర్షలోలుపహృదయా.

(స్రగ్విణి)

దుగ్ధవారాశివిద్యోతికీర్తి సుధా । భుగ్ధురీణామనాగ్భోగవర్తి దయా
దృగ్ధుతాశేషధాత్రీమరున్నిఃస్వతా । స్నిగ్ధసారస్వతస్నిద్ధసారస్వతా.

[ఈ మూఁడుపద్యముల యర్థమును విజయవిలాసటీకయందుఁ గనునది.]

(గద్య)

ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాదలబ్ధ ప్రసిద్ధ వాగ్వైభవ చేమకూరలక్ష్మణా
మాత్య తనూభవ సదారాధిత బుధసమాజ వేంకటరాజ ప్రణీతం బైన
సారంగధర చరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ
ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

---

శ్రీ

# సారంగధర చరిత్రము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీధుర్యశౌర్యధైర్య । శ్లాఘరమూర్ధన్య యాదిగర్భేశ్వర వి
ద్యాధిక వితరణదీక్షా । రాధాసుత యచ్యుతేంద్రరఘునాథనృపా. ౧.

వ. అవధరింపు మివ్విధంబున నవ్వసుంధరావరకుమారుం డగుసారంగధ
రుండు మంత్రిపుంగవుల ననిచి, యనివార్యధైర్యధురంధరుండై యుం
డె. నంత; ౨.

చ. అనిపినఁ బోయి వారు నతులైకవినీతిని నీతి దోఁప
నిట్లని—రవధారు ధారుణి నయంబున నేలెడిసామియానతిం
బనిచిన నక్కుమారుఁ గని మామదిలో ననుమాన మెల్లఁ బో
వను విశదంబుగా నడిగి వచ్చితి మయ్య యనేకభంగులన్. 3.

టీక.—అతుల ఏక వినీతిన్ = సాటిలేక ముఖ్యమయిన వినయముతో.

క. ఆధన్యుఁడు గాఁ డన్యుఁ; డ । సాధారణుఁ డతఁడు; దైవసన్నిధి నతని
శోధన చేసినఁ గాక, యశోధను డొం డొకటి దలఁపఁ జొప్పడ దింకన్.

టీక.—శోధన = పరీక్ష. యశోధన = కీర్తి యేధనముగాఁ గలవాఁడా.

క. మనవి గల దొకటి చిత్రాం
గిని యీమాటలు బెదరించి కినుకన్ నీవం
కనె తప్పిది, గట్టిగఁ జెప్పు
మన నృపులతోఁ దానెఁ దెలుపు నని యతఁ డనియెన్. ౪.

వ. అన విని మంచిదే యని, నృపాగ్రణి వారల నెల్ల వెంటఁ దో
డ్కొని, వేస రాణివాసమునకరిగి జననంగని, సాతి స్సజ ది

గ్గన దిగి, జాళువాపసిఁడికంబము చెంగట నిల్చి, ముగ్ధచా
ద్పున వసివాళ్లువాడు మొగముం గదియంగ ముసుంగు దాల్చుచున్.

క. కొనగోరఁ దీసి కాటుక। కనునీరు చుటుక్కు మనఁగఁ గడ మీటుచు వం
చినతల యెత్తకయుండెడు। నన్నృత్యోదరి కనిరి రాజుననుమతి వారల్.

మ. వనజాతేక్షణ, కేళికాకలరవవ్యాజంబునన్ వచ్చి, ని
న్నను సారంగధరుండు నీయతులసౌందర్యంబు వీక్షించి, మో
హనిమగ్నుం డయి బల్మిఁ బట్టె, నని మీ రన్నా ర్తరటం, చెల్లరు
న్వినఁగాఁ బల్కి కుమారునిం దెలిసి రండీ యంచు, రా జంపినన్.

వ. మే మానృపాలుకడకుం జని తద్వృత్తాంతం బంతయు నెఱింగించి;-
శా. పాపా! యోరి వివేకహీనమతి! ద్రోహీ! నందనుం డంచు ని
న్నేరా నమ్మిన దంతయుం గలిగె, నెం దైన న్నగర్లోనికిం
బోరో, రారొ, కొమాళ్లు వావివరుసల్ బుద్ధిన్ విచారింప కే
గారాబుంబినతల్లిఁ బట్టితివి యోగ్యం బే నినున్ జూడఁగన్!" ౧౦.

క. అనె, యనుఁ డని, యనుఁ డాగ్రహ
మున నంగారకునిచందమున మండుచు నుం
డిన వాఁ డని గట్టిగఁ జెపు
మని, మే మెంతయును దూఱ నతఁ డి ట్లనియెన్. ౧౧.

టీక.—అంగారకుని చందమునన్ = అగ్ని వలె.

మ. అవుతంగాఁ దనమీఁది నేర మివు డాహా! నాపయిం జూపెఁ; దం
డ్రిమనం బి ట్లెడ సేసనే! యయినఁ గానీ గట్టిగాఁ దెల్ప నా
యమనే యిం కొకమాటు మీ రడుగుఁడీ యన్యాదు గాఁగాను దో
సము సు మ్మెందు నిరాపనిందలు గడించుట; దెల్పు నీకల్గంబుగన్. ౧౨.

టీక.—నిరాపనిందలు గడించుట = అబద్ధపు నిందలు మోపుటవేత.

ఉ. అనవుడు, రాజుదిక్కు మొగ మైయలుకన్ గలకంఠి కంచు గీ
సినగతిఁ బెతెల్లుంగునను జిట్టుడుకుతుంగనునీరు సోన యై

చినుకఁగ నేడ్చి, 'యే లగడు చేసెదు రచ్చలఁ బెట్టి యింత, యో
వనధిగభీర? నాకు సరివారలలోఁ దలపంపు లయ్యెడున్. ౧౩.

టీక.—సోన = చిన్నవాన. అగడు = అల్లరి. రచ్చలన్ = సభలయందు. వనధి గభీర = సముద్రమువలె లోఁతయినవాఁడా.

క. మానముకన్నను హెచ్చౌ
ప్రాణ మని తెగింప, బల్మిఁ బట్టిటు సేయం
బూనితి; నగుఁబాటులు నా
కౌ; నీకే సిగ్గు గలుగ దఁట; నా కేలా ? ౧౪.

క. కందోయి చల్లగా నిటు/గం దోయిన్నపాల, తెన్నగా నిఁక నోకమా
అందఱముందఱ నీ, వ'ని/చిందఱవంద ఱయి గుట్టు చిట్టాడంగన్.

టీక.—చిట్టాడంగన్ = చలింపఁగా.

క. కయ్యానకుఁ గాల్ ద్రవ్వుచు
గయ్యాళితనంబు మీఱఁగా డగ్గఱి, యా
తొయ్యలి యూఁచకయాఁచక
పయ్యెద గొంగును బటాన బయలుగఁ జేసెన్. ౧౬.

టీక.—ఊఁచక ఆఁచక = తలయూఁపక నిదానింపక (వెనుదివియక యనుట). పటానన్ = తటాలున.

ఉ. ఆపగిదిం ద్రపారహిత యై కుచరేఖలు చూప; నందఱున్
'హా! పరమేశ్వరా!' యనుచు నొదల వంచిరి. జంత 'యింతయున్
నాపయిఁ దప్పె యా; నిదియు నాదియె యాతనిచేఁత యా నొకా
దో పరికింపుఁడా.' యనుచు దుప్పటి ముందఱఁ బెట్టి వెండియున్. ౧౭.

టీక.—త్రపా = సిగ్గు. జంత = గయ్యాళి. ఇదియున్ = ఈదుప్పటియును. చేఁత = పని.

క. 'కొడుకుపయి నీకుఁ గడుఁ బ్రే
ముడి గావునఁ గతకుఁ గాళ్లు మురతవఁ జెవులీ,
వడిదగెదవు, రాజ, నీకె
క్కడిదియభిమాన? మని పలుకఁ గొంతుం డలుకన్. ౧౮.

క. 'ఇది మాయాపట మనఁ గూ
డదు గద, యిఁక సంశయం బెడలఁ జూచితి రే
కద, పదపదఁ డ'ని యానయ
విదులం దోడుకొని వచ్చి విభుఁ డలసభలోన్. ౧౯.

టీక.—మాయా పటము = అబద్ధపు వస్త్రము. నయవిదులన్ = నీతివేత్తలను.

క. మాతృరిరంసాయుతుఁ డగు। పాతకి దండన మొనర్పఁ బరిమాణం బే
రీతిం జెప్పుఁ డని సద్బుధ।జాతములం గూర్చి యడుగ జననాథునితోన్.

క. విజ్ఞాపనం బొనర్చిరి। విజ్ఞానేశ్వరము చూచి విద్వజ్జను ల
య్యజ్ఞనికరచరణాదుల। కాజ్ఞ నిశావేళఁ జేయ నర్హం బనుచున్.

టీక.—విజ్ఞానేశ్వరమనునది ధర్మశాస్త్ర గ్రంథవిశేషము.

ఉ. ఆతఱి వారిమాట విని యట్లనె నిర్దయవృత్తి నమ్మహీ
నేత తలారులం బిలిచి 'నేఁడు సుతుం గొనిపోయి కాళ్లనుం
జేతులుఁ గోసి రం డ'నుచుఁ జేముదుటుంగర మిచ్చెఁ. గోపమే
చూతురుగాని బిడ్డఁ డని చూడరుగా ధరణీతలాధిపుల్. ౨౨.

టీక.—మహీనేత = రాజు.

గీ. పట్టి నట్టు లాజ్ఞ వెట్టఁ గట్టడి సేసి,
సరగ లోని కరిగి, శయ్య నొరిగి,
యినుఁడు దుఃఖవార్ధిన్ మునిఁగి యుండఁగ, వల్ల
యినుఁడు నంత వార్ధిన్ మునుఁగుచుండె. ౨౩.

టీక.—ఇనుఁడు = రాజు. ఇనుఁడున్ = సూర్యుఁడును. వార్ధిన్ = సంద్రములోన్.

గీ. ప్రామినుకుమానికమ్ములు భార మైనఁ
దరణి శరనిధి మునుఁగఁగా సరగఁ దిగిచి
వేయఁ బోల్ పైవసుతతి నారాయణుండు,
కాకది కృపీటజాతాప్తిఁ గాంచ నేమి? ౨౪.

టీక.—ప్రామినుకుమానికమ్ములు = వేదశ్రేష్ఠములు (మిక్కిలి కాంతిగలరత్నము
లని యర్థము), భార మైనన్ = బరువుకాఁగా, తరణి = సూర్యుఁడు (ఓడయని యర్థము), శర

నిధిన్ = సముద్రమందు, మునుఁగఁగాన్, నారాయణుండు = విష్ణువు (ఓడవాఁడనియు), పైవసుతతిన్ = మీఁదికిరణ సమూహమును (మీఁదనున్న ధనసమూహమును అనియు), సరగన్ తిగిచి వేయఁ బోలున్ = శీఘ్రముగా తీసివైచెను కాఁబోలు, కాక = అటు గాదేని, అది = ఆవసుతతి, కృపీటజా తాప్తిన్ = అగ్నిసంబంధమును (జలసమూహసంబంధమును అనియు), కాంచనేమి = పొందనేల; (సాయంకాలమున సూర్యతేజము అగ్నియందు ప్రవేశించు నని శ్రుతులయందుఁ జెప్పఁబడియున్నది.)

చ. గగనపయోధి దాఁటి రవిగంధవహాత్మభవుండు రేయియ
జ్జగతికుమారియంతికమున రభసంబున నిల్చి, 'వచ్చు సో
యగమున రామ చంద్రుఁ డ'ని యాయపరాంబుధిలంకఁ జొచ్చి పె
ల్లుగఁ దరికొల్పునగ్నిశిఖలో యన సంధిలె సాంధ్యరాగముల్. ౨౫.

టీక.—రవి గంధవహాత్మభవుండు = సూర్యుఁడనెడు హనుమంతుఁడు, గగన పయోధిన్ = ఆకాశమనెడు సముద్రమును, దాఁటి, రేయి అన్ = రాత్రి యనెడు - జగతికుమారి = సీతయొక్క - అంతికమునన్ = సమీపమునందు, రభసంబునన్ = వేగముగా, నిల్చి = నెలకొని, రామ = ఓచెలువా - లేక - రామ = మనోహరుఁడయిన - చంద్రుఁడు = నిశాపతి (యనెడు) - రామచంద్రుఁడు = శ్రీరాములు, సోయగమునన్ = సొంపుమీఱఁగా, వచ్చున్ = విచ్చేయును, అని = ఈలాగని, ఆయపరాంబుధిలంకన్ = ఆపశ్చిమసముద్రమనెడి లంకాద్వీపమును, చొచ్చి = ప్రవేశించి, పెల్లుగన్ = అధికముగా, దరికొల్పు = కాల్చినటువంటి, అగ్ని శిఖలో = అగ్ని జ్వాలలో, అనన్, సాంధ్యరాగముల్ = సంధ్యాకాలరక్తిమములు, సంధిలెన్ = తగులుకొనెను.

గీ. లోకములకంట నలమ వేళాకృశాంగి
మిహిరకరరస మూనినమిన్ను పెంచుఁ
గదియ సాంధ్యవిభాదీపకలిక యిడఁగఁ
బడినకాటుక యనఁ దమఃపటలి నెఱసె. ౨౬.

టీక.—వేళా కృశాంగి = కాల మనెడు స్త్రీ, లోకముల = జనములయొక్క - అలమన్ = పూయుటకు, మిహిర కర రసము = సూర్యకిరణములనెడు పసరును, ఊని = పట్టించిన - మిన్ను పెంచున్ = ఆకాశమను పెంకును, కదియన్ = ఒరయునట్లుగా, సాంధ్య విభా = సంధ్యా కాంతియనెడు - దీపకలిక = దీపమును, తమఃపటలి = అంధకారసమూహము, నెఱసెన్ = వ్యాపించెను.

క. చవుదంతి వియన్నదిలో
నవగాహ మొనర్చి చల్లునలవమధులో నా,
దివి యలచుక్కలచేఁ దగ,
దివియలవారిఁ గొని యపుడు తెగువఁ ధలారుల్. ౩౭.

టీక.—చవుదంతి = ఐరావతము, వియన్నదిలోన్ = ఆకాశగంగలో, అవగాహము = స్నానము, అల వమధులో నాన్ = ఆతొండపు దుంపురులో యనునట్లుగా, దివి = ఆకాశము, అలచుక్కలచేన్ = ఆనక్షత్రములచేతను (ఆబొట్టులచేతను అని స్వారస్యము), దివియలవారిన్ = దివిటీలవారిని.

సీ. రాగిదేరెడుచొకారపుసీలిచల్లడం
బులడంబు చీఁకట్ల బలము సేయఁ,
గోఱమీసములపైఁ గోపోగ్రరసములు
చిందు ద్రొక్కఁగ మొగాల్ జేవుటింప,
మృత్యుదంష్ట్రలనంగ మేలైనలోవంక
కత్తు లున్నతభుజాగ్రముల మెఱయ,
నల్లుకుమానుసులగుండెలు గుభుల్లన ఘల్లు
రను మ్రోఁతగుదెలు పేటాడుచుండ,

గీ. పీఁకె వెట్టి యీల వెట్టుచు బడిబడిఁ
బాఱు తెంచి చుట్టువాఱుకొనిరి
దివ్యరత్ననికరదేదీప్యమాన మై
యతిశయిల్లు రాజసుతుని యిల్లు. ౩౮.

టీక.—చొకారపు = తళుకుఁగల - చల్లడంబుల = లాగుల - డంబు = కాంతి - మేటి = శ్రేష్ఠమైన. మ్రోఁత గుదెలు = ధ్వనిగల దుడ్డుఁగఱ్ఱలు. పేటాడుచుండన్ = మిక్కిలి చలించుచుండఁగా, పీఁకె = ఊఁదెడు సాధనము.

వ. అప్పు డందులఁ గ్రందుకొనుసందడిఁ గొందల మంది పరిజనంబు లేచ్చు లోపలికిం బాఱి యబ్బారి యెఱింగించినఁ నిప్పు ద్రొక్కినచందంబున మిట్టిపడి తొట్టిలం బడినపులుఁ గువిధంబున నిట్టట్టు తరలి పోఁగూడకే

యావద్రావినవానిగతి నారటించుచు మిన్ను విఱిగి పైఁబడిన కైవడి
ఱిచ్చవడి రాకుమారుఁ డాత్మగతంబున. ౨౯.

టీక.—క్రందుకొను = మ్రోఁగుచున్న. కొందలము = భయము. బారి = ఆపదను. తొట్రిల్లన్ = తొట్లలో. పులుఁగు = పక్షి. ఱిచ్చవడి = చేష్టలు దక్కి.

మ. జననీ, నాపయి లేనిదోస మిటు లీర్ష్యం దండ్రితోఁ జెప్పి, యా
యనకుం గోపము వెంచి, త్రుంపు మన నాహా యెట్లు నోరాడె! నై
నను బోదా సదసద్వివేకగుణముల్ ధర్మంబుఁ బోకార్చి య
మ్మనుజాధీశుఁడు వట్లు సేయఁ దగునే! మత్తు ల్గదా భూపతుల్. ౩౦.

క. ఈలాగున ధర్మము ని
ర్మూలం బై పోవు టెఱుఁగ; మునుపే యెట్ల క్కే
బో లే నైతి నయో! విధి
యేలా పో నిచ్చుఁ బ్రాప్తి యిటు లుండంగన్! ౩౧.

ఉ. కెరలిపడి జనని దూఱుట । ధరణీపతి నసుట వెత్త్రైతన; మిఁక నేలా
పరితాప మొంద? నాకుం । గఱకంఠుఁడె దిక్కు గాక గల రే యితరుల్?
అని నిర్విచారుఁడై యా । మనుజేశకుమారుఁ డనుపమానగభీరుం
డనవద్యశుభాకారుం । డనిమిషగిరిధీరుఁ డున్న యంతఁ దలారుల్. ౩౩.

టీక.—అనవద్య = పొంటులేని. అనిమిషగిరి ధీరుఁడు = మేరు ధీరుఁడు.

క. రాసుతుఁ డని తోడిఁబడఁ దెగి
గాసిని బెట్ట కడియాసఁ గాచుక మన వీ
మోసాల నున్న నెక్కడ
మోసా లౌనో యటంచు ముంచినభీతిన్. ౩౪.

టీక.—మోసాలన్ = వాకిటి చావిడిలో.

క. కిక్కిఱిసి నగరిలోనికిఁ
జక్కన దురదురన చొచ్చి చనుచో, నేమిం
జెక్కు సెమర్పక యుండెడు
నక్కుమరునిఁ గాంచి, వార లతిదూషితు లై. ౩౫.

ఉ. 'కానకుఁ గొంచుఁబో యిపుడు గాళ్లను జేతులు గోయఁ డంచు లో
నూనినకిన్క 'రాజు ముదుటుంగర మిచ్చెను, మాకు బుద్ధి యే
మానతి యిండు మీ' రనిన, 'నట్లనె సేయుఁడు, గొంక నేల, రా
జాన యతిక్రమింపఁ దగునా?' యని యాదృఢచిత్తుఁ డాడినన్; ౩౬.

ఉ. 'ఏమెడఁ గోపగించి ధరణీశుఁడు గొల్చినవారి నేక్రియం
జేయుఁ డ టన్నఁ గా దనక చేయవలెం గద' యన్న; న ట్టిటుల్
గాయిడి చేసి కర్కశపురజ్జువుల న్నవమోహనైకరే
ఖాయుతదేహునిన్ విఱిచి కట్టి రయో పెడచేతు లంటఁగన్. ౩౭.

టీక.—రజ్జువులన్ = త్రాళ్లతో. రేఖా = సొంపుతో.

క. చిందె నట హారములు దెగి
క్రొందెలిముత్యములు, పెన్నెఱు ల్వీడి విరుల్
జిందెను, మును సింగారము
చిందుచు నున్నాఁ డటంట సిద్ధము గాఁగన్. ౩౮.

తే. ఇట్టు లారాచపట్టిని బట్టి చాల
గొట్టు సేయుచు, 'నడురేయిఁ గొంచుఁ బోయి
నఱకుడు మ'టంచు నప్పు డానగరికడన
యుంచి వా రంత నంతగా నుండి. రంత; ౩౯.

టీక.—గొట్టు = దౌష్ట్యము.

తే. అదురుగడ గాఁగ నవ్విధం బందుఁ దెలిసి
బెగడి యేడ్చుచుఁ, జేతులు పిసికికొనుచుఁ,
జెమ్మరించుచు, 'నోయమ్మ చెల్ల ! యేమి
సేయుదుమొ!' యంచు రత్నాంగిచెలులు మిగుల. ౪౦.

టీక.—అదురుగడ = ఉలికిపాటు.

క. తల వీడఁ బాఱి, తమ గా
దిలిమేలికసానితోఁ దదీయవిధంబున్

దెలియఁగఁ జెప్పిన, 'హా!' యని
నిలిచిన నిలువుననె యొరగి నేలం బడియెన్. ౪౧.

టీక.—గాదిలి యేలికసానితోన్ = ప్రియమైన దొరసాని (రత్నాంగి) తో.

తే. నోరఁ దడి లేక, యప్పు డానీరజాక్షి
కంటఁ బుట్టెడుకన్నీరు గాఱఁ, బొరలి
పొరలి యేడ్చుచునుండ, నబ్బోటు, 'లేల
కస్తిపడె దమ్మ,' యని యొత్తి కుస్తరింప. ౪౨.

క. అప్పుడు దెలిసియు మదిలో
ముప్పిరిగొనుపుత్త్రిమోహమున సకియలు తన్
గప్పుకొని వెంట రాఁగా
నప్పావనచరిత మహీతలాదవుకడకున్. ౪౩.

మ. జిలుగుంబయ్యెదకొంగు జాఱి వెనుకన్ జీరాడ, ముత్యాలపే
రులు వక్షోజతటిం బుటం బెగయఁగాఁ, ద్రోపాడఁ జన్నుల్, కటి
స్థలిపై వేనలి మొగ్గ వ్రాల, నడుగుల్ చండింప, నేత్రాంబుజం
బులు గన్నీట వసంతమాడ, నరిగెన్ బూఁబోఁడి ఖేదంబునన్. ౪౪.

టీక.—వేనలి = జడ. చండింపన్ = తడఁబడఁగా.

అరుగునెడ, నంతిపురమున
నరవిరిపాన్పుపయి నొరగి యావల ధరణీ
శ్వరుఁడును, నీవల నొకయం
తరువునఁ జిత్రాంగి చెలులుఁ దా నుండంగన్. ౪౫.

తే. అనఘచారిత్ర యెవ్వ రే మన నొకింత
గెరలని సుశీల సంపన్న గేస్తురాలు
శ్రోత్రపుణిఁ జూచి యప్పుడు నోరెత్తి పలికెఁ
జాళవచ్చునె పుత్త్రీవాత్సల్య మెచట. ౪౬

మగనికూరిమి గల్గి జగములో మిక్కిలి
వన్నె కెక్కినయట్టివారు లేరె?

యిల భోగభామినుల్ కులభామినులకంటె
మేరగా నడచినవారు లేరె?
సవతిపట్టలను నీవు సవరింప కేపట్లు
గారాబమునఁ బెంచువారు లేరె?
నెనరుతోఁ బినతల్లి యని కొమాళ్లింటికి
వచ్చిన దయఁ జూచువారు లేరె?

తే. తగునె? యక్కటా! బుధను తోదారగుణ వి
రాజి సన్మార్గవర్తనఁ దేజరిల్లు
పరమసాధువు సారంగధరునిమీఁద
నొకటికిఁ బదాఱు గల్పించి తోలతాంగి. ౪౭.

టీక.—సవతిపట్లన్ = సవతిబిడ్డలను. బుధ...ర్తనన్ = విద్వాంసులచే కొనియాడఁబడిన గొప్పగుణములచే ప్రకాశించెడు మంచిమార్గమున నడవడిచేత.

చ. పడుచుండనాన వచ్చి నినుఁ బట్టి పెనంగె నటంచు, లేనియా
గడములు గొన్ని యంగమునఁ గానఁబడన్ సవరించి, యీసుచేఁ
దోడిఁబడఁ బోయి ప్రాణవిభుతో నెఱిఁగించి, తెగించి, వాని నో
పడఁతుక యాజ్ఞ సేయు మని పంచితి; వెంతటి కెత్తుకొంటివే! ౪౮.

టీక.—ఆగడములు = చెడుచిన్నెలు.

చ. పొలఁతుక, లెస్స యున్న నొకపూఁటయుఁ జూడఁగఁ జాల వీవు, మా
యల కొడిగట్టి తెంతటిగయాళివి! బేరజపున్ విచారముల్
దెలియనివానిపైఁ గలవి లేనివి చాల ఘటించి, తండ్రిబి
డ్డల కెడ సేయఁ జూచి; తకటా! మది నీ కిది యెంత దోసమే! ౪౯.

టీక.—బేరజపున్ విచారముల్ = కుత్సితపుఁ దలఁపులు.

చ. కలుషుఁడనంబుతోడఁ గసుగం దని యాత్మఁ దలంప వైతి, వి
త్తెఱఁగు వినం గలుక్కు మనదే పగవారిమనంబు? వెనన్ముం
దఱలను బిడ్డఁ బాప మమతం గని పెంచినదాన వైనఁగా
దెఱుఁగుదు; గొడ్డురాలి కిల నెక్కుడిమోహము లెంచి చూడఁగన్?

టీక.—కఠినహృదయంబు=కఠినత్వము. కనుగందు=లేఁతబిడ్డ. మమతతోన్=ప్రేమతో.

క. పినతల్లని పెనుపఁగ నో। పినతల్లని గాన వచ్చి పిలిచిన, నార్యా!
కనికరము లేక వానిం। గని కరము నిరాపనింద గట్టం దగునే? ౧౧.

టీక.—తల్లని = తల్లి + అని.

చ. కటికిమనంబుతో నిటులఁ గల్లలు చెప్పిన, నాతఁ డైనఁ దాఁ
గటకట! 'యిట్టివాఁ డవును గాఁ డ'ని రెండును నిశ్చయింపకే
యెటువలె నాజ్ఞపెట్టు మనెనే తరళాక్షి? కుమారుఁ డంచు న
క్కటికము లేదె? యాఁ, జెవుల కన్నులు రాజులకుం దలంపఁగన్.

ఉ. ఏసడిసన్న మానిసివొ? యేమి యెఱుంగవు! పాఱుపట్టివే!
వేసర కెన్ని నేరిచితివే మటుమాయలనీలికాన యో
వాసనము త్తె మై వెలుఁగుముద్దుఁగుమారునిమీఁద నెట్టుగాఁ
జేసితి వింత మచ్చరము? చెల్లు నటే మతి యోఁడుదానికిన్? ౧౩.

టీక.—ఏసడిసన్న మానిసివా = ఎట్టి యింగితజ్ఞురాలవో. పాఱుపట్టివే = పరుగులాడుచున్న నిసువవు. నీలికాన = నాలిముచ్చా.

క. అని తా నాడినమాటలు
విని తాళఁగ లేక, బిగువు వెలయఁగ, నపు డ
వ్వనితామణి యి ట్లనియెన్
జనితామర్షమునఁ జూపు జంకెనఁ జూపన్. ౧౪.

టీక.—జనిత అమర్షమునన్ = పుట్టిన కోపముచేత.

చ. జలరుహనేత్ర, నన్నిపుడు సారెకు దూఱుచుఁ గేరి నిక్కుచున్
నిలుగుచు విఱ్ఱవీఁగుచును, 'నిక్కము గాఁగను నాతఁ డేమియున్
దెలియఁడు సాదుబిడ్డఁ డ'ని సొంపుమాటలఁ జాల నాడి, గా
దిలిసుతుచేతఁ జక్కటులు దిద్దెదు; వింతటి నంగనాచివే! ౧౫.

టీక.—చేతన్ = పనియందు. చక్కటులు దిద్దెదవు = సవరణలు చేసెదవు.

వేసము వల్కి యున్నదత ప్రేయసిఁ జూచెద 'వింతు పంత యుం
జేసెను లేదు నీవు కడుం జెద్దతికా! ల్పచరించి యూర కే

వాదులు చేసె దేల చెలువా? యవుఁ గా దనువారు లేరఁటే?
సాదుపిసాళి నీదుతనుజాతుఁడు; వాఁ డలపిన్నపాపఁడే? ౫౬.

టీక.—వేదులు = వెగటుమాటలు. అంబేదలు = దిట్టతనము లేనివారు. సాదుపిసాళి = సాదుపలువ.

ఉ. ఎంతకు లేఁడు? బాలుఁ డనియే పచరించెద; వింతె కాక నా
చెంతకుఁ జేరి నీకొడుకు చేసినచేఁతఁ దలంప వైతి; ప్రా
కాంత, నిజంబె యేరికిని గాళికిఁ బోయినసుద్దులే ప్రకా
శింతురు గాని యానడుమఁ జేసినదోసము లెంచరే కదా. ౫౭.

ఉ. ఏల బజాటిఅంతు లివి యెవ్వరు మెత్తురు? నోరిలోపల్లఁ
ద్రవే లిడినప్పుడుం గఅవ నేరఁడు నీసుతుఁ; డద్దపాప గాఁ
డే లలితాంగి? నీ వనక యే రిఁక నందురె? యాయెఁ బొమ్ము చా
ల్చాలును! వ్రేళ్లసందులను జాఱెడువారలు లేరి యెవ్వరుఁ. ౫౮.

టీక.—బజాటిఅంతులు = అంకలాఁడి జగడములు.

క. సూనుఁ డని చాల నెంజిలి
యానెదుగాఁ, తల్లి దోస మన కిటు బలిమిఁ
బోసిక పట్టి పెనఁగిన
వానిఁ మఱి యేమి సేయ వలయుం? జెప్పుమా. ౫౯.

వ. అని పలికినచిత్రాంగిపలుకులు చెవులకు ములుకులపోలికఁ గీలొన్న
నచ్చిలుకలకొలికి యులికిపడి యాచెంత నున్నమహీకాంతునిఁ గని
యిట్లనియె. ౬౦.

క. మతకరిమాటలు చెవి నిడి
గతకల్మషుఁ బుణ్యచరితుఁ గారణజన్ముఁ
సుతుఁ దునుమఁ దగునె ముద్దుల
రతనమ్ము? నరో! యిం దేవారకనమ్ము నృపా? ౬౧.

చ. పెనఁగినఁ జావ నీక పసిబిడ్డఁడు వాఁ డటు చుమ్మచెల్లఁ గా
దన దరు నలు వచ్చె నట! తక్కినమాట లిఁ కేల? మాజిటుఁ

వినియు నెఱుంగ మయ్యు యివి వింతలు చెప్పెడివారు చెప్పినన్
వినియెడువారి కైనను వివేకము దా వలదా యొకింతయున్? ౬౨.
మ. తొలుతన్ రాజులు భోగకామినులయందున్ మోహితుల్ గారొ? యిం
పొలయన్ వారి కపారమైనధన మీరో? యందు కే? మీట్లు పు
త్త్రుల దండింపఁగ నిచ్చువారి విన మెందున్. నేఁడు చిత్రాంగి మం
దులు నీకుం దల కెక్కె. నాఁ, బరవశాత్ముల్ గారె కామాతురుల్? ౬౩.
ఉ. అక్కట చూడఁ జాల కటు లాకుటిలాలక వ్రాయ వన్ని దు
ర్వాక్యములు దెల్ప, 'వాని కిటువంటిగుణంబుల? నే నెఱుంగనా!
యెక్కడిమాట! పొమ్మనక, యీ వది నిక్కము చేసి బిడ్డ న
య్యొక్కని నేఁడు చంపఁగ నయో దయమాలి తెగింపఁ జెల్లునే? ౬౪.
టీక.—కుటిల అలక = వంకర ముంగురులు కలది.
క. ధరణీపతు లే యొకటియుఁ
బరికింపక యిట్టు లదయభావమున ఘటిం
తురె? యౌఁ గదె! 'రాజ్యాన్తే
నరకం ధ్రువ మ'నిరి తొంటినయమార్గవిదుల్. ౬౫.
చ. 'చలమునఁ జెప్పుమాటలు నిజం బని, కానక, కన్నపట్టి ని
ర్మలు వధియించె నెంతదయమాలినవాఁ డ'ని లోకు లాడరే?
వలపున స్త్రీలబుద్ధి వినువా రొక రేఁ గడ తేరినట్టివా
రలు గలరా? వివేకము కరం బిటు లయ్యె ని దేల వల్లభా? ౬౬.
ఇచ్చక మాడ నిట్టివెలయింతుల నెందఱునే గడించుకో
వచ్చుఁ, గుమారుఁ డిట్టిగుణవంతుఁడు గల్గఁ, డెఱుంగఁ జెప్పితిన్;
మచ్చర మేల? యింక నయినన్ విడిపింపఁగ రాదె?—యంచు లో
హెచ్చిన నెంజిలి న్మగువ యెమ్ములు జిల్లులు వోవ నాడినన్. ౬౭.
మదిని ద్వేషంబు కోపంబు మల్లడిగొన,
నిలువ కప్పుడు తాగ మతనికన్నుల వసిం చెఁ,

కటుమరలం జేరె నవు డనుకంపమహిమ;
చనునె దుర్జనసంగతి సాధువులకు. ౭౮.

టీక.—అట్టన్ = మనస్సులో. రాగము = ప్రేమ - ఎఱుపు. కటుమరలన్= చెక్కిళ్లమీఁది భాగములను. అనుకంప = కనికరముయొక్క - వణఁకుయొక్క. ద్వేష కోపములు దుష్టము లనియు, రాగానుకంపలు సాధువు లనియు, ద్వేషము రాగమును తఱిమె ననియు, కోపము కనికరమును తఱిమె ననియు—భా.

చ. ఏ నటు వేఁటఁ బోవఁ గని, యిందులకున్ బెళు కావగింజయం
తైనను లేక చేయ నగునా తగునా యన, కింత సేసెనే!
వానికిఁగా వహించుకొని వచ్చితివా యతివా? కులోద్వహుం
డౌ నఁట! బుద్ధి దా నెఱుగఁ డందమె? యందమె యిట్టిచందముల్?

చ. అది మఱుమాయలాఁడి యని యంటివిగా; యొకనాఁడు రానివాఁ
డదురుగడం దదీయనిలయంబున కేటికి వచ్చె? నైన నిం
పొదవిన ప్రేమచే నచట నుండఁగ వచ్చెనె వాఁడు? పోవ ని
మ్మదియు; నిజాంశుకంబు తగు లౌటకుఁ గారణ మేమి? దెల్పుమా.

టీక.—అదురుగడన్ = అదిరిపాటున.

క. జనపతి యూలని బడ్డని। యనుఁగుంజుట్టమని చూడ నగునే యెందున్
దునియలుగ నాజ్ఞ వెట్టక। నెనరున మఱి సేయరానినేరము సేయన్?

చ. అని యొకయించు కైనఁ దన కాస్పద మీ కతఁ డాడఁ జూచి; మా
నిని యిటుఁ గూడ వానిపయి నేరమి యూరక మోపఁ జేసితో
జనవర? నిక్క మా నవును, సభ్యయు నీప్రియురాలె, వాఁడె దు
ర్జనుఁడు; వెదుళ్ల పందిరియు రాజులమాటలు నిక్కమౌఁ గదా. ౭౨.

టీక.—ఇటుఁగూడ = వలువం జూపుటచేత సయితము.

చ. అడవుల కేఁగి యాకలము లైన భుజించెద మయ్య, దీమసం
బెడలఁగ దూరదేశముల కేనియుఁ బోయెద మయ్య, కోడలుం
గొడుకును నేను; రాచసిరికూటము లప్పుడె వచ్చె మాకుఁ, 'జా
ల్విడువుఁ డనంగ దయ్య నవవిభ్రమ మోహన కోమలాంగునిన్.

తే. అని యపుడు నిల్వరానిమోహంబుకతనఁ
దనదుప్రాణేశ్వరుని పదద్వయముమీఁద
వేగ తా నడ్డపడి నైన వేఁడుకొనెదఁ
గాక యని చేరఁ జనుదెంచుకడఁక మెఱిగి.— ౭౫.

శా. 'స్వామీ! దాన సుమీ మ పేమి యసిన, న్నా తాడఁగా వచ్చినన్;
వామాక్షీ, యతిరఘోరపాతకునిఁ గావం జెల్లునా వాని? నీ
వేమేఁ జెప్పిన విందుఁ గాని, విన నే నీమాట పోపొ మ్మ'నెన్
మోమో టించుక లేక. యెంతకఠినాత్మల్ రాజు లూహింపఁగన్!

తే. అనిన జగయాన పతియాన కతిభయాన
క క్రియానల ధాయ్యానయక్రమగతి
యాన గజగజ వడఁకి శయాన తత్ప్రి
యాననము గని తాల్మి నయాన నపుడు. ౭౬.

టీక.—పతియానకున్=భర్తయొక్క (భర్త పెట్టిన) యొట్టునకు. అతిభయానక= మిక్కిలి ఘోరమయిన - క్రియా = పుత్త్రి దండనకర్మయనెడు - క్రియా = అభిచారిక కర్మయొక్క - ధాయ్యా = ప్రజ్వలనబుక్కుయొక్క-నయక్రమ = నీతి - ప్రాప్తియొక్క - గతి = విధము - ఆనన్ = తాఁకఁగా - వైరుల ప్రాణమును హరించుటకై కావించు నాభిచారిక హోమాగ్నిని ధాయ్యయను బుక్కు ఎట్లు ప్రజ్వరిల్లం జేయునో ఆ విధముగా రత్నాంగియొక్క పుత్త్రిదండనదుఃఖమును తేని యాన మంటలు మండించె నని భా. శయాన తత్ ప్రియ ఆననము = పరున్న యా దయితునియొక్క ముఖమును. నయానన్ = వినయముతో.

క. మనసు నిలుపఁ జాలక కడుఁ।పునఁ బుట్టినదోసమునకుఁ బొగులుచు వేఁడం
జనుదేర, నానఁ బెట్టితి। పని లే దిఁక వానిప్రాఁతఫల మిటు లుండెన్.

క. అని చాల ఖిన్నురాలై। మనమునఁ దెర వేయఁ బుత్త్రిమమతాంబుధి ని
ల్చినచోట నిలువ నైఁపక। వనితామణి నగరు వెడలి వచ్చుచు నంతన్.

టీక.—పుత్త్రిమమతా అంబుధి = సుతుని (పై) ప్రేమయను సముద్రము. మనమునన్ తెరవేయన్ = ఏమియుం దోఁపకుండునట్లు మనస్సునన్గ గప్పఁగా.

ఆ. 'భామలార, రండు, నాముద్దుతనయుండు
వేఁడి? వేఁడి?' యనుచు వేఁడి వేఁడి,

వేఁడి వేఁడిసిరు వెడఁదకాటుకకంటి
కొలుకులండ మాటి కొలుకుచుండ. ౭౯.

టీక.—వేఁడి = ఎక్కడ నున్నాఁడు. వేఁడి = ప్రార్థించి. కొలుకుల అండన్ = కొనల చెంతను.

చ. 'వల దని మీర లైన నొకపాల్ దెలుపం గద రయ్య; యాలి
మాటలు విని యన్యాయముగా నకటా తెగటార్తురె?' యంచు నామె పె
ద్దలఁ గని పుత్త్రమోహమున దైన్యపడెం, గడు రాజు మొత్త
గా నలమొగసాలకు న్నొర యఁ టన్నది నిక్కము గాఁగ, నమ్మోడన్.

మ. తొలఁగం ద్రోయఁగ రాక మూఁక లయి వీథు ల్నిండి యు న్నమ్మల
క్కలు తన్నుం గని పైన పైన పడుచుం గన్నీళ్లతో వెంట రాఁ,
జెలికత్తెల్ మును గల్గుమార్గము బయ ల్సేయంగ, రత్నాంగి గా
దిలిగారాబుఁ గుమారుఁ డున్నకడ కేతెంచెన్ నితాంతవ్యథన్. ౮౧.

సీ. సుతుఁ డట్టివాఁడు గాఁ, డతివమాటల కేమి?
యని తాళఁ డాయె రా, జనెడివారు,
నెవ్వరిమన మెవ్వఁ డెఱుఁగు, నన్నము పున్నె
మును దేవుఁడె యెఱుంగు, ననెడివారు,
విభుఁడు ధర్మాధర్మవిధము కానక చేసె,
హా! యెంతయన్యాయ! మనెడివారు,
స్వామి! యయో! పగవారికి నిటువంటి
యాపద రావల, దనెడువారుఁ,
తే. 'కపట మెఱుఁగవు, గోలవు గదర యన్న,
యెట్టు వచ్చెర నీకు నేఁ డిట్టిపాటు!'
లనుచు సారంగధరుఁ జూచి యమ్మలక్క
లపుడు కన్నీళ్లు గలవార లయిరి పురిని. ౮౨.

సీ. 'ఉపకారమే కాని యపకార మొప్పఁడ
లంచఁ డయో! యెంతమంచివాఁడు!

మనసు చూత మటంచుఁ దనరె నే మనివ నవ్వాఁ
గాని కోప మొకింత లేనివాఁడు,
మదిలోన నెవరి కెయ్యది యిష్ట మది యట్ల
నలరించునుచితజ్ఞుఁ డైనవాఁడు,
భువిఁ గలఁడా యిఁకఁ బుట్టెడు పెరిఁగెడు
వారిలో మఱియిటువంటి వాఁడు!

ఆ. పరమసాధు!' వనుచుఁ బలుమాఱు సౌరంగ
ధరునిగుణము లెల్లఁ దలఁచి తలఁచి
పౌరజనము లెల్లఁ బసిబిడ్డ లాదిగా
వగచి కన్నీరిడనివారు లేరు. ౮౩.

తే. జిత్తులకుఁ జెంకి యగునింద్రజిత్తుచేత
నలయురగపాశబద్ధుఁడై యలయునట్టి
రామునితోడ దన మిగుల గాఁ రామునితోడఁ
బెంచినకుమారుఁ గాంచి పెం పెంచి కనలి. ౮౪.

టీక.—రామునితోడు అనఁగా = లక్ష్మణుఁడో అనునట్లుగా.

మ. అపు డమ్మానిని 'యెంత సేసితివె చిత్రాంగీ యటంచున్' జొకా
రపుఁగెల్దమ్ముల నగ్రకుంతల తటీ రాకా నిశా కాల శ
శ్యపమాస్యంబున మోఁదికొంచు సుతుపై నుద్బాష్ప యై వ్రాలె నం
దుపకంఠ క్షితి బద్ధ తర్ణక దిదృక్షోద్రిక్త ధేను క్రియన్. ౮౫.

టీక.—అగ్ర...బునన్ = ముంగురుల ప్రదేశమనెడు పూర్ణిమా రాత్రి వేళకు చంద్రుని వంటిదైన మొగంబున. ఉప...క్రియన్ = సమీప భూమియందు కట్టఁబడిన దూడను చూడఁగోర్కెచేత రేఁగిన యావువలె.

ఉ. రంగ దపార మోహ జలరాశి మునింగి రహింపఁ దోరగి రం
త్వాంగి యొకింత సేపటికి - "హా సుకుమార, కుమార, నేఁడు చి
త్రాంగికి నప్పగించుకొంటివా నవమానములన్ భరించి వే
డ్కం గని నిన్నుఁ గూరిమి గడల్కొన గోఁఁము నెత్తి పెంచుటల్!

సీ. బహుభూషణధురీణ బాహువల్లరులకా
కటికుముప్పిరిత్రాళ్ల విటిచికట్లు ?
మృగమద శ్రీగంధ మిళితదేహమునకా
గాటంపుఁగెంధూళి కప్పడములు ?
శిబికావతంస రాజిత పదాబ్జములకా
యీడుపుత్రోట్రుపాఱెల్లిదములు ?
జాతి చంపక దామ వీత కేశములకా
యట్టిట్టుజీరాడు నచ్చికములు ?
తే. నెండకన్నును నీడక న్నెఱుఁగకున్న
పుట్టుభోగికి నయ్యోఁబో యిట్టివెతలు !
కడుపు దరికొనదా వీనిఁ గన్నయపుడె ?
యన్న యెటు లోర్తురా ననుఁ గన్నతండ్రి. ౮౭.

టీక.—శిబికావతంస = శ్రేష్ఠమయిన పల్లకియందు. వీత = చుట్టఁబడిన.

శా. నిన్నున్ సద్గుణవంతుఁ డంచు నెపుడు న్వేనోళ్ల మెత్తుఁగదా,
యన్నా, నేఁ డిది యేమి సేసితివి ? యేలా పుట్టె నీదూఱు నీ
కిన్నాళ్ళే నిది ? చెల్లఁబో ! జనని గాదే యల్లచిత్రాంగి దా ?
నన్నుం జూచినకంటఁ జూడ వలదా నామాఱుగా నాయమన్ ?
ఆ. పరులమర్మ మెత్తి పలుకనివారన్య
భామినులకు నాస పడనివారుఁ
దలఁచి చూడ దేవతాసమాను లనంగ
వినవె నీతి ? యేల వేదు రైతి ? ౮౯.
క. పాలియుటకు నేమి ? యెందున్
గల ; దందుకు వగవ మది. జగన్మోహనకో
మలుఁడ వగునీకు నీవిధి
నలచతురాననుఁడు వ్రాయ నగునా యకటా ! ౯౦.

క. నానావిభవములం దగ
నే నినుఁ జూతు నని యున్న ని ట్లాయె నయో!
తా నొకటిఁ దలఁప దైవము
తా నొక్కటి దలఁచు ననుట తథ్యం బయ్యెన్. ౯౧.

సీ. ఒకమంజువాణి పాయక మొగంబున వ్రేల
సొంపొంది సురసేవఁ జొక్కువాఁడు,
వాసిగాఁ బంకజాతాసనుం డనునుడి
వడినాఁడు రాజసప్రకృతివాఁడు,
పాలుపా లనుచుండఁ బసిబిడ్డల హరించి
తండ్రికి ద్రోహంబు దలఁచువాఁడు,
దా సదాసత్త్వవర్తనుఁడు నేఁత వికారి
తన మరాళగతి యేతఱిని విడఁడు,
తే. నలువ నలువగఁ జూడఁగాఁ దులువ గాఁడె?
యతని ననఁ బని యేమి? లోకాధిపత్య
మేచి యందఱ లోఁ దల యెత్తికొనెడు
నటులఁ జేసినయీశ్వరు ననుట గాదె?" ౯౨.

టీక.—మంజువాణి = మంచిపలుకులుగల స్త్రీ (మనోహారిణియైన సరస్వతి యనియు), మొగంబునన్ = మోలను (నోటను అనియు), సురసేవన్ = సారాయి త్రాగుటచేత (తనకు దేవతలు సేయు కొలువుచేత అనియు), పంకజాత ఆసనుండు = పాపపు సమూహమునకు ఆధారమైనవాఁడు (కమలమున కూర్చుండువాఁ డనియు), రాజసప్రకృతివాఁడు = దురభిమానపు స్వభావముగలవాఁడు (రజోగుణ సంబంధమయిన స్వభావముకలవాఁడు అనియు), పాలు...హరించి = పాలు త్రాగ త్వరపడు లేఁత శిశువులను చంపి వారి తండ్రులకు దుఃఖము గలిగించువాఁడు (పాలు...ఆవుదూడలను దొంగిలి శ్రీకృష్ణులవారికి ద్రోహము గావించినవాఁడు అనియు), దాస...గతి = బానిసలకు బానిసతనము సేయువాఁడు-పనికొక్కిరి బిక్కిరి తనము గానుండును - (అరాళగతి=) వంకరమార్గమును...(తాను సర్వదాత్మసత్త్వమందు ఉండువాఁడు - తనసృష్టి దశాభేదములు పొందునది-తాను హంస నెక్కి సంచరించుటను...) ఈశ్వరు ననుట...ఈశ్వరుఁడు బ్రహ్మకు ఒకతలమాత్రము త్రుంచినందున ఇట్టిచెట్ట గలిగినది - అన్నితలలును హరింపఁ

డాయెఁ గదా యని విలాపము.

మ. అని శోకించుచు నున్నతల్లిఁ గని "యమ్మా, నేను జిత్రాంగి న
ట్లనె నీమాఱుగ నే తలంపుదు, మరు ల్వాటిల్లి యాయమ్మ న
న్నెనయన్ గోరిన నియ్యకోక కడ కే నేతెంచితిం గాని, పా
వని, యేదోసము నే నెఱుంగను మనోవాక్కాయకర్మంబులన్.

ఉ. అమ్మరొ, పోలుపొం దెఱుఁగ కమ్మనుజేశ్వరుఁ డాలిమాట ని
క్కమ్మని కోయఁ బంచె నరగన్; పభవారు నుపేక్ష సేసి నా
యమ్ము దలంప కిచ్చకమె యాడిరి; యే మన వచ్చుఁ! గన్నమో
హమ్మున నీకుఁ బోదు గను కాంక్షఁ దలంకుచు వచ్చితి య్యెడన్.

తే. చెల్లఁబో! నీకు సాధ్వీమతల్లి వైన
తల్లి కీడల్లు వచ్చెఁగా దన్నుఁ గనుట
వల్ల! నీ వల్ల ధారుణీవల్లభాజ్ఞ
మీఱి యీరీతి వచ్చుట మే లఁటమ్మ? ౯౫.

టీక.—ఈడల్లు = ఇడుమలు.

చ. అడలకు వమ్మ నీవు, కల నైనను రాజును దూఱ కమ్మ, యే
యెడల సపత్నితోఁ జెలిమి యించుక దప్పకుమమ్మ, నాదుసం
గడిఁ జరియించు నాదుచెలికాండ్రను నావలెఁ జూడవమ్మ, యిం
పడరఁగ నన్నిఁక న్మఱవవమ్మ విచారము మాని మానినీ. ౯౬.

క. జననీ, విచ్చేయుము నీ"
వనుచున్ సాష్టాంగవినతుఁ డై లేవని-చో
ననుఁ గఱుదుల ప్రోవగుతవ
యనునఁగరుదులబిడ్డఁ జూచి యవనతకర యై. ౯౭.

టీక.—కఱుదులప్రోవు = బుద్ధులరాశి. అనుఁగరుదుల = ప్రియమయిన వింత చర్యలు గలిగిన. అవ...యై = (దీవించుటకై) చేయి (యతనిపై) వంచి.

క. 'లేవోయి యన్న' రేపటి దీవన నేకొదువ లేక దీర్ఘాయుఁడ వై
దేవునికృప వర్ధిల్లుము నీ' వని దీవించి మిగుల నెగు లుప్పొంగన్.

టీక.—రేపటిదీవనక = రేపు ఫలించెడు నాశీర్వచనముచేత.

ఉ. 'కందుఁ గ దయ్యె నీమురువు కన్నులపండువు గాఁగ; నంటినం
గందుఁ గ దయ్యె నీతనువు, కౌతుక మొప్పఁగ నీదు ప్రాపు; నేఁ
గందుఁ గ దయ్యె యంచు, నినుఁ గన్న సపత్ని సహింప దందుఁ బో
కందుఁ గదయ్యె యేల వినవైతివి నావచనంబు పుత్త్రికా. ౯౯.

సీ. చంద్రోదయం బైన చందాన నీరాక
గన్నులు చల్లగాఁ గాంతు నెపుడు,
నినుఁ గొండఁ గాఁ జూచుకొని యేవిచారంబు
లేక యుండుదు నాత్మ లేశ మైన,
నిసుమంతదడ వైన నీవు రాకుండిన
నది యేమొ రాఁ డని యెదురుచూతుఁ,
దెలియఁ జాచినయెడ దృష్టి డాఁగునో యని
వేడ్క దీఱఁగఁ జూడ వెఱతు నిన్ను,

తే. నెటువలెఁ దరింతు? నీరూప మెచటఁ గందు?
నీ వికను వత్తు వని యెందు నెదురుచూతు?
మనసులో నిన్ను నెలాగు మఱవ నేర్తు?
నీవు లేనిది యొక బ్రతు కే కుమార? ౧౦౦.

టీక.—తరింతు = (ఈదుఃఖ సముద్రమును) ఈఁదుదును.

క. తనయాత్మకు వ్రేగాయెనె?
తనయా, యిపు డెంత సేసె దైవ మహా నిన్!
తనయానిక నెటులఁ దరిం
తనయాప్తిని? నే నభాగ్య నగుజంత నయా. ౧౦౧.

టీక.—వ్రేగు = భారము. అనికన్ = కష్టమును. తరింతున్ = దాఁటుదును. అనయ ఆప్తిన్ = ద్రోహము సంభవించి నందున. జంతను = దుష్టురాలను.

సీ. జననవేళలు సూచి ఘనుఁ డౌ ననిరి గాని
వెలయ లేఁ డని నాఁ డె దెలుప రైరి,

కరము రేఖలు సూచి ఘనుఁ డౌ ననిరి గాని
ప్రబలతే డని నాఁడె పలుకరైరి,
గతిలక్షణము సూచి ఘనుఁ డౌ ననిరి గాని
యీడేఱఁడని నాఁడె యెంచరైరి,
యనుపమాకృతిఁ జూచి ఘనుఁ డౌ ననిరి గాని
కడతేఱఁ డని నాఁడె నుడువరైరి,
తే. కటకటా! నమ్మఁ దగ; దేడ గ్రహబలంబు?
నేడ సాముద్రికము? లేఁక నేడ చిన్నె?
లేడ ఘనగాత్రమహిమలు? నేడ సుద్దు?"
లంచు రత్నాంగి సుతుఁ జూచి యలమటించు. ౧౦౨.

క. పలవించుఁ, బల్లటించున్,
బలపల కన్నీరు నించుఁ, బసివాఁ డంచున్
విలపించున్, బొలు పెంచున్,
దలవరులకు నప్పగించుఁ, దల యటు వంచున్. ౧౦౩.

టీక.—పల్లటించున్ = చలించును.

చ. కనుఁగొని మూర్ఛిలుం దెలియు, గాసిలు, నొదల యూఁచు, 'నేఁటితో
నిను నెడఁబాసి పోవలసెనే!' యని యక్కునఁ జేర్చుఁ, బోదునా
యను, నటుఁ గొంతపోవు, నుసురంచు వెసం, జను దెంచుఁ, ద్రొటుపా
టొనయు లతాంగి. కన్నకడు పేగతి నోరిచి యుండు నక్కటా!

క. ఇటువలెఁ బెక్కుదెఱంగుల
నట వనటఁ దొలంగి రాక యాఱటపడఁగాఁ,
దటుకున నిటు రా జెఱిఁగిన
నటమట మగుఁ గార్య, మనుచు నాళీజనముల్. ౧౦౪.

ఉ. చేడియ రమ్ము, 'వెన్నెలయుఁ జీఁకటివంటివి సుమ్ము మేలునున్
గీడును, గొంతగాలము సుఖంచినవార కృశింతు రార్తిమై,

నాడిక లొందువార సుఖ మందుదు, రోడలు బండ్ల వచ్చు, బం
డ్లోడల వచ్చు, నీకు నిటు లూరక చింతిల నేల మానినీ.— ౧౦౬.

టీక.—ఆడికలు = నిందలు.

వ. అని యూఱడిలం బలుకుచు నిరుగడలఁ జేతులు వట్టి తిగువం దిగు
వం బడియున్న మగువం దెగువఁ బ్రౌఢసఖీవారంబు బలాత్కారం
బున నెట్టకేలకుఁ బట్టి తీసినఁ, బట్టి నెడఁబాసి, గాసి యగు నెగులునం
దనుం గనుంగొని పురజనంబులు పురపురం బొక్కుచుఁ బురస్కరింప
నత్యంతఖిన్నత్వ మొంది, మందిరంబునకుం జని తనుజని గుణబృందం
బుల డెందంబునం దలంచి నోరు గాయ పడఁగ నద్దేవి పరిదేవనంబు
గావించుచుండె. (1) నంత నాక్షణంబున నగరరక్షకు లక్షీణనిశితకౌ
క్షేయక ప్రకాండ ప్రచండభుజాదండు లై దండధర కింకరు లన నుద్దం
డత గండు మెఱసి రసామండలాధిపకుమారుం గొనిపోయి,(2)నిజ శిత
విషాణ రణ శబ్దగుణవారణాహ్వాన సంవిధానసూచక మస్తకోపరిన్య
స్త ప్రత్యాకుంచిత హస్త ప్రశస్తాదభ్రవిభ్రమ ధురంధర దికూలంక
ష సింధురఘీంకార సంకులంబును,(3)నక్షుద్ర మాధురీ ధురీణ క్షౌద్ర
లిలిక్షు జిహ్వా పల్లవాగ్ర చాపలాచ్ఛభల్ల ఖర నఖరభల్లము ఖవిదళిత
బహు నాకుకుహార ముహుర్ముహు ర్బహిర్నిర్గతానర్గళ కుండలిమం
డలీ గ్రసనవ్యసనసముల్లస ద్వనమయూర కేకాకుల వ్యాకులంబును,
(4) ననేకోలూకముఖ త్రోటికోటి త్రుటిత కోటరనిద్రాణ కరటకు
లోడ్డయన గరుత్పుటల పటపటార్భటికా విఘటిత నిద్రాతంద్రా విద్రా
వి కపి కంపితశాఖిశాఖాసహస్ర పరిపతిత పరిణత ఫల రసప్రపూర పూ
రిత నానాలతాలవాలవలయంబును, (5) బ్రవృత్త సంవర్తసమయ స
మున్నిద్ర సముద్ర సలిల గాఢావగాహ దుర్విషహ సర్వంసహా సము
ద్ధరణచణ శాంబరికిటి విడంబనాడంబర లంపట ఘోరతర ఘోణాని
ఖాతక్ష్మాతలగర్భ నిర్భరబల స్తబ్ధరోమస్తోమాస్తోక నిర్ఘాతపాత స్ఫీతభీ

షణ ఘుర్ఘురనిర్ఘోషణా చంకంప్యమానద్రుమపరంపరా భయంకరంబును, (6) దుర్ధషణాత మరాషణ ప్రపంచిత చపేటికా నిహత బహుళ హరిణ గణ గళ గళిత రుధిరధారార్ద్రణ చరణవిన్యాస దీపిత నిజపద్ధతి నివేదిత వ్యాఘ్రసమూహ దురవగాహంబును నై, సత్త్రంబు గావున నఖిలద్విజాశ్రయం బై, వనంబు గావునఁ బుండరీకనిలయం బై, కాననంబు గావున సకలాగమరణీయం బై, కుంజరహిత స్థలంబు గాకుండియుఁ గుంజరహితస్థలం బై, సుమనస్స్థానంబు గా కుండియు సుమనస్స్థానం బై, పల్లవాగమ్యంబుగా కుండియుఁ బల్లవాగమ్యం బై, యొప్పునకాంతారంబు సొచ్చి, యచ్చట నకాలసంధ్యారాగవదభ్రంకష చిటాచిటార్భటీ నట చ్చటులదావపావకోత్కలం బైన కుత్కలంబునోలంబున నిల్పి, తా మంతకు ముందుగ నృపసత్తము చేత మూఁడుత్తరములుఁ గొన్నవా రగుటంజేసి యాసత్పురుషారాధ్యుని వధ్యశిలమీఁద నునిచి యయ్యెడ. ౧౦౭.

టీక.—తనుజని = కుమారుని. పరిదేవనంబు = రోదనము.

(1) నిశిత కౌక్షేయక ప్రకాండ = వాఁడి ఖడ్గ శ్రేష్ఠములచే. దండధర=యమ. రసా = భూ. నిజ=తమ - నిశిత = వాఁడి - విషాణ = కోఁటలతో - రణ = యుద్ధమునకు - శబ్దగుణవారణ = ఆకాశ గజమును (ఐరావణము ననుట) ఆహ్వాన = పిలుచుటయొక్క - సంవిధాన = ప్రకారమును - సూచక = తెలియఁబఱుచునదిగా - మస్తకోపరి = తలమీఁద - న్యస్త = ఉంపఁబడినదై - ప్రత్యాకుంచిత = వంపఁబడిన = హస్త = తొండముయొక్క - ప్రశస్త = శ్రేష్ఠమయిన - అదభ్ర = గొప్ప-విభ్రమ = చలనములయొక్క - ధురంధర = భారమును వహించి - దిక్కూలంకష = దిక్కులయొక్క యొడ్డులను ఒరసెడి - సింధుర ఘీంకార సంకులంబును = ఏనుగుల ఘీం శబ్దముతో నిండినదియు.

(2) అక్షుద్ర = అధికమయిన - మాధురీ = తీఁపుతో - ధురీణ = నిండిన - క్షౌద్ర = తేనెను - లిలిక్షు = నాకఁగోరు - జిహ్వా పల్లవ అగ్ర = చిగురువంటి నాలుక తుదయొక్క - చాపల = కదలికగల - ఖర నఖర భల్ల = వాఁడియైన బల్లెములవంటి గోళ్ల - ముఖ = అగ్రములచే - విదళిత = చీల్పఁబడిన - బహు నాకు = పెక్కు పుట్టలయొక్క - కుహర = రంధ్రములనుండి - ముహుర్ముహుః = మాటిమా

టికి - బహిర్నిర్గత = వెలికి వచ్చిన - అనర్గళ = అడ్డులేని - కుండలి = పాముల - మండలీ = సమూహమును - గ్రసన = తినుటయనెడు - వ్యసన = పనియందు - సముల్లసత్ = ఉత్సహించుచున్న - వన మయూర = అడవి నెమళ్ల - కేకా కుల = కేకల సమూహముచేత - వ్యాకులంబును = కలిగుండు పడినదియు.

(3) ఉలూక = గుడ్లగూబలయొక్క - ముఖ = నోటి - త్రోటి = ముక్కు యొక్క - కోటి = అగ్రముచేత - త్రుటిత = గాయపఱుపఁబడిన - కోటర నిద్రాణ = తొఱ్ఱలలో నిద్రించుచున్న - కరట కుల = కాకుల సమూహముయొక్క - ఉడ్డయన = ఎగురుటయందలి - గరుత్ = ఱెక్కలయొక్క - పటల = సమూహము యొక్క - పటపట ఆర్భటికా = పటపటయనుసందడిచేత - విఘటిత = చెడఁగొట్టఁబడిన - నిద్రా తంద్రా = నిద్ర మబ్బుచేత - విద్రావి = పరువులిడుచున్న - కపి...బును = కోఁతులచేత కదలింపఁబడిన చెట్ల కొమ్మల వేలనుండి పడిన పండిన పండ్ల రసప్రవాహము చేత నింపఁబడిన పెక్కు తీఁగల (ఆలవాల=) పాదుల గిఱులు (గుండ్రనిపాదులు) గల దియు.

(4) ప్రవృత్త = జరిగిన - సంవర్తసమయ = ప్రళయ కాలమందు - సమున్నిద్ర = పొంగిన - సము...చణ = సముద్రముయొక్క నీట లోఁతుగా మునిఁగినదై ఓర్వలేకున్న భూమిని లేపుటయందు (చణ =) నేర్పరియయిన - శాంబరీ కిటి = మాయ పందియొక్క (ఆదివరాహమును) - విడంబన = అనుకరించుటయొక్క - ఆడంబర = అతిశయమందు - లంపట = ఆసక్తమయిన - ఘోరతర = మిక్కిలి భయంకరమైన - ఘోణా = ముట్టెతో - నిఖాత = చీల్పఁబడిన - క్ష్మాతల = భూప్రదేశముయొక్క - గర్భ = లోభాగముగల వైన - నిర్భర = భరింపరాని - స్తబ్ధరోమ = పందులయొక్క - స్తోమ = సమూహములయొక్క - అస్తోక = అల్పముగాని - నిర్ఘాత = పిడుగుయొక్క - పాత = పాటువలె - స్ఫీత = వ్యాపించిన - భీషణ = భయంకరమయిన - ఘుర్ఘుర నిర్ఘోషణా = ఘుర్ఘుర ధ్వనిచేత - చంకంప్యమాన = మిక్కిలి కదలుచున్న - ద్రుమ = చెట్లయొక్క.

(5) దుర్ధర్షతర = అంపరాని - అమర్ష = కోపముచే - ప్రపంచిత = విస్తరింపఁడిన - చపేటికా = చెంపకాయచేత - నిహత = కొట్టఁబడిన - బహు...బును = పెక్కు లేళ్ల గుంపులయొక్క కంఠమునుండి కాఱిన రక్తప్రవాహములచేత తడిసిన పాదములను ఉంచుటచేత ప్రకాశించిన తమజాడచేత తెలుపఁబడిన పులుల గుంపుచేత చొరరానిదియు. సత్త్రంబు = అన్నప్రదానగృహము - అడవి. ద్విజ = బ్రాహ్మణులు - పక్షులు. వనంబు = జలము - అడవి. పుండరీక = కమలము - పులి. కాననంబు = బ్రహ్మముఖము (క + ఆననంబు) - అడవి. అగమ = వేదములు - (అగమ =) చెట్లు.

కుంజరహిత = పొదలు లేని - కుంజర హిత = ఏనుఁగులకు అనుకూలమయిన. సుమనః స్థానంబు = దేవతలతావు - పూవుల తావు. పల్లవ = చిగుళ్లు - (పత్ + లవ=) పాదలేశములు. సంధ్యా...కీలంబు = సంధ్యారాగమువలె ఆకాశము నెరయుచున్న చిటచిటయను మ్రోఁతతో నటించుచున్న తీవ్రమయిన దావాగ్నులచేత ఎగయుచున్న మంటలుగలది. కుత్కీలంబు కూలంబునన్ = కొండయొక్క దాఁపున.

సీ. హిమశైలజాజానియెదురుకట్లకుఁ బోని
యలయించువిలుకానిచెలువువానిఁ
గళలు వెచ్చము గానికలువనెచ్చెలికాని
ముగువుఁ గిమ్మన నీసిమోమువానిఁ
గసటు లేనికడానిపసిఁడి నించుక యేని
సరకు సేయనిమేనిచాయవానిఁ
గలికితుమ్మెద యాని నలుఁగనివిరిఁ బోని
మొలకప్రాయముఁ బూని యలరువానిఁ
తే. గరగరనివాని ముఖవిలోక ప్రవర్ధ
మాన మోహ పయోరాశి మగ్న యువతి
జన హృదయ సంగతాంగజ జ్వలన సామి
ధేని యగువానిఁ జిఱుతుకతేనిఁ జూచి. ౧౦౮.

టీక.—హిమశైలజా జాని = శివునియొక్క. ముఖ...ధేని = (తన) ముఖము చూచుటచేత పెరుఁగుచున్న మరులనెడు సముద్రములో మునిఁగిన జవ్వనుల సమూహము యొక్క మనస్సులో తగుల్కొనిన మదనాగ్నికి ప్రజ్వలన మంత్రము. చిఱుతుకతేనిన్ = యువ రాజును.

క. 'ఎటువలెఁ దునుమఁగ వచ్చున్
గటగట! యీతలిరువంటికరపద!' మనుచున్
జోటజోట కన్నీ రొలుకఁగఁ
గటకటపడి విన్నఁదనము గడలుకొనంగన్. ౧౦౯.

ఉ. ఉన్నతలారులం గని ప్రియోక్తుల నాతఁడు 'మీరు నాకు నే
నెన్నఁడు మీకు నెగ్గు ఘటియించుట లేదు గదా, నృపాలుఁ డో

మిన్నక యాజ్ఞ వెట్టుఁ డన మీఱఁగ వచ్చునె మీకు? నేటి కీ
ఖిన్నత నొందఁ? జేయఁ దగుకృత్యము సేయుఁ' డటంచుఁ బల్కినన్.

చ. 'తలపుము నీకు నిష్ట మగుదైవము' నావుడుఁ, 'దల్లిదండ్రులన్
దలఁతు నటన్న నిర్దయతఁ దామె తెగించిరి, ధర్మదేవతన్
దలఁచెద నంటినా యనఘు దండ్యునిఁగా నొనరించెఁ, దల్లిదం
డ్రులు నిఁక దైవముం దన కుడుప్రభుశేఖరుఁ డే తలంపఁగన్.' ౧౧౧.

టీక.—ఉడుప్రభు = చంద్ర.

చ. అని హృదయాళుఁ డాయన దయాళునిఁ గాలుని సంహరించి మిం
చినఘనునిం గరంబు విలసిల్లఁగ దివ్యపదం బొసంగు వే
ల్పును బరమేశు శంకరుని లోకశరణ్యుని భక్తవత్సలుం
బెనఁగొనుభక్తి హృత్కమలపీఠి దృఢంబుగ నిల్పియుండఁగన్. ౧౧౨.

టీక.—హృదయాళుఁడు = మంచిమనస్సు గలవాఁడు. కరంబు = మిక్కిలి - చేయి. దివ్యపదంబు = దేవతలతావు (స్వర్గమనుట) - మేలయిన పాదము.

తే. ధర బహుళపక్షమునఁ గదా కరపదంబు
దఱుఁగవలయును సారంగధరున కరయ,
గతబహుళపక్షమున నలకరపదంబు
దఱుగ వలసెను సారంగధరున కపుడు. ౧౧౩.

టీక.—కరపదంబు = కిరణముల చోటు (ప్రకాశించు భాగ మనుట), తఱుఁగన్ = తగ్గ. సారంగధరునకున్ = చంద్రునకు. గత బహుళ పక్షమునన్ = పోయిన పెక్కండ్రు మిత్త్రులు గలచోట (ఆప్తులెల్ల వదలిపోయిన యౌవనములో).

తే. వాఁడికత్తుల నెత్తురు వఱద గాఁగ,
'హర మహాదేవ శివ' యని యతఁడు వల్కఁ
దఱిగి తలవరు లావిపత్కరుఁడు గాని
రాసుతు విపత్కరుడుఁ గాఁగ జేసి రపుడు. ౧౧౪.

టీక.—విపత్కరుఁడు = విపత్ + కరుఁడు = ఆపద సేయువాఁడు. వి + పత్ + కరుఁడు = కాళ్లును చేతులును పోయినవాఁడు.

ఉ. లా వగు నట్టిదుర్దశయలంత సహింపఁగ లేక యశ్రుధా
రావళి గాఱ, ‘హా! జనని! హా! జనకా’ యని బిట్టు గాఁగ వా
పోవుచు, జొత్తుపాప యనఁ బొల్పగుదేహము రక్తసిక్తమై,
భూవరసూతి కీలెడలుబొమ్మవిధంబున వ్రాలె భూస్థలిన్. ౧౧౫.

ఉ. అతఁడు వడియెడుదురవస్థ కాత్మఁ బొగిలి
కొంతతడవు నికుంజంబుపొంతకుఁ జని,
తాంతతనుఁడై నయతనివృత్తాంత మెల్ల
నరసి పోదము గా కని యటఁ దొలంగి. ౧౧౬.

టీక.—తాంతతనుఁడు = బడలిన దేహము కలవాఁడు.

చ. తలవరు లేఁగ, లేఁగపులితండము నెత్తుటిగాలుకై హాళా
హాళిమెయి రాఁగ, ఱాఁగ లయినట్టివృకంబులు క్రొంబొదల్ రొదల్
చిలుకుచు నీఁగ, నీఁగలును జీమలు దొంతర గాఁగఁ బైపయిన్
బిలపిల మూఁగ, మూఁగవలె బెగ్గిలి పల్కఁగ లేక వేదనన్. ౧౧౭.

టీక.—ఱాఁగలు = ఘాతుకములు. ఈఁగన్ = చొరఁగా.

క. సొమ్మసిలి, కొంత తడసినఁ । గ్రమ్మఱఁ దెలివొంది లేచి, కం దెఱచి, సమీ
పమ్మున నెవ్వరిఁ గానక, । నుమ్మలిక లెసంగ నసువు లూటాడంగన్.

చ. ‘అలఁత సహింపరాదు, తెగటార్తురు రం డిపు, డెందుఁ బోతిరో
తలవరులార ; మీ రయిన దగ్గఱ వచ్చి వధించి పోవరే,
యలమట కోప నోమృగములార ; యయో దవకీలలార, తన్
బొలియఁగఁ జేయరే; వెతలఁ బొందఁగ లే.’ నని రోయు వేమఱున్.

తే. కుపితమానసుఁడై వృథా కోయఁ బనిచె!
నకట యిటువంటికువిభుఁ డెందైనఁ గలఁడె!
కాలుచే గోతఁ బడలేక కడకుఁ దొలఁగఁ
గాలు చే గోఁతఁ బడఁ జేసెఁ గా లతాంగి. ౧౨౦.

టీక.—కువిభుఁడు = భూపతి - దుష్టరాజు. కాలుచేన్ = యమునిచేత. గోతన్ = గోతిలో.

సీ. దొరలచిత్తంబు లీకరణిఁ బాటిల్లుఁగా
యని తండ్రియవివేకమునకు నడలుఁ,
దరళలోచనల నేతఱి నమ్మరాదుగా
యని పినతల్లిమాయలకుఁ దలఁకు,
నేమి చేసితి నేర? యిటు సేయ దేవుని
కిని బాఁకి లేదు గా! యని గలంగుఁ,
దొలిమేన నెవరి శాపములను బెట్టితినొకో?
యనుభవింపక పోనె? యనుచు వగచు,

తే. సచివసుతుమాట నిజ మని సారెఁ బొగడుఁ,
గొంతసే పేడ్చుఁ జింతించుఁ గొంత ప్రొద్దు,
శర్వ! శంకర! శశిధర! శరణు! నాకు
నీవె యనుచును నెడువు నొకింతతడవు. ౧౨౧.

తే. ఇటువలె ననేక గతుల నారటము నొంద,
గగనభారతి వానిపైఁ గరుణ వ్రిడమి,—
యడలకు కుమార నీ కిది గడవ నేర.
దెట్లనినఁ, బూర్వవృత్తాంత మెల్ల వినుము. ౧౨౨.

క. ధరమై మోహనబింబా । ధరమై రిపుభయదహయమదావళ వీరో
త్కరమై మహనీయరమా । కరమై కౌశాంబి యననొకపురం బమరుౕ.

టీక.—ధర...మై = భూమియొక్క దేహమునందలి మనోహరమయిన దొండ
పండువంటి యధరమువంటిదై. మదావళి = మదపుటేనుఁగులు.

క. ఆనగర మేలురా జా । జ్ఞానయబలశాలి సత్యసంధుఁడు సుగుణాం
భోనిధి శ్రీహరిపదసే । వానందుఁడు ధవళచంద్రుఁ డనఁగాఁ బరఁగుౕ.

తే. అతని కేవ్వురు సతు లుందు; రందులోన
భువనసుందరి యనియెడుభోగవతికి
మేలువాఁడు ధరాతల మేలువాఁడు
మేదినీంద్రులలో నెల్ల మేలువాఁడు. ౧౨౫.

టీక.—మేలువాఁడు = వలపుకాఁడు.

[పంచచామరము.]

అమాత్యు లిద్ద ఱుందు రా ధరాధినాథుచెంగటన్
సుమంతుఁడున్ జయంతుఁడున్ వసుంధరామరాగ్రణుల్
సమానశీలు; రందులో వలంతి యంచు రాజు ప
క్షమై సుమంతుమాట వించు గారవించు నెంతయున్. ౧౨౬.

తే. అందుల కసూయఁ గలకల మంచు మిగుల,
దుష్ట కపటవిచారవంతుఁడు జయంతుఁ
'డంతకోపముఁ డవురా! సుమంతుఁ డ'నుచు
నంతకోపముతో నుండు నాత్మలోన. ౧౨౭.

క. అటు కొంతకాల మరిగిన,
నట వాఁడు, సుమంతునకు మహైశ్వర్యం బు
త్కటమై గడియ కుడుకునీ
రటువలె హెచ్చిరిలి రాఁగ నతిమత్సరుఁ డై. ౧౨౮.

తే. భువనసుందరియింట నెప్పుడు వసించు
గుట్టుగలదాని మిక్కిలి గట్టివాయి
దానిఁగాఁ గేశి యనుదాని దాసి నొకతెఁ
దనకడకుఁ బిల్వఁ బంచి మంతనమునందు. ౧౨౯.

క. విలువల్ దెలుపం గూడని
వలువల్, మణిభూషణములు, వలసినధనముల్,
చలువల్ దొలఁకుకదంబము,
చెలు వందఁగ నొసఁగె సంతసిలి కన్ దనియన్. ౧౩౦.

తే. ఒసఁగి యయ్యుగ్గలికరాజ్ఞయుగ్మ మాత్మ
హస్తమునఁ బట్టి రాఁదీసి కుస్తరించి,
'నీవలన నొక్క కార్యంబు గావలయును,
జేసెదే?' యని మొక్క మింత నేసికొనుచు. ౧౩౧.

క. మతిమంతుఁ డనె 'సుమంతునిఁ
బతి మన్నన సేయు, నన్నుఁ బలుచగఁ జూచుం
సతతంబు, దాన గర్వా
న్వితుఁడై యున్నాఁడు వాఁడు నీరజనేత్రా.

క. వాని కపాయము సేయం
గా నైనయుపాయ మొకటి గల; దది నీచేఁ
గాని మఱి యెవరిచేతం
గానేరదు; పరులు దెలియఁగా రాదు సుమీ.

తే. కికురువెట్టి సుమంతుపాదుకలు గొంచుఁ
బోయి యెవ్వరుఁ గనకుండ భువనసుంద
రీవరారోహమంచముక్రింద నుంచి
మామనములోనినెగులు లార్పుమా మృగాక్షి.'

టీక.—కికురువెట్టి = వంచించి. వరారోహ = ఉత్తమస్త్రీ.

క. అనిన, నది 'యెంత గల? ద
ట్లన సేసెద' నంచుఁ జని యటం దా నొకనాఁ
డును బెట్టుకొని మెలంగని
యను వైనసుమంతుపావ లది లాగించెం.

క. ఆలాగునఁ గొనిపోయి నృ
పాలప్రియపాన్పు క్రిందఁ బాదుక లిడి యా
లూలామాలపు నాలి గ
య్యాళి తనుం గానిదానియటువలె నుండెం.

టీక.—లూలామాలపు = మోసపు.

వ. తదనంతరంబ.

సీ. గమ్మన వాసించు కమ్మపువ్వుల సరా
లొఱపుగా సిగఁ గొంత యొఱగఁ జుట్టి,

జిటిపాటినవ్వులు గనుఁగవఁ
బోటమరిలం జూచి పలికెఁ బులకల్ దొలఁకన్. ౧౭౫.

క. నీదండకు రాకుండినఁ । బూ దండల వ్రేయు నన్నుఁ బోఁడగని, నేఁడో
వేదండగమన సుమనః । కోదండధరుం డ దేమొకో! దండ మనెన్.

టీక.—దండకున్ = సరసకు. వేదండ = గజ. సుమనః కోదండ ధరుండు = పూ విలు దాలుపు. దండము = నమస్కారము.

క. అని సరసోక్తుల మక్కువ । గనిపింపఁగఁ గలికిఁ బలికి, కరపల్లవ మిం
పొనరంగఁ బట్టి మెల్ల న । తనుసంగమ సౌఖ్యవివశతను జని చెంతన్.

టీక.—అతను సంగమ సౌఖ్య = మదన క్రీడానంద.

సీ. నికరంపుజిగి కెంపు నీలంపురా చెక్కు-
డపుసకినల పగడంపుఁగోళ్లు,
హారాయలుగుజ్జరి నేఁత హారంబట్టుఁబట్టెడ,
పటు పైనజాలీల పట్టుఁబఱపు,
పచ్చనూర్యపటంపు బటువుబిల్లలు, రంగు
సాలపుచౌకాటంపుఁ దలగడయును,
దటు చెనహురుముంజి తళుక్కుముత్తెములచ
ప్పరమును జిగిదోమ తెరయుఁ, గల్గి

తే. మంచివగఁ జొక్కమైనట్టి మంచముపయిఁ
జలువ చెంగల్వ చేమంతి జాజి విరులు
పఱచి కడుఁ బొంకపఱచిన పాన్పుమీఁద
రాజు పవళించి యున్నంత రాజవదన. ౧౭౮.

టీక.—సకినల = పక్షిబొమ్మలు గలిగిన. జాలీల = జాలరులు గలిగిన. నూర్యపటము = మొకమలు. సాలపు = వ్యాపింపఁజేయు, హురుముంజి = మేలయిన ముత్తెములు పుట్టునట్టి యొకానొక దేశ విశేషము.

సీ. ఎప్పు డెప్పు డటంచు నెనయఁ గోరెడుకోర్కి-
మరలించె బోటులఁ దిరిగి చూచి,

సరసఁ బైఁ బడ దీయ మరలుగద్దఱిచూపుఁ
బదరకు మనియెఁ గంబమున నొదిగి,
చిట్టాడుసిగ్గుతోఁ జేపట్టి పెనఁగుడెం
దము మట్టుపఱిచె నాననము వంచి,
తనుఁ బిల్వఁ దమి హెచ్చియును జాగు సేసె గ్ర
క్కునఁ బోక న్నడఁ గట్టిపెట్టి,
తే. వలపు పతి నేప నటు నిటు నిలిచి కొంత,
కొంత తరితీపుమైఁ జేరి కూరుచుండె;
మగలు పైకొనునందాఁక మనసు గాన
నీయ రెంత టివగలవా రిందుముఖులు. ౧౪౯.
చ. సరసపునవ్వులన్ దనివి చాలని చుంబనగుంభనంబులన్
బరిపరిరీతులన్ మెఱయు బంధవిశేష గళారవంబులన్
సురత మొనర్చి ముప్పిరులసొంపునఁ దేలిరి వార లయ్యెడన్;
సరివల పైనకూటమికి సాటిఁక లేదు గదా తలంపఁగన్. ౧౫౦.
క. పెన్నురుల చెమట, మోడ్పుం
గన్నుఁగవన్ వెడలునీళ్లు, గలవారలకున్
బన్నీరు గ్రోలుటయు నం
త న్నిద్దురవోవుటయు హితం బై యుండెన్. ౧౫౧.
వ. గమకపుగబ్బిగుబ్బ లెదఁ గాఁడ నొకించుక గాఁగిలించి యిం
పమరఁగ నిద్రవోయి, యపు డల్లన మేల్కని, శయ్య నోర మై
గుమగుమవాసనల్ గుబులుకొన్నదనపుక్కిటిలోనివీడియం
బుమియ మొగంబు వంచి, సుగుణోత్తముఁ డప్పడిగంబుచెంగటన్.

టీక.—గమకపు = గొప్ప. పడిగంబు = తమ్ములము నుమియు పాత్రము.

మినమినమనుపావలుగని । కనలున ‘ నిట వింత పాదుకలు రా నేలా ?
వనితా, దెల్పు మి వెవ్వరి’। వని తా గద్దించి యడుగ నరనిద్దురతోన్.

చ. భయపడి లేచి వే యెదురుపాటునఁ గట్టియుఁ గట్టకున్న నీ
వియు, నెలవంకచన్నొనల వేసియు వేయని పైఁటకొంగు, దోఁ
పియు నటఁ దోఁపకున్న యలపెన్నెఱికొప్పును, నై వితాకురా
లయి యవి చూచి యల్లలన యల్లల నాడుమనంబుతోడుతన్.

తే. అపుడు కన్నీరు గాఱ, నొండాడ వెఱచి
నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచియున్న;
నీరమణి వల్లసంశయం బెఱుకపడక,
పడకయిలు వెళ్ళి వచ్చి భూపాలుఁ డలుక. ౧౫౫.

క. మొకమజ్జన మై సంధ్యా । దికకృత్యము లాచరించి । దివ్యవిభూషా
చకచకలు మేనఁ బర్వఁగ । దుకతుకతో నుల్ల మపుడు లోఁ ద్రుపడంగన్.

చ. కొలువున కేఁగి వేత్రధరకోటి నిజాయతదృష్టి వాఱుచోఁ
బలసి తటాలునం బగిలి పాఱ బరాబరి సేయ, మన్నెవా
రలు దునెదారులున్ దొరలు రాజులు మంత్రులు నిష్టబాంధవా
వళులు పురోహితు ల్వనులవార లనేకులు నిండి యుండఁగన్. ౧౫౬.

టీక.—వేత్రధరకోటి = (వెండి) బెత్తములవారిగుంపు. బరాబరి = హెచ్చరిక. దునెదారులు = కత్తి కేల ధరించియుండు శూరులు.

వ. అప్పు డప్పాదుకలు దెప్పించి యందఱముందఱం బెట్టించి, భూవరుం డివి యెవ్వరి వని యడిగిన, వారుకువ్వ నేరక నివ్వెఱయు సంశయంబును హృదయంబుల నతిశయం బయిన, నొకరొకరిమొగంబులు సూచుచు సభాజనంబులు గుసగుసలం బోవుచున్న సమయంబున. ౧౫౭.

తే. అపుడు చెవిదండఁ జేరి కే లడ్డగించి
మంతనంబునఁ జొ దాళికుంతలారి
కాలకేతుం డనెడుపేరు గలతలారి
వానివెత లార్కిఁ బోవ భూవరున కనియె. ౧౬౦.

చ. తెలియఁగఁ జూచినాఁడ నివి, దేవర, సందియ మింద కేమియు
న్వలదు, సుమంతుపావ లనినన్; ఱయకాలునిలీలఁ జేర్చున

య్యాలుక సభాస్థలిం గలుగునయ్యాలు కంపితమానసాంగు లై
యలుక, సుమంతుఁ జూచి యతఁ డన్ వికటభ్రుకుటీనిరీక్షుఁ డై.

టీక.—అలుకన్ = కోపమునను. అలుకన్ = భయపడఁగా.

క. ఓపాపాత్మక లోనికి । రా పొమ్మని చన వొసంగి, రాజువ యెల్లన్
నీపాల్పఁబుగఁ జేసి, మ । హాపరమాప్తునిఁగ నడప నాదట నిన్నున్.

క. అసమాన రాజ్యవైభవ
లసమానునిఁ జేయుటకు ఫలం బిదె యేమో ?
యిసుమంత యెఱుఁగ వేమో
యి సుమంత కృతఘ్న యర్హమే నినుఁ జూడన్. ౧౬౨.

వ. అని కోపాటోపంబున నయ్యిలాపతి కర్ణకలాపంబులుగాఁ గొన్ని
దురాలాపంబులు వల్కిన ; నుల్కిపడి యొకనాఁడును మాఱెత్తు
మాట వడనివాఁడు. గావునఁ దనవల్లఁ గల్ల లే కునికియు, నిట్టి య
పఖ్యాతి రాఁ దగునే యని నిలువునకు నిలువున నే కరంగిఁ దిగఁజెమట
వెట్టి తల వంచుకొని. ౧౬౩.

టీక.—ఇలాపతి = భూనాథుఁడు. కర్ణ కలాపంబులు = చెవులలో అమ్ముల
పొదులు.

క. అడలుచుఁ బెదవులు దడుపుచు
గుడికొనుకన్నీరు గ్రుక్కకొనుచున్, మదిలో
నుడువని నెంజిలి నేమియు
నుడువనియమ్మానధనుఁ గునుంగొని వేగన్. ౧౬౪.

టీక.—గుడికొను = క్రమ్ముచున్న. ఉడువని = ఉడుగని - నెంజిలిన్ = మనో
వ్యథచేత. నుడవని = పలుకని.

తే. 'ఘుటిక మ్రింగినసిద్ధునియటుల, నుల్లి
దిన్న కోమటివలె, నూర కున్న వాఁడు.
తెంపుమై వీని నెటులఁ జేయింపవలయుఁ
దెలుపుఁ' డన శాస్త్రసరణి సుధీజనములు. ౧౬౫.

చ. 'ధ్రువముగ రాణివాసమున ద్రోహ మొనర్చినవాని కాజ్ఞ త
ద్భవనము ముట్టుకోల్గొని విభావరిఁ గాళ్లను జేతులు న్మహా
టవిఁ దునిమింపఁ జెల్లు' ననుట న్విని యట్లనె సేయుఁ డంచు న
య్యవనిసురుం దలారులకు నప్పనసేసె నృపాలుఁ డయ్యెడన్. ౧౬౬.

టీక.—ముట్టుకోల్గొని=ముట్టడించి. విభావరిన్=రాత్రియందు. అవనిసురున్=బ్రాహ్మణుని

క. సెల విచ్చె నూతఁ ద్రోయఁగ
నలివేణిని; జీవితేశుఁ డై మును ప్రేమం
బాలుపొందెఁ గానఁ దుది న
వ్వాలనాగకు నతఁడె జీవితేశుం డయ్యెన్. ౧౬౭.

టీక.—జీవితేశుఁడు = (1) ప్రాణనాథుఁడు - (2) యముఁడు.

ఉ. పట్టుఁడు పాఱుఁ డంచు నరపాలునిభృత్యులు సందడించుచున్
గట్టిగ నాతనిన్ విఱిచి కట్టిరి, తన్నిలయంబు ముట్టుకో
ల్పట్టిరి, చుట్టుపట్లఁ బదిలంబుగఁ గావలి వెట్టి, రాప్తులుం
జుట్టపురాండ్రు బిడ్డలును శోకపయోనిధిలో మునుంగఁగన్. ౧౬౮.

క. చేయఁ దగునె రా జటు ల
న్యాయముఁ? దనుఁ గర్మసాక్షి నడుగ న్వలదా?
బోయ! యని రోసి కడకుం
బోయెను యన నంతఁ బ్రొద్దు పోటుకునఁ గ్రుంకెన్. ౧౬౯.

టీక.—కర్మసాక్షిన్ తనున్ = పనులకు సాక్షియగు తన్ను (సూర్యుని). బోయ = కిరాతుఁడు - కనికరములేని వాఁడనుట.

ఉ. ఆతఁడెఁ గొంచుఁ బోయి తలయారులు ఘోరవనాంతరస్థలిన్
జేతులు కాళ్ళు తున్కలుగఁ జేసిన నాయపరాధహీనుఁ డా
పాతకదూరుఁ డాపరమపావనుఁ డాసుకుమారదేహుఁ డు
ర్వీతలమేదురీభవదసృఙ్నవబాష్పజలప్రవాహుఁడై. ౧౭౦.

టీక.—ఉర్వీతల = భూస్థలమందు - మేదురీ భవత్ = దట్టమగుచున్న - అసృక్ = నెత్తుటియొక్కయు - నవబాష్పజల = క్రొత్తయశ్రువుల నీటియొక్కయు - ప్రవాహుఁడై = పొఱుదలకలవాఁడై.

తే. హరి హరీ! రామ రామ! నారాయణా! య
టంచు, వేదనఁ బొరలుచు, నకట తన్ను
నెవ్వఁడీ కపటోపాయ మెంచఁ జేసె.
నతని కీపాటులే వచ్చు ననుచుఁ, బలికి. ౧౭౧.

క. అసురుసు రై వ్యసువై యవ
నిసురుం డటు తనువుఁ దొరఁగె నేరమి లేకే.
యుసురు మనక పోయెడువాఁ
డుసురు మనక పోవునే నృపోత్తమతనయా? ౧౭౨.

టీక.—వ్యసువు ఐ=చచ్చి. ఉసురు = ప్రాణము. మనక = వర్తింపక (నిలువక).
ఉసురుమనక = సంతాపపడక.

తే. ఆసుమంతుండె రాజరాజై జనించె,
నలజయంతుఁడ వీ వైతి వలఘుచరిత;
యెవ్వఁ డేకాలమున నించి యేమి చేసె,
నాతఁ డాకాలమున నట్ల యనుభవించు. ౧౭3.

వ. కావునఁ బూర్వజన్మ దుష్కర్మంబువలన నీ కీదురవస్థ వాటిల్లెఁ; గాని
నీవలన నిప్పుడు దోషం బీసన్మాత్రంబు లేదు; మీఁద శుభంబు రాఁగల
దని పలికె యశరీరవాణి యరుగ.—వెఱఁగుపడి రాకొమరుండు పై
పైఁ బెరుఁగుసొరుగునఁ ధరంబడి పొరలి మొఱ లిడుచుండెఁ; నంతఁ
దద్కథావృత్తాంతం బంతయు నికుంజాంతరంబుననుండి యాకర్ణించి.

టీక.—సొరుగునన్ = మూర్ఛచేత.

క. వంతఁ దల యూఁచి 'యారా!
యెంతటిమాయలది! యింత యెడ సేసిన దా
యింతియ కద! రాజెఱుకయు
నింతియ కద!' యని తలారు లెంతయుఁ జింతన్. ౧౭౪.

క. కువలయనేత్రాత్మజుఁ డగు
కువలయనేత్రాత్మజుని యకుంఠితరుచి ది

వ్యవిభూషణములు గొని, కఁ
గవలను నీ రొలుకఁ బురమునకుఁ జని రంతఁ. ౧౭౬.

టీక.—కువలయ నేత్ర ఆత్మజుఁడు = బుధుఁడు (బుధునివంటి విజ్ఞాని యనుట). లేక-కువలయ నేత్ర ఆత్మజుఁడు = జగచ్చక్షునికొడుకు = యమధర్మరాజు (యమధర్మరాజువంటి ధర్మాత్ముఁ డనుట). కువలయ నేత్ర ఆత్మజుని=భూ నాయక తనయునియొక్క.

తే. తనదుపేరిటిసారంగధరుని నిర్మ
లాత్ము దండింపఁ జెల్లునే యనుచుఁ గనలి
భువనజాతభయంకరస్ఫూర్తి వెడలె
నన మెఱసి యెత్తివాఁతె రథాంగవైరి. ౧౭౭.

టీక.—రథాంగవైరి = చంద్రుఁడు. చంద్రునికిని లేడిని ధరించుటచేత సారంగధరుఁ డనిపేరు.

తే. మేలు పిచ్చుగుంటుమీఁద భాగీరథి
వచ్చె ననఁగ నవుడు వానిపైని
గగనభాగతలము నిగనిగ చంద్రికా
లహరి యుబ్బి జొబ్బిలంగ నిండె. ౧౭౮.

టీక.—పిచ్చుకుంటు = అనూరుని. వానిపైని = సారంగధరునిమీఁద. గగన= ఆకాశ. లహరి = ప్రవాహము. వెన్నెల తెలుపుగాన భాగీరథీసామ్యము సరసము.

ఉ. ఆసమయంబునం దొకమహాత్ముఁడు సిద్ధుఁడు మత్స్యనాథుఁ డ
భాసురశీలుఁ డన్నగముపై నొకచో గుహలోన నుండి, యా
రాసుతుదీర్ఘరోదనవిరావము వీనులఁ బడ్డఁ, 'గానలో
నీసరిప్రొద్దు వోవునెడ నెవ్వఁడొకో విలపించు చుండెడుఁ. ౧౭౯.

క. ఆరసి వత్తము గా కని । యారసికుఁడు తాపసోత్తమాగ్రణి దీనా
ధా రామితకరుణామృత । ధారా ధౌరే యవికసిత మనోంబుజుఁ డై.

టీక.—దీనా...జుఁడు = ఆపన్నులకు రక్షకమయిన అమితమయిన కృపా సుధాధారయొక్క యతిశయముచేత వికసిన హృదయకమలము కలవాఁడు.

సీ. పెనఁచి కెంజడలు నెత్తిని దిండుగాఁ జుట్టి
సింగినాదముకొమ్ము చెంపఁ బెట్టి

పంచవన్నెలయోగపట్టె పొందుగ వైచి
ప్రొద్దునిద్దపుమేన బూదిఁ బూసి
పొడలయొడ్డాణాన నడుము చాల బిగించి
వెలిపట్టుగంత మై నలవరించి
పెళపెళ మనెడుబెబ్బులితోలు మొలఁ గట్టి
చికిలిలాతపుఁగోలఁ జేతఁ బట్టి
తే. యక్షమాల సువస్తులకక్షపాల
చెవుల నెలరాలకామాక్షు లవటుసీమ
సన్నవిడిగాడరుద్రాక్షసరము లమర
గిలుకుఁబావలు దొడిగి కుత్కీలము డిగి. ౧౮౧.

టీక.—సింగినాదము = పొడదుప్పికొమ్ముతోఁ జేయఁబడిన యూఁదెడువాద్యము. యోగపట్టె = యోగులు జందెమువలె ధరించెడు పట్టునాడా. ప్రొద్దునిద్దపు = సూర్యుని తేజస్సుగల. లాతము = దండము. సువస్తుల = మంచివస్తువుల. కక్షపాల = చంక సంచి. నెలరాల = చంద్రకాంతమణుల. అవటు = పెడతల. కుత్కీలము = కొండను.

ఉ. అల్లన నేఁగి, వాడు తను వంతయు నెత్తుటఁ దోఁగి భూమిపైఁ
ద్రెళ్లి, నెగుల్ ఘటిల్లఁగను దేలఁగ వైచి తలంకఁ జూచి, ‘హా!
చెల్లరె! యెంతపాతకము సేయఁగఁ జేసిరొ యిట్లు చందమా
మల్లునిఁ బోలు నీతలిరుటందపుఁ జక్కనికోమలాంగునిన్. ౧౮౨.

[మత్తకోకిల.]

ఏటికిన్ మదిలోన సంశయ మింక? నాతఁడె తెల్పునా
మాట విందు మ.’ టంచు, ‘నోయి కుమార, యెవ్వరివాఁడ? నీ
పాటు రాఁ గత మేమి నీకు? స్వభావ మెవ్వ రటంద్రు నిన్?
దేట తెల్లమి గాఁగ నంతయుఁ దెల్పుమా.’ యని యాదటన్. ౧౮౩.

క. తాపస నాథుఁడు పలికినఁ
దాప సనాథుఁ డగురాజతనయుఁడు ముంజే
మోపి మొగ మెత్తి నెమ్మన
మోపిక లే కొహటిల్లి యుసు రసు రనుచున్. ౧౮౪.

టీక.—తాప సనాథుఁడు = దుఃఖముతోఁగూడుకొన్నవాఁడు. ఓహటిల్లి = వెనుదివిసి.

ఉ. 'ఆర్చెదొ? తీర్చెదో? తెలుప నయ్యెడి దే మ'ని, యంతఁ దేరి, 'హా!
యోర్పు సెఱుంగ కంటి, సదయోత్తమ, నీ వెవరయ్య? నన్ను నీ
పేర్చఁ దలంచి మానవుని రేవను వచ్చినశంకరుండవో?
కూర్చినప్రాణబంధుఁడవొ? కూరిమి దాఁ గత మెయ్యె దియ్యెడన్?

సీ. వినవయ్య రాజరా జనురాజతనయుండ,
సారంగధరుఁ డన జరఁగువాఁడ;
నొకపావురము వెంట వెకలి నై సవతిత
ల్లింటికిఁ జన, నామె యింటి నుండి,
కామాంధురా లయి కలయఁ గోరిన,—నీవు
జనని వే సుతుఁడ, దోసం,—బటంచుఁ
దలఁగి వచ్చినఁ, దనతప్పు నాపయిఁ జూపి,
భూపాలునకు నెగఁబోసి, యీర్ష్య
ఆ. నాజ్ఞ వెట్టఁ జేసె; నలకన్నతండ్రియు
వెరవు మాలి యిటుల వేగిరించెఁ;
దాపసేంద్ర, యింక దైవంబు నే మని
దూఱువాఁడ? వట్టి దూరు వాడ. ౧౮౬.

టీక.—వట్టి దూరు వాఁడ = ఊరును వాడయు వట్టివి (ధర్మహీనములు).

ఆ. మృగకులంబె కాని మిట్టాడ మానిసి
యెందు లేనియట్టి యీ యడవిని
నీసుధారసోక్తి నెఱయ నియ్యెడ విని
చెవులు చల్ల నయ్యె సిద్ధవర్య. ౧౮౭.

వ. నీవు మహాయోగిపురుషుండ వని తోఁచె. నీసమ్ముఖంబు గలుగుటం జేసి యింతతడవు మాటలాడఁ గలిగెఁ. గరంబు నరంబులు దివియుచు నున్నవి. మున్న కరపదచ్ఛేదనం బొనరించినవారిసే కంఠలుంఠనం

బొనరింపుఁ డని వేఁడుకొన నైతి. ధారాళకీలాలంబులు గ్రోలఁ బయిం
బడుపిపీలికామక్షికాదికంబుల జోపఁ జేతులు లేవు. గర్భశ్రీమంతుం
డయినరాజకుమారునకుఁ జుమీ యీపాఁడుములు, చూచితే?'
యని మోళ్లు సూపి తత్కరంబులు శిరంబునఁ జేర్చి 'యింక నొక్కటి
విన్నవించెదఁ జిత్తంబులోనఁ గోపంబు లేదు గదా?' యని దీనా
లాపంబుల. ౧౮౮.

టీక.—లుంఠనంబు = హరణము (ఖండనము). ధారాళ కీలాలంబులు = వఱద యగుచున్న నెత్తురులను. మోళ్లు = మొండెములను.

తే. అసదుగాఁ జూడ కీమాట; యఘము చెంద;
దసదుగా నిన్ను వేఁడెద యతివరేణ్య;
యలమట సహింపఁ జాలను, బొలియ నొక్క
మందు గల్గిన దయసేయుమా రయమున.' ౧౮౯.

టీక.—అసదు = (1) నికృష్టము - (2) అల్పము.

[తరల.]

అనిన నయ్యకలంక మై యలరారుసీరుకొలంకునె
మ్మనము గల్గు మహానుభావుఁ డు మాళవక్షితిపాలనం
దనుని వేదనఁ జూచి 'హా! గురునాథ! యీశ! సదాశివా'
యనుచుఁ దామరపాకుసీరుక్రియం దలంకి దయామతిన్. ౧౯౦.

టీక.—అకలం...నము = నిర్మలమయిన నీటికొలంకువలె ప్రసన్నమయినమనస్సు.

క. 'వినవోయి రాజనందన! తను వేటికిఁ దొరఁగవలయుఁ? దల్లడపడఁ గాఁ
జనునె? పురాకృతకర్మం। బనుభవమునఁ గాక తీరునా యెవ్వరికిన్?
తే. మందు దయసేయు మంటి; వే మందు నిన్ను;
మందులకుఁ గాక యిటు సేయ మాకుఁ దగునె?
యసదుగా నన్ను వేఁడెద నంటివి గద;
యదియుఁ దప్పదు ప్రాణమి త్తడలవలదు. ౧౯౧.

టీక.—మందులకున్ = మూఢులకు. ఇత్తున్ + అడల.

క. మనపాలఁ గలఁడు శంకరుఁ । డనపాయోపాయుఁ డాశ్రితానేకాప
ద్వనపావకుఁ డా లోకా । వనపాటవుఁ గొలువ లేనివస్తువు గలదే?'

టీక.—అనపాయ ఉపాయుఁడు = తప్పనియుపాయముగలవాఁడు. ఆశ్రి... కుఁడు = భక్తుల పెక్కుకష్టములనెడి యడవికి నిప్పు. లోక అవనపాటవున్ = లోకముల రక్షణయందు నేర్పుగల వానిని.

మ. అని యూరార్చి కుమారుఁ గొంచు జని వే యమ్మీననాథుండు న
ల్లనిచెంగల్వదొనం దనూరుధిర మెల్లం దోమి నీరార్చి, వా
ల్గనుదోయిం దడిఁ దోఁచి, తేటజలముల్ గా దోయిటం దెచ్చి ద
ప్పి నివారించి యలంత దేర్చి, యతనిం బెంపొందఁగాఁ జేయుచున్.

టీక.—తడిన్ తోఁచి = తడితో తుడిచి.

చ. తనగుహలోపల న్నిలిపి తా మును గ్రోలఁగఁ జిక్కనట్టిచి
క్కనితరిపాలు దా నపుడు కంఠము మోవఁగఁ ద్రావఁ జేయ, మేన్
బనుపడి 'నీట ముంచినను బాలను ముంచిన నీవె దిక్కు నా
క'ని యుచితోక్తులం గడు బ్రియం బొనరించె నతండు తేరుచున్.

తే. అరయ భువనైకమహిమాఢ్యుఁ డైనయట్టి
మత్స్యనాథుండు రాజకుమారమణికిఁ
గరచరణపంకజోత్పత్తి గలుగఁజేయ
నొకయుపాయంబు చింతించు చుండె. నంత. ౧౫౬.

క. తెలతెలవాఱఁగ వచ్చెను,
వెలవెలఁ బాఱె నెల, దొవలు విలవిలఁబడియెన్,
బలపల నయ్యెం జుక్కలు,
కలకల నగె దిశలు, పక్షికలకల మెసఁగెన్. ౧౫౭.

ఉ. కొందఱు పాండురం బనఁగఁ, గొందఱు శోణ మనంగ, నీటఁ బొ
ల్పొందఁగఁ జేసి, 'పాల్కడలి నంటినజి డ్డది తెల్పు గా, దిదే!
సందియ మేల? చూడుఁ డ'ని చక్కఁగ నజ్జలశాయి కౌస్తుభం
బందఱు చూడ నెత్తె నన, నంత నభోమణి దోఁచె నెట్టనన్. ౧౫౮.

మ. అలరా జట్లు కుమారు దండనము సేయం బంచి శోకవ్యథన్
నిల కావేఁగున నిద్రలే కడలుచున్, నిద్రించి మేల్కన్న పా
ల్పులరం, జాల నలక్ష్యరూపముగ గాల్యప్రక్రియల్ దీర్చి, మో
సలఁ గొల్తైవ్ తల వంచి ఖిన్నుఁ డయి చాంచల్యంబుతో నుండఁగన్.

క. తలవరులు వచ్చి, ధరణీ
తలవరులు ప్రధానులును హితజనులుఁ దగువా
రలు నింతటంతటం జం
కలఁ జేతు లిడికొని యుండఁగా నృపుమ్రోలన్. ౨౦౦.

క. నిగనిగనిభూషణము లిడి,
నెగులున నడ్డపడి యేడ్చి, 'నేఁడు కుమారున్
సుగుణాఢ్యుం డని తెలియక,
తెగి యూరక యాజ్ఞ పెట్టితివి గద.' యంచున్. ౨౦౧.

క. ఆకాశవాణి సెప్పిన
యాకథయును నూఱడించి యనుటయుఁ దెలుపన్,
శోకము హర్షము వెఱఁగును
జీకొనరింపంగ విభుఁడు చిత్తం బగులన్. ౨౦౨.

ఉ. దిగ్గన లేచి బంధుల సుధీమణులం దగువారిఁ దోడుకొం
చగ్గల మైనకోపమున నంతిపురంబున కేఁగి; 'దీనికిం
దగ్గదు తాల్మి, సామవచనంబులఁ గా దిఁక, నిష్ఠురోక్తులన్
బెగ్గిలఁ జేయఁ జెల్లు' నని పిల్వఁగఁ బంపి లతాంగి నయ్యెడన్. ౨౦౩.

తే. 'ఓసి పాపాత్మురాల, నీ వేసదారి
గాయకపుసుద్దు లెల్ల నాకాశవాణి
తెలుప విని వచ్చి తలవరుల్ కొలువులోనఁ
జెప్పినా రిప్పు డంద అచ్చెరువు నొంద. ౨౦౪.

తే. టక్కు టకటొంకు టాటోటు తవలు వగలుఁ
గట్టి పె, ట్టెంకఁ గలది కలట్టె దెలుపు,

తెలుప కుండిన నీబుద్ధికొలఁది చూడు
మత్తి.' యనుచు రాజు బెదరించి మాడలాడ. ౨౦౫.

క. వంచాడించిక, తాలిమి । డించక, బిగు వెడలి దల్లడించక, మదిలో
నించుక నైనను దాఁ జలి। యించక యాగట్టువాయి యి ట్లని పలికెన్.

టీక.—వంచాడించక = బెదరక.

చ. 'తెలిసితి హా! యి దంతయును దేవరపట్టపుదేవికై తవం
బలసుతుపాడిఁ దప్పి నను నాజ్ఞ యొనర్పఁగ లంచ మిచ్చి వే
పిలిచి తలార్ల చేత ననిపించిన దిట్టుల. నీకువాళము
ద్దెలియక వెట్టిరాజ, యిది లెస్స నిజం బని నమ్మినాఁడవే! ౨౦౭.

టీక.—సుతుపాడిన్ = సుతునివ్యవహారమందు. కువాళముల్ = కుత్సితములను.

సీ. ఎంత సేసినది నేఁ! డిది విన్నఁ గన్నఁ జో
ద్యము గాదొ! మఱి దబ్బు దబ్బిన నిటు
వలె నుండవలె! మెచ్చవలదె యిందులకు ర
త్నాంగిని! జూచినయట్టి వార
లది నిజంబనవలెఁ గద. యెన్ని గఱచిన!
దాకాశవాణి యటంచు నొకటి
గల్పించినది చూడఁ! గానలో నఁట! రాత్రి
యఁట! వారితో మాట లాడిన దఁట!

తే. కటకటా! యెట్టివింత! లాకాశవాణి
యాడఁ బలికిన దెటు పోయె? నీడఁ బలుక
రాదె యిపు? డ'ని పగ్గించి రాజకీర
వాణి పలికిన నాకాశవాణి పలికె. ౨౦౮.

టీక.—పగ్గించి = ప్రజ్ఞ నెఱపి.

తే. 'ఇంత నేరక యుండిన నంతపనికిఁ
జొత్తువే! బల్మిఁ గొంగును జుట్టి పట్టి
యెనయు మని నీ వనంగ, నాయన పెనంగ,
నాఁ డెఱుంగనె యంగనా నంగనాచి?' ౨౦౯.

చ. అని ‘వినవోయి రాజ, భువనైకమనోహరమూర్తి యైన నీ
తనయునిఁ జూచి మోహపరితాపమున న్నిలు పోప లేక, యీ
చెనఁటి పయిం బడం గదియఁ,—జెల్లునె తల్లివి గావె? నాకు నీ—
వని కడుఁ బాపభీతుఁ డయి యాయన తన్ గడఁ ద్రోచి పోయినన్.

ఉ. కోపమునం గయాళి కొనగోళ్లఁ గుచంబులు తాన వ్రచ్చి, లోఁ
బాపనియీసు గాఁగ, సుతుపై నటు నింద ఘటింప, నీవు న
ప్పాపనిఁ బట్టి తెచ్చి కరపాదము కోయఁగఁ బంచి, యూరకే
పాపము గట్టుకొంటివి నృపాలక యెంతటిహంత వెంచఁగన్! ౨౧౧.

క. నీతో నిఁక భాషించినఁ । బాతక మ’ని యంత గగనభారతి యేఁగన్,
భూతలపతి శోక వసీ । వాతసుహృత్తూలికీభవ న్మానసుఁ డై. ౨౧౨.

టీక.—శోక...సుఁడు = దుఃఖమనెడు దావాగ్నికి దూదియగుచున్న హృదయము కలవాఁడు.

ఉ. ‘హా! తనయా, వివేకరహితాత్ముఁడ నై నిను నిగ్రహించితిం
గా! తెగి లోకనింద కొడిగట్టితిఁగా! జగజంత యైనయీ
భీతమృగాక్షిమాట చెవిఁ బెట్టితిఁగా! యతిఘోరపాతకం
బీతఱి నీతి మాలి రచియించితిఁగా!’ యని సాశ్రునేత్రుఁ డై. ౨౧౩.

క. బజగడుగుదానిమాటలు । నిజ మని గురుభక్తినిరతు నిర్మలచరితున్
సుజనుఁ గుమారుని లీలాంగజునిం బో నాడుకొంటిఁ గద నే న’నుచున్.

తే. కుటిలచటులమలీమసక్రూరవర్త
నాలి దుర్గుణగణ జీవనాలి నాలి
నతి కుతల పూతనాలిఁ జిన్నాలి నతఁడు
కూపమున నూకఁ బనిచెఁ బెన్గోపమునను. ౨౧౪.

టీక.—మలీమస క్రూర వర్తన ఆలిన్=మలినమయిన దారుణ వృత్తికి చెలియయినదానిని. దు...లిన్=దుర్గుణ సమూహమునకు ప్రాణనాడి యైనట్టిదానిని. నాలిన్=కుత్సితురాలిని. అతికుతల = భూలోకము నతిక్రమించిన - పూతనా = రాక్షస స్త్రీలయొక్క - ఆళిన్ = పంక్తియైనదానిని.

ఉ. ఆయెడ రాజునానతి మృగాక్షిని రజ్జునిబద్ధఁ జేసి 'య
న్యాయము! రాకుమారు సుగుణాగ్రణిఁ బావనశీలు నుత్తమున్
మాయలు పన్ని మచ్చరముమైఁ దునిమించెను! జూడ నున్న
దన్నా! యిది మేఁకవన్నె పులి!' యంచుఁ దలారులు గొంచుఁబోవఁగన్.

టీక.—రజ్జు = త్రాళ్లతో - నిబద్ధన్ = కట్టఁబడినదానిని.

వ. కుచ్చితురాలైనయచ్చపలలోచనం జూచి పౌరు లందఱు గచ్చుకొని గ్రచ్చుపొదఁ గదలించినకైవడి విచ్చలవిడి నోరికి వచ్చినట్టు వెచ్చాన కిచ్చువారును 'దానికి నటువలెఁ గావలయు' నని పగ్గించువారును, 'దీని కివి పాటులా?' యని పండ్లుకొఱుకువారును, 'బాపజాతి కానా! కన్నులు దెఱవనిపాపనిపై నీరాపనిందలు గడియించి యానిసువుగోడు పోసికొంటి; వందుల నీ కేమి గలిగెనే?' యనువారును, 'నిర్నిమిత్త ముత్తమపురుషునకుం జేసినదోషంబు తోడనె చూపక పోవునే?' యనువారును, 'సాహసం షడ్గుణం చైవ-యన్నది తప్పునే?' యనువారును, 'నెంతకుఁ దెగించెఁ జూడుమా! యాఁడుదాని నమ్మవచ్చునే?' యనువారు నై మఱియును. ౨౧౩.

టీక.—గడియించి = ఘటియించి.

క. ఒం డేమి దోష మెఱుఁగక
యుండెడుసారంగధరుని నూరక పతితోఁ
గొండెంబు సెప్పి తోడిఁబడ
దండింపఁగఁ బనిచె నెంత దయ లేని దయో! ౨౧౪.

చ. తెలియఁగఁ జూచినట్లనె మదిన్ బుధు లారసి 'తప్పు నీపయిన్
గల దని పల్కుచోఁ గుచయుగం బటు బట్టబయల్గఁ జేసి తో
యలికచ, లేదు బంతి యన, నందఱు డెందము నిశ్చయంబు పెం
పొలయఁగఁ, గల్లతోడ నిజ మొప్పదుగా దలపోసి చూచినన్. ౨౧౫.

టీక.—లేదుబంతి = బొంకు.

చ. కని కర మేది బిడ్డని నకారణ మూరక యిప్పు డయ్యయో !
కనికర మేది యాజ్ఞ యిడెఁగా ! తన బుద్ధి కలా లసద్వివే
క నికర మేది ? మున్ వినుతగౌరవకీర్తి వహించి యింక నిం
కనికఱ మేదినీవిభుఁడు గాంచెను నేఁ డని పొక్కి రందఱున్. ౨౨౦.

టీక.—కని = పడసి, కరము = మిక్కిలి, ఏది = పెంచి. ఏది = నశించి. ఏది ? = ఎక్కడ నున్నది? ఇంకని కఱన్ = ఇంకిపోనట్టి కళంకమును.

తే. చెలి యిపుడు ఘోరపాపంబు సేసి మీఁద
నరకకూపంబులోఁ బడఁ దలఁచునీకు
నరక కూపంబులో నిపు డుఱుకు టరుదె ?
పాటు పడు మని పఱిచినపాటు వఱచి. ౨౨౧.

క. జడ లల్లుచుఁ బిన్నప్పుడె
పడఁతులు తను 'నూతఁ బడెదొ పాతఱఁ బడెదో
నుడువు' మనుమాట నిజమై
పడె నూతను నౌర ! నూఱుబార లనంగన్. ౨౨౨.

చ. అటువలె నింతి నాజ్ఞ యిడి యామను జేశుఁడు మంగలంబునం
బెటిలినపేలగింజవలె మిక్కిలి పుత్త్రవియోగబాధ న
ట్టిటుపడి ధారుణీస్థలిపయిం బడి నందనురూపరేఖలున్
బటుగుణశీలముల్ దలఁచి పల్వగలం బలవించుచుండఁగన్. ౨౨౩.

వ. అప్పుణ్యవర్ధనమతి మతిమంతుం డతని కి ట్లనియె.— ౨౨౪.

క. 'చనునే యిటువలెఁ జింతి । ల్ల నృపాలక? నింద రావలసి నాపలుకుల్
విన వైతివి. చే మించిన । పనులకు నీ వింకఁ గ స్తిపడవచ్చునొకో?

ఉ. మాను దురంతవేదనఁ గుమారిల నేల? పసిండికొండవి
ల్కానివరప్రసాదమునఁ గల్గినవానికి హాని వచ్చునా
మానవనాథ ?' యన్న, 'మతిమంతుడ, నీ వను టెల్ల నిక్క మౌ;
నౌ నిది ; లోకనిందితుఁడ నైతిని నీపలు కాచరింపమిన్. ౨౨౬.

టీక.—కుమారిలన్ = కుములఁగా.

క. అరయఁగల సాక్షిఁ గోరక,
తెలియవడక యంద మని మది న్నమ్మి, సుతుం
బరుసనిపాటులఁ బఱిచితి
బరు సని యిది యెఱుక లేక పదరితి నయయో! ౨౨౭.

టీక.—పరుసని = కఠినమైన. బరుసు = కఠినము. పదరితిన్ = త్వరపడితిని.

ఉ. ఇట్టుగ నుండె నాయెఱుక! యే మనువాఁడ! మహేశుసత్కృపన్
నెట్టన వాఁడు ప్రాణముల నిల్చినఁ జా. లిటఁ దెచ్చి వెజ్జులం
బెట్టి గుణంబు చేసి మదిఁ బేరిన నెంజిలి దీఱ వాని కేఁ
బట్టము గట్టి కానలఁ దప మ్మొనరించెద నయ్య చయ్యనన్.' ౨౨౮.

టీక.—వెజ్జులన్ = వైద్యులను.

క. అనుగు లయి హితజనంబులు
ననుఁగుంజుట్టములు రాఁగ, నవుడు దలారుల్
వనసీమ తెరువు సూపఁగఁ
జనియెన్ జనాయకుండు జాయాన్వితుఁ డై. ౨౨౯.

టీక.—అనుగులు = అనుచరులు. జాయా = భార్యతో.

చ. చని, మును దండనం బిడినచక్కని వధ్యశిలాతలంబుదా
పునఁ బడియున్న కెంజిగురుఁ బోల్పసివాడిన కాళ్లఁ జేతులుం
గని, నెగు లొంది పట్టి నటఁ గానక మూర్ఛిలె. యంతఁ గొంతసే
పున కిసుమంత దెప్పిఱి విభుం డలపూఁబొదరిండ్లఁ జీరుచున్. ౨౩౦.

సీ. అరసి చూతము పదం డా కానలో నున్న
నరసి చూతము తెచ్చి యనుచు నేఁగుఁ,
'గాన రే యే మైనఁ గని మెగాల్ దినియెనో?
కాన రే?' యని వేఁటకాండ్ర నడుగుఁ,
బొదల నెవ్వగ నైన వెదకి కానఁగ లేక
పొదల నెవ్వగ నేలఁ బొరలి యడలుఁ,

దనయుని కీపాటు నెనయఁ జేసితి నయో !
తన యుని కిఁక నేల యనుచుఁ బొగులు,
తే. వనరు, 'హా!' యను, 'సుకుమార, వదన విజిత
వనరుహా!' యను, 'వెత సేయవలెనె యింత
దైవమా!' యనుఁ, దలఁపని తలఁపు లివిగొ !
దైవమాయను దెలియంగఁ దరమె యనుచు. ౨౩౧.

టీక.—కానన్ = అడవిలో. రే = రాత్రి. నెవ్వగ పొదలన్ = దుఃఖము అతిశయింపఁగా.

సీ. దట్టంపువిరిమొల్ల తావులతావుల,
నమరు లతాకుడుంగములగములఁ,
జల్లనిసురపొన్న చాయలచాయల,
నరుదారుమాణిక్యదరులదరుల,
వలిదేరు పన్నీరు వంకలవంకల,
గాలితేజీల నిల్కడలకడలఁ,
గ్రొంజీఁకటులు గ్రమ్ము కోనలకోనల,
ఘనమైన యోగిపుంగవులగవుల,
తే. నరసి పెదవులు దడుపుచు నరిగియరిగి,
దొరఁగునశ్రులు గన్నుఁదామరల మరలఁ,
గుసుమబాణునిఁ నగఁజాలుకొమరుకొమరు
విభుఁడు మదిలోనఁ బాయని వెతకు వెతకు. ౨౩౨.

టీక.—తావుల తావులన్ = పరిమళముల ప్రదేశములయందు. కుడుంగముల గములన్=పొదరిండ్ల గుంపులలో. చాయల చాయలన్=నీడల చెంతను. దరుల దరులన్=గుహల యొద్దున. పన్నీరు వంకల వంకలన్ = మంచునీటి వాఁకల కడలను. గాలి...కడలన్= లేళ్లు నిలుచుచోట్లను. కోనల కోనలన్ = అడవుల మూలలందు. యో...లన్= యోగిశ్రేష్ఠుల గుహలలో. మరలన్ = సుడివడుచుండఁగా. కొమరు కొమరున్ = సౌందర్యముగల కుమారుని. వెతకున్ = దుఃఖముచేత.

వ. ఇట్లు తద్ఘోర కాంతారంబునఁ బలుదెసలం గొంద అనుచరులం జఱుల

సందుగొందుల నందంద నందనాన్వేషం బొనరింప నియమించి, తాను నుం జని వేగ మృగ విహగ తరు గిరి ప్రముఖ నిఖిలచరాచరంబులం జూచి యేచిన దైన్యంబున. ౨౩౩.

టీక.—అన్వేషణంబు = వెదకుట. చరాచరంబులన్ = జంగమ స్థావరములను.

ఉ. మిక్కిలి సా దనం దగిన మేటి నెఱుంగరె మల్లులార? మే
లెక్కుడురూపువాని నిట నిచ్చటఁ గానరె మావులార? పే
రక్కఱ నూని పెంపు గని నాతనిఁ జూడరె ధాత్రులార? యిం
పెక్కిన కొమ్మలార కనరే సుకుమారుఁ గుమారరత్నమున్? ౨౩౪.

టీక.—సా దనన్ మంచివాఁ డనుటకు (గరిడిచే అనియు). మల్లులార = మల్లె లార (వస్తాదులార). ఎక్కుడు = ఉత్కృష్టమయిన (ఎక్కునట్టి). మావులార = చూతములారా (గుఱ్ఱములారా). పెంపు గనిన = పుష్టిని పొందిన. ధాత్రులార = ఉసిరిక లార (దాదులార). కొమ్మలార = శాఖలార (చెలువలార).

తే. మీకులము లేటిఁ జేపట్టి మీవిరోధి
యైన పులిఁ జెండి మైచర్మ మూనెఁ గాదె?
యట్టిమేలైన నెఱిఁగి యా హరునిపేర
నెసఁగు సారంగధరుఁ జూపుఁ డేణులార. ౨౩౫.

టీక.—హరుఁడు లేడిని చేపట్టి (రక్షించి - చేతఁదాల్చి)నవాఁడు, పులితోలు దాల్చువాఁడు. సారంగధరశబ్దమునకు హరుఁడును అర్థము.

శా. 'నాళీకారికి నొక్కజింక, నొక యేణం బంజనాకామికిం,
గాళీకాంతున కొక్కలేడి, యిడె యింకం! గూడు నే? మూఁడువా
టాలుం బెట్టిన చెంగనాలు, మము ముట్టన్ రాకుఁ డన్ రీతి మీ
రేలా పోయెద రేణులార? నిలువుండీ మాసుతుం జూపుఁడీ. ౨౩౬.

టీక.—నాళీకారికిన్ = చంద్రునికి. ఏణంబు = జింక. అంజనాకామికిన్ = వాయువునకు. కాళీకాంతునకున్ = శివునికి. వాటాలున్ = భాగములును. చెంగనాలు= నమస్కారములు.

సీ. తరులార చెంచుబిత్తరులార కానరే
మాకుమారునిఁ బోలు మాకుమారు?

హరులార పవమాన హరులార కానరే
మాకుమారునిఁ బోలు మాకుమారుఁ?
జములార లేటిమచ్చరులార కానరే
మాకుమారునిఁ బోలు మాకుమారుఁ?
గరులార మౌనిశంకరులార కానరే
మాకుమారునిఁ బోలు మాకుమారు?

తే. నదములార చలత్కోకనదములార
శుకములార ప్రఫుల్లకింశుకములార
మాకు మాఱు వచింపని మాకుమారు
గానరే? యని వెదకి రక్కానలోన. ౨౩౭.

టీక.—మాకుమారునిఁ = లక్ష్మీపుత్త్రుఁడైన మన్మథుని. హరులార = సింహములారా-లేక - క్రోఁతులారా. పవమానహరులార = లేడులారా. లేటి మచ్చరులార = లేళ్లకు శత్రువులగు పులులార. మౌని శంకరులార = ముని శ్రేష్ఠులారా. నదములార = పడమటికి పాఱెడు నేఱులారా. కోకనదములార = ఎఱ్ఱగలువలారా. ప్రఫుల్ల కింశుకములార = పూచిన మోదుగులారా.

సీ. కర్పూరవాసనల్ గలయంగఁ బొలయంగ
సారంగధరుఁ డని చేరఁ బోవు,
శ్రీగంధవాసన ల్చిక్కంగ నిక్కంగ
సారంగధరుఁ డని చేరఁ బోవుఁ,
గస్తూరివాసనల్ గమ్మంగ గ్రమ్మంగ
సారంగధరుఁ డని చేరఁ బోవు,
జవ్వాదివాసన ల్జడియంగ నుడియంగ
సారంగధరుఁ డని చేరఁ బోవుఁ,

తే. బోయి ఘనసార ఘనసారభూజ మృదుప
టీర మృగకుల సంకుల కొంకుల నట

స్రుక్కి తద్గంధమహితాంగు సుతుని నతఁడు
కానకడల విచారించి కాన కడల. ౨౩౯.

టీక.—ఘనసార = ఎక్కుడుచేవగలిగిన - ఘనసార భూజ = కప్పురపుఁజెట్లు- మృదుపటీర = కోమలమయిన చందన (వృక్ష) ములు - మృగకుల = కస్తూరిమృగము లకదుపులు - సంకుల = జవ్వాదిపిల్లులు - అనువానియొక్క - టెంకులన్ = తావుల యందు. పెద్దపాదములకును గీతమునకును గల క్రమాలంకారము నరయునది.

క. తలవరులున్ నెలవరులుం । బొలపరులున్ వచ్చి యంత భూపాలునితో
మలలందున్ సెలలందున్ । శిలలందును నెల్ల నారసితి మే మందున్.

టీక.—నెలవరులు = చోటెఱిఁగినవారు. పొలపరులు = జాడతెలిసినవారు. సెలలందున్ = సెలయేళ్లలో.

ఉ. కాన మటంచుఁ జెప్పినఁ గకావికలైన మనంబుతో నర
ణ్యానిఁ గులాంగనాసహితుఁడై యటఁ గ్రమ్మఱి వచ్చి కామినీ
సూనశరోపమాన సుత శోణిత పంకిల భూమి నామహీ
జాని భుజానిరాహత విశాలశిలాచయుఁడై పడెన్ వడిన్. ౨౪౦.

టీక.—అరణ్యానిన్ = మహారణ్యమందు. సూనశర = మన్మథ. శోణిత పంకిల = రక్తముచేత బురదయైన. మహీజాని=రాజు.

వ. అప్పుడు. ౨౪౧.

క. అ క్కొండిఁ, యీ రెలుంగై
చెక్కులు సెమరించి, నెఱులు చిక్కులు వడి, కా
ల్ప్రొక్కి, వసి వాడి, యూర్పుల
వెక్కం గెమ్మోవి కమలి, వికలాంగముతోన్. ౨౪౨.

టీక.—అక్క = ఓమ్మ. ఈ రెలుంగు = దుర్బలస్వరము. వెక్కన్=వేఁడిచే.

క. పట్టాభిషిక్తుకడుపునఁ । బుట్టి మహారాజ్యసుఖముఁ బొందక, కుడువం
గట్టం గల కాలంబునఁ । గట్టా! నీ కడవిపాలు గావలసెఁ గదా! ౨౪౩.

క. ఎట్టోర్తు నన్న! నీ పీ । కట్టిఁడి యగు దొడ్డరాజు కడుపున నేలా
పుట్టితివి? పేదకడుపునఁ । బుట్టిన నొక కొంతకాలము సుఖింతువుగా.

ఆ. నిను వధించినట్టి వెనుక నయ్యశరీరి
పలుక కుండె నేమి పలికె నేమి ?
నీవు చచ్చువెనుక నామృపాచిత్రాంగి
పొలియ కుండె నేమి పొలిసె నేమి ? ౨౮౫.

టీక.—అశరీరి యని తిరస్కారముచే నపుంసలింగము.

సీ. సంపెంగనూనెవాసనలఁ బెంపెక్కిన
యలకలా యివి కూర్మితళుకుమొలక !
చిట్టాడునాఁడు నాచిటికెనవ్రేలు పట్టు
చేతులా యివి ముద్దుఁజిన్నికూన !
ఘలుఘలు మని యందియలు మ్రోయ నడయాడు
నడుగులా యివి ప్రోదియనుగుఁజూల !
ప్రేమ నాచ న్నిచ్చి పెంచిన నీమేని
నెత్తురా యిది పూపనెనరుపట్టి !
తే. యనుచు నట రాలి యున్నట్టి యతనికురులు
కరచరణఖండరక్తపంకములు మమత
నెత్తి యక్కునఁ జెక్కున నొత్తుకొనుచు
నిందుముఖి యేడ్చెఁ గోయిల లెల్లఁ గదియ. ౨౮౬.

అంత మూర్ధాభ్రకాంతుఁడై నమహీకాంతుం డాకకొంతతడవునకుం
దెలిసి సంతాపంబున. ౨౮౭.

ప్రేయసిమాట యట్లు చెవిఁ బెట్టి వృథా కరపాదహీనునిం
జేయుట కాక, జీవ మెడఁజేయఁగ వచ్చితి నంచు, దాఁగితో ?
నాయపరాధ మిం కిట మనంబున సైరిచి పల్కవోయి ! రా
వోయి! కుమార! యెం దడఁగి తోయి! యటం చెలుఁ గెత్తి చీరుచుఁ.
పరరాష్ట్రమున కైనఁ బాటిపో బెదరించి
యిట్టట్టు గాసి చేయింప నైతిఁ,

ద ప్పొప్పు శోధించి తరువాతఁ జెప్పెద
  నంచు నేటికిఁ జెఱ నుంచ నైతి,
సుఖముల నందిచ్చు సుతుఁడు గల్గఁడు గాక
  లలన లేయరు దని తలఁప నైతిఁ,
బదరి కార్యము సేయుపరుషవర్తనుఁడు వి
  పన్నుఁడౌ ననునీతి యెన్న నైతిఁ,
తే. గూఁడు చవి యని తిన నింకఁ గూడు నోకొ?
తనువు త్యజియింతు.—ననుచు వింతనువు మీఱ
గుండు మెడఁ గట్టి భూభుజంగుండు నింపు
చెఱువులోఁ బడఁ బోఁగ నచ్చెరువు గాఁగ. ౨౪౯.

టీక.—వింత అనువు = చిత్రమయిన విధము. భూభుజంగుండు = రాజు.

చ. పలికె రయంబునం జదలిపల్కులచిల్కలకొల్కి యంత 'హా!
నిలు! నిలు! రాజ! యిట్లు దగునే త్యజియింపఁ? బుడారిపట్టి యై
యలరినమత్స్యనాథుఁ డనుసట్టిమహాత్మునిదండ నీదుగా
దిలిసుతుఁ డున్నవాఁడు. కడు దీమస మేది తలంక నేటికిన్? ౨౫౦.

టీక.—చదలి...ల్కి = ఆకాశవాణి. దీమసము = ధైర్యము. ఏది = నశించి.

ఉ. మేరుగిరీంద్రచాపునియమేయకృపారసపూర్ణదృష్టి నీ
కూరిమిపట్టిపైఁ గలదు; కొంచెములోనవె కాయసిద్ధికిం
గారణ మున్న; దాతనికిఁగా నుదిఁ గుందకుఁ డీయనిత్యసం
సార మి దేమి బ్రాఁతి? ధర శాశ్వతుఁ డై మను నాతఁ డున్నతిన్.

టీక.—బ్రాఁతి = అతిశయము.

క. ఎక్కడిసుతు లెక్కడిసతు
లెక్కడితలిదండ్రు లెవరి కెవ రౌదురో? కొన్నా
ళ్లక్కఱపడి తిరుగాడుదు
రక్కట! యిది యంత మాయ యని యెఱుఁగరుగా. ౨౫౧.

క. మరు లింత దగునె? నృపతికి?। ధరపాలన సేయ కునికి ధర్మం బగునే?
సరగునఁ దిరిగి పురంబున। కరుగుము చింతిలక మానవాధిపతిలకా.

ఆ. అతఁడు కరపదద్వయమ్ములు వచ్చి నీ
కడకు వచ్చి చూడఁగలఁడు మీఁద;
నధిప, నమ్ము దీని కనుమాన మేమియు
నింక వలదు వగల నింకవలదు.' ౨౯౮.

టీక.—ఇంక వలదు = కృశింప నక్కఱలేదు.

క. నావుడుఁ దహతహ పీడ్కొని
దైవారిన వేడ్క రాజధానికి వేగన్
దేవియుఁ దానును నరిగి మ
హీవల్లభుఁ డచట రాజ్య మేలుచు నుండెన్. ౨౯౯.

టీక.—దైవారిన = నిండిన.

వ. అంత నచ్చట మత్స్యేంద్రుండు నరేంద్రనందను నొక్కమంచిమం చెపై నుంచి నిచ్చలుఁ గృపాలుండై గోపాలుండు నిచ్చల మగుభక్తిని దెచ్చి యిచ్చుపాలు నగపాలు బాలునిపాలు గావించి పోషించుచు నధ్యాత్మజ్ఞానోపదేశం బొసంగం దలంచి యత్యంతనిష్ఠ నిష్టాసనా సీనుం జేసి యోగాసన బంధవిశేషంబులు రేచకపూరకకుంభకంబుల విధంబులును రాజయోగ హఠయోగ లయయోగ మంత్రయోగ లంబికాయోగంబు లాదిగాఁగల యోగంబులవృత్తాంతంబులం దెలిపి యభ్యాసంబు సేయింపం, గతిపయదినంబులకుం బనుపడి యోగాసం దుండై యుండం జూచి, సమీచీన యోగసమాధిగాఁ దెలిసి కరచరణా భ్యుదయసంపత్సంపాదనసమయం బిది యని యతం డూర్ధ్వదృష్టిం జ క్కం జూడకుండుటఁ బైకి నొకయఖండగండోపలం బెగయవైచి 'యిది తప్పక చూడుమూ, చూడ కున్నం జూడాతలంబునం బడు.' ననినం, దనదృష్టి మరల్పక చూచుచుండఁ గొంతకాలంబునకు. ౩౦౦.

టీక.—నిచ్చలము = నిర్దోషము. అధ్యాత్మజ్ఞాన = బ్రహ్మజ్ఞాన. కర...దన =

కాలు సేతులు మొలచు భాగ్యమును కలిగించుటకు. అఖండ గండోపలంబు = పెద్ద ఱాతిబండ. చూడాతలంబునన్ = నెత్తిమీఁద.

చ. మొలక లొకింత గానఁబడి మోసులు మెల్లనె వెళ్లి, సోగ లై
నెలకొని, వ్రేళ్లు గోళ్లును జనించి, చొకారము లై, మిటారికెం
దలిరుల బొమ్మ గట్టి, యలతమ్ముల యెమ్మెలు చూఱ వట్టి, యిం
పలరఁగ వచ్చె వాని కిరవై తగ వింతగఁ గాళ్లు సేతులున్. ౨౫౭.

టీక.—చొకారములు = అందమయినవి. బొమ్మ గట్టి = హేళనముచేసి. చూఱ వట్టి = కొల్లపెట్టి.

తే. కాంచి యపుడు ప్రమోదించి మంచె దించి,
నడవఁగా లేకయుండెడు నాతనికిని
దనకరము లిచ్చి హాగుపట్టి యొనరఁబట్టి,
యల్ల నడుగిడఁ జేసెఁ బా టగుటఁ జేసి. ౨౫౮.

టీక.—పాటు = వాసి (కుదురుపాటు.)

సీ. జుట్టువ్రేళ్ళను రెండుఁ బట్టించి నడిపింపఁ
దలఁకుచు రా లేమి బలిమిఁ దిగుచుఁ,
దనచేతినిడుదలాతపుఁగోల యందిచ్చి
మెల్లమెల్లనె కొంత మెలఁగ జేయు,
నవలంబ ముడిగి ర మ్మన నా ల్గడుగు లేఁగి
పడఁబోవ గ్రక్కునఁ బట్టి నిలుపుఁ,
జనుదెంచి బిసబిస దను నంటుకొ మ్మని
వచ్చిన నగుచు నవ్వాలని కరుగు,

తే. నాఁడునాఁటికి నీరీతి నడవ నేర్పఁ
గొన్నినాళ్లకు నలవడి కొంకు దీఱి
లెస్స లై కరపదములు లీలఁ దనరఁ
బ్రేమ సారంగి యనియెడి పే రొసంగి. ౨౫౯.

టీక.—జుట్టువ్రేళ్లు = చూపుడువ్రేళ్లు. అవలంబము = పట్టు. బిస బిసన్ = వడి వడిగా.

ఉ. సద్గుణరాశి యై తనరుసాత్త్వికమాళికి వత్సలత్వసం 26992
పద్గరిమన్ సమస్తమణిమంత్రమహౌషధవస్తు లిచ్చి శం 25-3-73.
భద్గతి సిద్ధయోగకుల పట్టము గట్టి కృతార్థుఁ జేసినం,
దద్గురునాథుమాట జవ దాఁటక నిశ్చలభక్తియుక్తుఁ డై. ౨౬౦.

తే. కాయసిద్ధి వచస్సిద్ధి గలిగి యతఁడు
చెలులకాంక్షలు క్షుత్పిపాసలును లేక
పట్టినది యెల్ల బంగారుగట్టు గాఁగ
మెట్టినది యెల్ల నిధియునై మెలఁగుచుండె. ౨౬౧.

తే. ఉండి యొకనాఁడు తమవార లున్నకడకుఁ
బోయిరావలె నని బుద్ధి పొడమి వేఁడు
కొనె గురుని; నాఁ గదా వివేకులకు నెల్లఁ
దల్లిదండ్రులు మఱవరాఁ దగనివారు. ౨౬౨.

తే. గురునిపంపున సంతోషభరితుఁ డగుచు
బాదుకలు మెట్టి తలిదండ్రిపజ్జఁ దలఁచె;
దలఁచినప్పుడె పోయి ముంగలను నిలిచె;
నిలిచినప్పుడె విస్మయాస్పదు లగుచు. ౨౬౩.

టీక.—పజ్జన్ = పార్శ్వమునందు.

'మా నేరమి మనంబులో నుంప కిటు వచ్చి
తక్కఱగలయట్టి యనుఁగుఁబట్టి;
యాకాశవాణివాక్యంబుచే బ్రతికి నీ
కెదురుసూచితిమి సు మ్మిన్నినాళ్ళు;
మావంటిభాగ్యసంపన్నులు లేరుగా,
గ్రమ్మఱ నినుఁ జూడఁ గలిగెఁ గాన;
నీశ్వరాంశంబ వౌదుఁ దీవు; గాకుండిన,
మనుజమాత్రున కింతమహిమ గలదె?'

తే. యనుచు మొగములు దెలిసి, దేహములు పొంగి,
పలుమఱును గౌఁగిలించుచుఁ, బాణిపాద
తలము లలముచుఁ, దలిదండ్రు లలమి నపుడు
వారివేడుకలకు మితి మేర గలదె ? ౨౬౫

ఉ. ఇక్కరణిన్ సుహృజ్జనము లెంతయుఁ గన్నులఁ గప్పగొంచుఁ బే
రక్కఱఁ బూజ సేయ, నతఁ డందులఁ గొన్నిదినంబు లున్న, 'నా
చక్కనియన్న, యీధరణిచక్ర మశేషము నీవ యేలు ; నీ
చక్కి భుజించుచుండెదము సౌఖ్యముతో.' నని తండ్రి పల్కినన్.

తే. నాగురుం డైనయలమత్స్యనాథుతోడ
'నిదిగొ మావారిఁ జూచి వచ్చెద' నటంచుఁ
బ్రార్థన మొనర్చి వచ్చిన రాక గాని,
రాజ్యభోగేచ్ఛ వచ్చిన రాక గాదు. ౨౬౬

సీ. సర్వ సర్వంసహా నిర్వాహక ఖ్యాతి
కాయసిద్ధిఁ బొసంగఁ జేయఁ గలదె?
యంగనా దృఢ కుచాలింగ నానందంబు
ప్రాయంబు తిరముగాఁ జేయఁ గలదె ?
గంధసింధురఘటా గంధర్వ భట సేన
సిద్ధక్రియలు గల్గఁ జేయఁగలదె ?
దివ్యరత్నావళీద్రవ్యరాశిసమృద్ధి
జీవద్వయఃప్రాప్తిఁ జేయఁగలదె?

తే. యిన్నియును గల్గె గురుకృపాదృష్టివలన ;
యోగలీలాసుఖముకన్న నొక్కసుఖము
గలదె ? యని యిట్లు జ్ఞానంబు దెలిపి వారి
ధన్యులుగఁ జేసె సారంగి దయఁ జెలంగి. ౨౬౭

టీక.—సర్వంసహా = భూమియొక్క. ప్రాయంబు = యౌవనమును. గంధ...

సేన = మదపుటేనుఁగుల సమూహము గుఱ్ఱములు బంట్లు వీనిదండు. జీవత్ వయః ప్రాప్తిన్ = చావులేని యాయుస్సుయొక్క లబ్ధిని.

తే. వంశకరుఁ డైనసుతుఁ డుద్భవంబు నొందఁ
గలఁడు మీకొకఁ డని యనాగతముఁ దెల్పి
'వచ్చి తడ వయ్యె; నింకఁ బోవలయు గురుని
యొద్ద క' ని తల్లిదండ్రుల నుపచరించి. ౨౬౮.

ఉ. అచ్చటు వాసి, యాశివపదాంబుజభక్తిధురంధరుండు మున్
వచ్చినత్రోవ నేఁగి, గురునాథునకుం బ్రణమిల్లి నిల్చినన్ ;—
'వచ్చితె యన్న ? రాజ్యవిభవంబులు హస్తగతంబు లైనచో
హెచ్చు గదన్న ? నీకుఁ బ్రతి యెవ్వరు జ్ఞానమహత్త్వసంపదన్ ?'

చ. అని గణుతింప నగ్గురుకులాగ్రణి సేవను జాలఁ జేసి, దీ
వనలు వహించి, పుణ్యు లగువారలకుం దనదివ్యమూర్తిఁ గుం
భినిఁ గనిపించుచున్, దనదుపేరు దలంచినవారికిన్ యశో
ధనములు గల్గఁ జేయుచు సదా యతఁ డుండుఁ జిరాయున్నతిన్.

క. సారంగధరుచరిత మె
వ్వారుం జదివినను వినిన వ్రాసిన సౌభా
గ్యారోగ్యపుత్త్రపౌత్త్ర
శ్రీరత్నజనాభివృద్ధిఁ జెలఁగుదురు సుమీ. ౨౭౧.

[ఈ క్రింది పద్యములయర్థమును విజయవిలాసంబునం జూడుఁడు.]

క. కలహారంభణ కౌతూ। హల పులకిత భుజ పరాక్రమార్జిత నానా
జలదుర్గ వనీదుర్గ। స్థలదుర్గాహార్యదుర్గ సామ్రాజ్యనిధీ. ౨౭౨.

ఉ. క్ష్మాళగశైలలాంఛన విజిత్వర శుభ్రయశోవిశాల, ధా
రాళగళన్మదద్విప విరాజిసభాభవనాంగణా, ధనా
వేళగరిష్ఠదాన పదవీపరితోషిత కాశి గౌతమీ
చోళకవిద్విజస్తుతివచోలగ చోలగమానభంజనా. ౨౭౩.

# సారంగధర చరిత్రము.

[భుజంగప్రయాతము.]

అరాతిక్షమాభృద్భిదాంచత్కృపాణా,
నరాధీశ్వరాకార నాళీక బాణా,
స్థిరానందనా రామసేవాధురీణా,
విరాజచ్చతుష్షష్టివిద్యాప్రవీణా.

(గద్య)

ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాదలబ్ధ ప్రసిద్ధ వాగ్వైభవ చేమకూర లక్ష్మణామాత్య తనూభవ సదారాధిత బుధసమాజ వేంకటరాజ ప్రణీతం బైన సారంగధర చరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ

తృతీయాశ్వాసము

సంపూర్ణము.

---